Telugu Classics – Popular Edition Series

# శృంగారశాకుంతలము



## పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి

సంపాదకురాలు :

శ్రీమతి నాయని కృష్ణకుమారి, ఎం. ఏ.




ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవనం : హైదరాబాదు - 4

# తొలిపలుకు

ఆంధ్రప్రదేశ్ మాజీ మంత్రివర్యులు శ్రీ యం. ఆర్. అప్పారావుగారు చేసిన సూచన ననుసరించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ తెలుగుభాషలోని ప్రాచీన సాహిత్యము అందరికి అందు బాటులో నుండునట్లుగా ముద్రించి ప్రకటించవలెనని నిశ్చయించి నది. తెలుగుభాషలోని పూర్వగ్రంథ సముదాయము ఈనాడు పాఠకునికి సక్రమముగా సరసమైనధరకు లభ్యమగుట లేదు. ఈ లోటును తీర్చి ప్రాచీనగ్రంథసంచయమును విడివిడిగా ప్రకటించు టకు సాహిత్య అకాడమీ, ఒక ప్రణాళికను సిద్ధము చేసినది. ఈ ప్రణాళిక ప్రకారము ఈకార్యక్రమము మూడు తరగతులుగా విభజించనైనది. మొదటిది ప్రాచీనప్రబంధాల ప్రకటన; రెండవది మహాభారతము, భాగవతము, హరివంశము, భాస్కరరామాయణము, బసవపురాణము, భోజరాజీయములను సంగ్రహించి ప్రకటించుట; మూడవది భారతభాగవతాలనుండియు, నాచన సోమన, కంకంటి పాపరాజు, కూచిమంచి తిమ్మకవి రచనలనుండియు భాగాలను ఏర్చి కూర్చి ప్రకటించుట. మొదటి తరగతిలో 27 ప్రబంధాలను 27 సంపుటాలుగా, రెండవ తరగతిలోని గ్రంథములను 15 సంపుటా లుగా, మూడవ తరగతిలోని గ్రంథాలను 8 సంపుటాలుగా - మొత్తము 50 సంపుటాలను ప్రకటించు కార్యక్రమము స్వీకరించ వలెనని అకాడమీ తీర్మానించినది.

ఈ ప్రణాళిక ప్రకారము ప్రతి సంపుటము 1/8 డెమ్మీ సైజులో క్యాలికోబైండుతో 200 పేజీల గ్రంథముగా నుండవలె నని నిర్ణయించనైనది. ప్రతిగ్రంథములో గ్రంథకర్తనుగూర్చి, గ్రంథ

ప్రాశస్త్యమును గూర్చి వివరించు సుమారు 40 పేజీల పీఠికను చేర్చ వలెనని నిశ్చయించనైనది. ప్రతి సంపుటము వెల ఒక రూపాయి మాత్రమే. ఈవిధముగా యీ సంపుటాలన్నిటిని సుమారు 5 సంవత్సరముల కాలములో ముద్రించి ప్రకటించవలెనని అకాడమీ కార్యవర్గము తీర్మానించినది.

మేము కోరినంతనే ఈ సంపుటము సిద్ధముచేయు బాధ్యతను స్వీకరించి, నిర్ణయించిన గడువులోపల వ్రాత ప్రతిని మాకార్యాలయానికి అందజేసిన శ్రీమతి నాయని కృష్ణకుమారిగారికి అకాడమీ పక్షాన కృతజ్ఞతలు.

పైన పేర్కొనిన 50 సంపుటాల వ్రాత ప్రతులను సిద్ధము చేసి ముద్రించుటకు, అవసరమైన డబ్బును పూర్తిగా అకాడమీకి యిచ్చుటకు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు వాగ్దానము గావించి యిందులో కొంత డబ్బును విడుదలకూడ చేసినవి. ఇందుకు అకాడమీపక్షాన కేంద్ర రాష్ట్రప్రభుత్వాలకు ధన్యవాదాలు. అనుకొనిన వ్యవధిలో సంపుటాలను సిద్ధముచేసి, ఆంధ్రపాఠకలోకానికి అందజేయుట జరుగగలదని విశ్వసించుచున్నాము.

హైదరాబాదు,
15-5-1967.

దేవులపల్లి రామానుజరావు,
కార్యదర్శి

# విషయసూచిక

# పీఠిక

పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి పదునేనవ శతాబ్ది యుత్తరార్ధమునందినవాఁడు. ఈయన రచించిన కావ్యములలో నీనాటికి లభించినవి రెండుమాత్రమే. అందు మొదటిది శృంగార శాకుంతలము. ఈ గ్రంథపీఠికయందు కవి తన రచింపఁ బూనిన కావ్యము నొకచోట [1]శాకుంతలం బను ప్రబంధ మనియు, మఱియొక చోట [2]శాకుంతల కావ్య మనియు పేర్కొనెను. ఆశ్వాసాంత గద్య యందు [3]శాకుంతల శృంగార కావ్య మని వచించెను. ఎచ్చటను కవి యీ కావ్యమును శకుంతలా పరిణయ మని చెప్పలేదు. పినవీరననాటి కింకను 'కావ్య', 'ప్రబంధ' పదములు వాడుకయందు పరస్పర వినిమయము నంగీకరించు పదములుగనే యున్నవి. కొన్ని నిర్దిష్టలక్షణములచే ప్రబంధపదము కావ్యపదము కంటె భిన్నముగా రూపొందుట పదునాఱవ శతాబ్దిలో జరిగినది. [4]ఆ లక్షణములు : 1. అష్టాదశ వర్ణనాభూయిష్ఠత, 2. శృంగార రస పోషకమగు కథ, 3. అక్లిష్టమును ఏకైకనాయకాశ్రితమునగు కథ, 4. అర్థ గాంభీర్యముకంటె శబ్దాలంకార పరిపుష్టత, ప్రౌఢ శయ్యా సౌందర్యము, ననివార్యము లగుట, 5. నీతి బోధయో, ధర్మ ప్రతిపాదనయో కాక, కావ్యము ఆనందదాయకమైన చాలు ననెడి లౌకిక దృష్టితో గూడిన కవిత్వాదర్శము. ఈలక్షణములలో మిక్కిలి ప్రముఖములైన వర్ణనా వైపుల్యమును, శృంగార ప్రాధాన్యమును ఆంధ్ర సాహిత్యముయొక్క

---

1. తద్వచనప్రకారంబున మిశ్రబంధంబుగా శాకుంతలంబను ప్రబంధంబు బంధుర ప్రీతిం జెప్పఁబూనితి. శాకుంత. 1. 28.

2. నా యొనర్పం బూనిన శాకుంతలకావ్యకథాలతాలవాలంబగు పురీల లామంబు. శాకుంత. 1. 68.

3. పిల్లలమఱ్ఱి పినవీరభద్ర ప్రణీతంబైన శాకుంతలశృంగారకావ్యంబునందుఁ బ్రథమాశ్వాసము. శాకుంత. 1. 189.

4. ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము -- ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనముగారు. పుట. 115.

ప్రారంభదశనుండియు కావ్యములందు కాన్పించుచునే యుండె ననవచ్చును. పదునొకండవ శతాబ్దమున నాంధ్ర సాహిత్యలత మహాభారత మను తొలిపూవును విడిసినది. ఆనాటినుండియు నెఱ్ఱాప్రగడ కాలము వఱకును అనగా క్రీ. శ. 1020 నుండి 1375 వఱకును వచ్చిన తెలుగు సాహిత్యమును [1]భాషాంతరీకరణ యుగ సాహిత్యముగా కొందఱును, [2]ఆదిమ యుగమునకు చెందిన సాహిత్యముగా మఱి కొందఱును తలచిరి. మూఁడు వందల యేండ్లకు పై బడిన కాలములోని సాహిత్యము నంతటిని ఒకే పేరుక్రింద నిర్దేశింప బూనుకొన్నచో నా నామకరణము అన్వర్థముగా నుండుట కష్టసాధ్యమే యగును. పురాణ యుగ మను నామము సరిపోవునట్లు చూచుటకై యా దృష్టితో నీ కాలములోని సాహిత్యమును సమీక్షింప బూనుకొంటిమేని యీ సమీక్షకు లొంగని గ్రంథము లెన్నియో యీ యుగమున స్పష్టముగా గోచరించును. అందు మొదటిది నన్నెచోడుని కుమార సంభవము. ఇందున్న వర్ణనా వైపుల్యమును, శృంగార రస ప్రధానములుగా నిందు తీర్చబడిన ఘట్టములును భారతరచనకంటె భిన్నములుగా మనకు గోచరించును. ఎఱ్ఱన హరివంశము పురాణమార్గమున కథితము కాగా నాచన సోమన హరివంశము ప్రబంధపద్ధతియందు తీర్చిదిద్దబడినది. ఎఱ్ఱన తనకు గల యనన్య కల్పనారామణీయకమును, వర్ణనా నైపుణ్యమును, చాటిన నృసింహ పురాణము పేరునకు పురాణమే యైనను ప్రబంధ లక్షణములను సంతరించుకొని యాయనకు గల ప్రబంధపరమేశ్వరబిరుదము నన్వర్థము చేసినది. అట్లే దీనిని భాషాంతరీకరణ యుగమునకు చెందినదిగా నిర్దేశించుటయు తగదు. ప్రప్రథమ గ్రంథ మైన భారతము భాషాంతరీకృతి యైనంత మాత్రమున నీ పేరు నిర్థారింప బూనుకొంటిమేని యిందలి కావ్యము లెన్నియో భాషాంతరీకరణములు కాకపోవుటచే నీనామకరణమున కవ్యాప్తిదోషము పట్టును. నన్నెచోడుని కుమార సంభవము, తిక్కన నిర్వచనోత్తర రామాయణము, నాచన సోముని హరివంశము, ఎఱ్ఱ నృసింహ పురాణము, మంచన కేయూరబాహు చరిత్రమును భాషాంతరీకరణములు కావు. సంస్కృత భాండారములోని కావ్య పురాణ నాటక గత కథల ననుసరించి పెంచియో, త్రుంచియో యొక సముచితరమణీయమగు రూపము నిచ్చి స్వతంత్రముగా నిర్మించిన యుత్తమ కావ్యములు. చిత్ర విచిత్ర వర్ణములతో భాసించు సుగంధి కుసుమములు ఒకే సూత్రమునకు గ్రథితములై మనోహర హారముగా భాసించునట్లు, పురాణ పరివర్తనములును (భారత, రామాయణములు, హరివంశము) పురాణాంతర్గత కథాబీజము చుట్టును నిర్మింపబడిన రమ

1. ఆంధ్ర వాఙ్మయచరిత్ర — ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు.
2. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర — కీ. శే. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు.

ణీయ కావ్యములును (కుమార సంభవము, ఉత్తర హరివంశము, నృసింహ పురాణము, ఉత్తర రామాయణము) అటు పురాణములును, ఇటు ప్రబంధ లక్షణాంచితములును గాని కథాకావ్యములును (దశకుమార చరిత్ర; కేయూర బాహు చరిత్ర) కలసి మెలసి యుండి ఆదినుండి మూడు వందల యేండ్ల తెలుగు సాహిత్య చరిత్రకు వన్నెగూర్చినవి. ఇచట పురాణ ధోరణితో పాటు సరిసమానముగ ప్రాధాన్యము వహించి రూపులు దిద్దుకొన్న ప్రబంధ లక్షణాంచితమైన పద్ధతి, తెలుఁగు సాహిత్యమున ఎఱ్ఱన తరువాత క్రొత్త పోకడలను త్రొక్కినది. [1]క్రీ. శ. 1375 నుండి 1500 వఱకును గల కాలమును సాహిత్య చరిత్రలో శ్రీనాథ యుగముగాఁ పేర్కొనిరి. ఎఱ్ఱన వఱకును గల ప్రబంధ లక్షణాంచితములైన కావ్యములలో కేవలము వర్ణనా వైశద్యమును, అక్కడక్కడ శృంగార రస ప్రాధాన్యమునుమాత్రమే మనము గ్రహింపగలము. కాని శ్రీనాథ యుగము నందలి కావ్యము లన్నిటి యందును ఈ రెండు లక్షణములే కాక శబ్దాడంబరముతో గూడి ప్రౌఢమై, దీర్ఘ సమాస భూయిష్ఠమైన శైలీ విన్యాసమును, కవి తాను మోజుపడిన సన్నివేశమునో, వస్తుప్రపంచమునో, భావ పరంపరనో కథాకథనమున కడ్డు వచ్చుచున్నను అతిమాత్రముగాఁ వర్ణించి తీరవలయు ననెడి యుత్కంఠయు నుండితీరును. ఈ యుగమునకు కర్తయైన శ్రీనాథుడు సంస్కృతాంధ్ర శబ్దముల మీద తిరుగులేని యధికారము కలవాడు. భేరీ భాంకారము ననుకరించు సంస్కృత సమాసకల్పనతోపాటు వీణా మృదురావము ననుకరించు తియ్యని తెలుగు పదముల కూర్పును నీయన సొమ్ము. కథ చెప్పుచున్నంత సేపును నీకవిదృష్టి యా కథాకథనముపై గాక యా కథ సాగు పద్ధతిపై నిష్ఠమై యుండును.

ఈయన పురాణకథను తీర్చ దిద్దవలసి వచ్చినను వానిని ప్రబంధ మార్గముననే చెప్పును. అందు కీయన కాశీఖండ భీమఖండములు చక్కని యుదాహరణములు. శ్రీనాథు డీవిధముగాఁ తన కవితామార్గమును సుస్పష్టముగా మలుచుకొనుటకు వానికి ముందు మూడు వందల యేండ్లనుండి ఆంధ్ర సాహిత్యమున పాదు గట్టియున్న ప్రాబంధిక కవితా బీజములు తోడ్పడినవి. ఈయన సమకాలీనులును, అర్వాచీనులునైన కవులందఱును ఈయన కవితా ప్రభావము నుండి తప్పించుకొన లేకపోయిరి. ఈ యుగమునందన్ని కావ్యములును, కథ యెట్టిదైనను ఇంచుమించు ప్రాబంధిక పద్ధతియందే తీర్పబడినవి. అచట మనకు కాన్పించు వర్ణనాలంకార శబ్దార్థ గౌరవాది వివిధవిషయములు తీర్పబడిన

1. ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము – ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనముగారు.

పద్ధతియు, ప్రాత కథ క్రొత్త రీతిగా నలంకరింప బడిన వైనమును — అన్నియు శ్రీనాథ కవితా లక్షణములు. అనగా నాయుగలక్షణములు. ఈ యుగము వాడును శ్రీనాథున కించు మించు సమకాలీనుడు నైన పిల్లలమఱ్ఱి పినవీరన యీ లక్షణములచే ప్రభావితుడు కాకుండ నుండలేకపోయెను. ఈయన శృంగార శాకుంతలము శ్రీనాథయుగలక్షణములకు నిర్దుష్టమైన యుదాహరణము.

ఈ యుగము నందలి కావ్యముల నన్నిటిని మూడు విభాగములు చేయవచ్చును.

## 1. పురాణములను పరివర్తించుట :

1. వరాహ పురాణము.
2. జైమినీ భారతము.
3. పద్మ పురాణోత్తర ఖండము.
4. భాగవత దశమ స్కంధము.
5. వాసిష్ఠ రామాయణము.
6. ప్రబోధ చంద్రోదయము.

## 2. పురాణాంతర్గత కథలను ప్రబంధములుగా చెప్పుట :

1. శృంగార శాకుంతలము.
2. హరవిలాసము.
3. కాశీఖండము.
4. భీమఖండము.
5. శృంగార నైషధము.
6. నాచికేతూపాఖ్యానము.

## 3. వివిధ కథలను గూర్చి యేక కావ్యముగా రచించుట :

1. విక్రమార్క చరిత్ర.
2. భోజరాజీయము.
3. సింహాసన ద్వాత్రింశిక.
4. పంచతంత్రము.

పురాణ కథలను ప్రబంధములుగా మలచినవానిలో ప్రసిద్ధములైనవి రెండే కాన్పించుచున్నవి. అందు మొదటిది యుగకర్త యైన శ్రీనాథుని శృంగార నైషధమును, రెండవది పినవీరన శృంగార శాకుంతలమును. నైషధము ఆనాటికే శ్రీహర్షునివలన సంస్కృతమున రచింపబడి యుండుట చేతను, [1]శ్రీనాథుడు తాను హర్ష నైషధ కావ్యమును తెలుఁగున తీర్చుచున్నాడ నని చెప్పుకొనుటచేతను దీనిని స్వతంత్ర గ్రంథ మనుటకు వీలు లేదు. కాని పినవీరన

1. సంతరించితి నిండు జవ్వనంబున యందు హర్ష నైషధ కావ్య మాంధ్ర భాష – కాశీ.

శాకుంతలము అనువాదము కాదు. శ్రీనాథునకు హర్ష కృతి యున్నట్లే, పిన వీరన కభిజ్ఞాన శాకుంతల మున్నను ఆయన యభిజ్ఞానమును తెలుగు చేయబూను కొనలేదు. సరిగదా, [1]మాలకరి పలురకములైన కుసుమముల నొకే దండయం దమర్చి యెత్తులు గావించినట్లు, చందనచర్చ సుగంధ వస్తువులచే వాసించినట్లు, తేనెటీగలు వివిధ కుసుమముల నుండి యింతలింతలు తేనెలు తెచ్చి సమకూర్చునట్లు, భారతప్రోక్త కథ మనస్సున నుంచుకొని, తన రచనా నైపుణ్యమునకు కాళి దాసుని నాటక క్రమమును కొంత చేర్చి శాకుంతలమును వాసింపజేయుటకే కవి యుపక్రమించెను. ఇది యా కాలమునకే యభినవమైన మార్గము. శృంగార నైషధము అప్పటికే పండితప్రశంసల నందుకొనగా దానిచే పెల్లుగా ప్రభావితు డైన పీరన శృంగారప్రధానముగా భారతాంతర్గత గాథను తీర్చుటయే కాక దానికి నామకరణము గూడ నైషధ చ్ఛాయలోనే గావించెను. తాను తీర్చబోవు కావ్యగత రసమునుగూర్చికూడ కవి చర్చించెను. [2]శృంగారమంగియు, మిగిలిన యష్టరసము లంగము లయ్యేనేని ప్రబంధము టంకముబంగారము (పదారు వన్నె బంగారము) సామ్యమున ప్రకాశించు ననియు, నందువలన [3]ప్రసిద్ధయు శృంగారవతియునై శ్రీ మహాభారతమున కథితమైన, శకుంతలాఖ్యానమును ప్రబంధముగా జేయుదుననియు దెలిపెను. ఇట్లభినవమైన మార్గమున, శృంగార నైషధముచే ప్రభావితమై, స్వతంత్రముగా రూపొందిన ప్రబంధము శాకుంతలము.

కవి భారత ప్రోక్త కథను గాని, కాళిదాసుని నాటక కథను గాని

1. శాకుంతలము. 1. 27.

2. శృంగారము ముఖ్యంబగు నంగియు నంగములు దలప నష్ట రసములుఁగా
సాంగమగు నేని టంకము బంగారముతోడి యొరప్రబంధము నొందుఁగా.
శాకుంతల. 1. 25.

—ఈ పద్యము నుదహరించుచు తమ సమగ్రాంధ్ర సాహిత్యమున నారుద్రగా రిట్లు వ్రాసిరి :– "అష్ట రసాల్లో శృంగారం మిన్న అని ఆ రోజుల్లో భావించే వారు. (కవిత్రయంలో ఒకరైన) ఎఱ్ఱయ్యగారూ, పినవీరయ్యా అష్టరసాలనే పేర్కొనడం వల్ల క్రీ. శ. 14, 15 శతాబ్దాలలో సోమరాజుపల్లె ప్రాంతాలలో విద్వాంసు లష్టరసవాదు లనుకోవాలె–" కాని పై పద్యము వలన పినవీరయ్య అష్టరసవాది యను నర్థము తీయవచ్చునా! శృంగార మంగి యైనచో నంగము లుగా భాసించు నవి యష్టరసములు కాగా వెరసి తొమ్మిది యనియు దానివలన పినవీరయ్య నవరసవాదియే యనియు స్పష్టమగుట లేదా !

3. శాకుంతల. 1. 26.

పూర్ణముగా స్వీకరింపక వానిలో తన కిష్టమైన కథాంశములకు స్వకపోల కల్పనను జోడించుటలో పాటించిన యౌచిత్య మెట్టిది? అందున సాధించిన ప్రయోజన మేమి?

భారతకథయందలి దుష్యంతుడు ధీరోదాత్త నాయకుడుగా నిలుచుటకు తగడు. ఎఱిగి యెఱిగి లోకోపవాద భీతిచే ననత్య దోషమునకు పాలైన వాడు నాయకుడగుట కావ్యనాటక మర్యాదకు విఘాతము కలిగించు నంశము. అందువలన కాళిదాసు తన దుష్యంతుని ధీరోదాత్తునిగ తీర్చుటకే సంకల్పించెను. దుర్వాసశాపమును కల్పించి ముద్రికను శకుంతల జారవిడుచుకొనెడి ఘట్టమును సృష్టించి రాజునకు మతిమఱపు కల్పించెను. శకుంతలా దుష్యంతుల సమాగమమును రాజసభయందు గాక మారీచాశ్రమమున సంభవింపజేసెను. రాజచటికి వచ్చుటకై దేవదానవ యుద్ధ కల్పనమును, రాజందు దేవతలకు సహాయకుడుగా నేగుటయు కల్పించి, వీరమును నాటకాంతర్గత శృంగారమున కంగముగా పోషించెను. శకుంతలా దుష్యంతుల మధ్య విప్రయోగమును సృష్టించి వియోగ శృంగారమును పోషించెను. అట్లు చిన్నదియు ప్రాసంగికముగా చెప్పబడినదియు, భావ సంఘర్షను స్పష్టముగా చిత్రింపనిదియు నైన భారత కథను రమణీయమైన నాటక కథగా కాళిదాసు తీర్చెను. కాళిదాసువలె పినవీరయ్యా తన కావ్య నాయకుని ధీరోదాత్తునిగా చిత్రించుటకే సమకట్టెను. అందువలన దుర్వాసశాప వృత్తాంతమును కాళిదాసునుండి గ్రహించెను. కాని నాటక కథ కనువుగా తీర్చబడిన నాయికా నాయకుల మధ్య దీర్ఘ వియోగమును కావ్య కథా సందర్భమున కవసరమైనదిగా నాయన భావింపలేదు. దుష్యంతుని శీలమును నిర్దుష్టముగ చిత్రించుటయే ప్రధానాశయము గాని శృంగార భేదమగు విప్రయోగ శృంగారమును పోషించుట యాయనయభిమతము కాదు. కావుననే కాళిదాసమునుండి ముద్రికా ప్రాధాన్యము నంగీకరించినను, శకుంతల దానిని జారవిడుచుకొన్నట్లు చెప్పలేదు. ముద్రికను చూచిన వెంటనే శాపావసానము కలుగునన్న సత్యము రెంటియందును సమానముగ నున్నను కాళిదాసుదుష్యంతుడు ముద్రికను చూచుటకు కొన్ని యేండ్లు పట్టుటయు, పినవీరనదుష్యంతుడు దాని నా సభా భవనము నందే కొన్ని గడియల తరువాత చూచుటయు, నీ రెండు కథల మధ్య గల తారతమ్యమును తెలియజేయును. మొదటిది నాటకోచితముగా నుండగా, రెండవది కావ్యశిల్పమునకు సరిపోయినట్లు తోచును. దీనినిబట్టి పినవీరన శాకుంతలమున నొక్క దుర్వాసశాపకల్పనము తప్ప మిగిలిన కథ యంతయు భారతప్రోక్తముగనే నడచినదనవలయును.

భారతమున శకుంతలోపాఖ్యానము ప్రాసంగికముగా చెప్పబడినది.

యుగ లక్షణములను బట్టి భారత కథ కంటె వర్ణనా వైపుల్య మీ కథ యందు కాన్పించును. విశ్వామిత్రుని తపోవనవర్ణనము, మేనక పుష్పాపచయ ఘట్టము, మధుమాససౌందర్యవిశేషము నిందు వర్ణింపబడిన మేనకా విశ్వామిత్ర శృంగారమున కుద్దీపనములుగా పోషింపబడినవి. అట్లే అంధకార చంద్రోదయాది వర్ణనము, శకుంతలా సమాగమమునకు ముందొక వైపు రాజును, మఱియొక వైపు శకుంతలయు విరహపీడితులగుట, శకుంతలా కృత చంద్ర మన్మథా ద్యుపాలంభనము, సఖీజన కృత శిశిరోపచారములు, శకుంతలా దుష్యంతుల నాలంబనములుగా గలిగిన విప్రయోగ శృంగారమున కుద్దీపనములైనవి. దుష్యంత కృత మృగయా విహారమును, మృగయా సన్నాహమును, మున్యాశ్రమమున తన పరాక్రమ విస్ఫూర్తిచే మించి రాజు దైత్యులను చంపి విడంబించుట, వీరత్వాపాదకములై వీరము నంగముగా పోషించి కావ్యగత శృంగారమునకు మెఱుగులు పెట్టినవి.

ఇట్లు వర్ణనలకు ప్రాధాన్య మిచ్చుటయే కాక కథాగమనమున కవసర మనిపించుకొనని కొన్ని విషయములను విపులముగా చిత్రించుటయు నిందు గాన్పించును. అట్టివి 1. కావ్యాంతమున గాన్పించు నారద కృతోపదేశ ఘట్టమును, 2. కణ్వుడు శకుంతలకు పతివ్రతా ధర్మముల నుపదేశించు ఘట్టమును. [1]భరతునకు యౌవ రాజ్య పట్టము గట్టి దుష్యంతుడు నారదుని తనయున కుపదేశ మిమ్మని ప్రార్థించును. అప్పు డా మహర్షి సప్తాంగ పద్ధతిని గూర్చియు, రాజ్య భరణమునందు రాజు లవలంబింపవలసిన ధర్మములను గూర్చియు విపులముగా చెప్పును; శృంగార ప్రబంధముగా జెప్పిన శాకుంతలము చివర నీ యుపన్యాసము చేరికకు గల ప్రయోజన మెట్టిదో యనూహ్యము. అంతియే కాక చిరకాలానంతరము కలుసుకొన్న సతీసుతుల యెడ నుత్కట ప్రేమాదరముల చూపుటతో కావ్యమునకు మంగళము పాడక శకుంతలను తన కగ్రమహిషిగా వెల్లడించి, తనయుని గ్రుచ్చి కౌగిలించుకొని ప్రకృతి జనులతోడను, మంత్రులతోడను తన యభిప్రాయము నిట్లు వెలిబుచ్చెను.

> "పెద్దవాడనైతి పృథివి భారం బింక । బూన వయసు గాదు పుత్త్రుడెల్ల
> భరము బూనగా । దపస్వినై సుఖలీల వనమునందు నుండ వయసుగాని."

ఇట్లు ప్రశమిత శృంగారమును, ఆసన్న వైరాగ్యమును శృంగార కావ్యనాయకుని యందు చూపుటలో కవి వాంఛించిన ప్రయోజన మెట్టిదో తెలియదు.

1. శాకుంతల. 4. 157.

[1]పినవీరన విపుల చాటూక్తి నిర్నిద్రుడు. కీ॥ శే॥ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు సంపాదించిన చాటుపద్యమణిమంజరియందు సాళ్వగుండ నరసింహ భూపాలుని పేర జెప్పిన కొన్ని చాటువులు గలవు. "గుండ భూపాలు నరసింహ మండలేంద్ర" యను మకుటముతో నున్న వాని నెవరు రచించిరో తెలియదు. రాజు జైమినీ భారత కృతిపతి యగుటచేతను, వీరన చాటూక్తి నిర్నిద్రుడగుట చేతను పినవీరనయే వీనిని చెప్పి యుండవచ్చునని [2]శ్రీ ప్రభాకర శాస్త్రిగారి యభిప్రాయము. చాటువుల యందును రాజనీతియు, సప్తాంగ పద్ధతియు చెప్పఁబడినది. ఒకవేళ తా నాశువుగ చెప్పి భావములను కావ్య బద్ధము చేయగోరి శాకుంతలము చివఱ వానిని నారదోపదేశ రూపమున చేర్చెనేమో! కాని జైమినీ భారత రచనా కాలమున పినవీరయ సాళ్వగుండ నరసింహ భూపాలుని ప్రాపు పొందినట్లును, శాకుంతల రచనా కాలమున సోమరాజుపల్లెయం దున్నట్లును, గ్రంథస్థాధారములు చెప్పును. అనగా నీ చాటుధార శాకుంతల రచన తరువాతనే వెలువడి యుండవలయును గదా? అది శాకుంతలమున నెట్లు చేరియుండునను సందేహము కలుగవచ్చును. శాకుంతల కృతిపతి సోమరాజుపల్లె నివాసి యైనను. శాకుంతల కృతి రచనా కాల మిద మిత్థమని తేల్చుటకు మనకు ప పత్తులు లేవు, జైమినీ భారతము దాని తరువాతి రచనయే మైనను శాకుంతల రచనా కాలముననే కవి సాళ్వగుండ నరసింహ భూపాలుని యాస్థానమునకు రాకపోకలు చేయుచుండుటలోను, పద్యము లాశువుగా చెప్పుచుండుటలోను ప్రతిబంధ మున్నదని యనుకొనుట కాధారములు లేవు. ఆ పక్షమున శాకుంతలమున నారద కృతోపదేశమునకు స్థానము లభించుటకీ యాశుపద్యములే కారణమై యుండ వచ్చును.

శాకుంతలమున విపులముగా చిత్రించిన మఱియొక ఘట్టము [3]కణ్వుడు శకుంతల కుపదేశించిన పతివ్రతా ధర్మములతో గూడినది. ఈ ధర్మము లన్నియు శాకుంతలము కాలము నాటికి ప్రచారములో నున్నవని చెప్పుటకు సాక్ష్యములు లేవు. [4]శ్రీనాథుని కాశీ ఖండమున బృహస్పతి లోపాముద్రకు చెప్పిన ధర్మములు

1. భారతీ తీర్థ యతిసార్వభౌమ గురుకృపాతిశయ లబ్ధ కవితావిభూతి గలిగి గౌరవము కాంచినాఁడవు కవులచేత విపుల చాటూక్తినిర్నిద్ర వీరభద్ర.
   శాకుంతల. 1. 22.

2. చాటుపద్య మణిమంజరి — పీఠిక.

3. శాకుంతల. 4-75 నుండి 82.

4. కాశీ ఖం. 2-72 నుండి 94 వరకు.

పినవీరన కణ్వమహర్షిచే శకుంతలకు చెప్పించెను. శ్రీనాథ ప్రోక్త ధర్మములు స్కాంద పురాణాంతర్గత కాశీఖండములోని వగుటచే నివియు నెఱవు సొమ్ముతే గాని యా కాలపు టాచారములు కానేరవు.

భారత, కాళిదాసముల కంటె నవ్య రీతిలో ననుసంధానింపబడిన పినవీరన కావ్యమునందు కవి చేసిన చిన్న చిన్న మార్పు లెన్నియో కలవు. శకుంతల జన్మ వృత్తాంతము భారతమున శకుంతలయు, నాటకమున ననసూయా ప్రియంవదలును తెలివిడి చేయగా నిచట కణ్వుఁతే వాని యొకఁడు శకుంతలా పరోక్షమున రాజునకు చెప్పును. మేనకా విశ్వామిత్ర శృంగారమును పెండ్లి కాని పిల్లలు వసుమతీశునితో చెప్పుట యుచితము కాదని పీరన యా మార్పు చేసెనందురు. కాని [1]పెండ్లి కాని పిల్లలు 'నీతో భర్తృగృహమునకు నచ్చుట యుచితము కాద'ని కాళిదాసుని కణ్వుడు అనసూయా ప్రియంవదలను శకుంతలతో పోనీయక అరికట్టగా, పినవీరన వారిని రాజ భవనమునకు గొనిపోవుటయే కాక వారిచే శకుంతల వ్రేల నున్న ముద్రికను రాజుపై విసరివేయించి శాపావసానమును కలిగించెను. ఇచట కవి దృష్టి అనసూయా ప్రియంవదలకు ప్రాధాన్యము నిచ్చునదిగా కన్పించు చున్నది గాని యౌచిత్య పరిపోషకముగా కన్పించుట లేదు.

చివఱకు భారతము నందలి యాకాశవాణి ప్రబోధము, కాళిదాసమునందలి ముద్రికా సందర్శనమును రెంటిని శకుంతలా వివాహ వృత్తాంతమును, దుర్వాస శాప వృత్తాంతమును దెలిపెడి సాధనములుగా పిన వీరన తన కావ్యమునందు గ్రహించియు నంటిటితో తృప్తినొందక నారదాగమనమును జతపరచెను. నారదుడు వచ్చి దుర్వాస శాపోదంతమును వెలువరించి రాజు చిత్తమున గల యుత్తలము డించి యాతనిని సమాశ్వసించెను,

ఇట్టివే చిన్న చిన్న మార్పుల నెన్నిటినో పినవీరన కల్పించెను. ఆ యుగ లక్షణముల ననుసరించి వర్ణనా ప్రాధాన్యమును, విషయ వైపుల్యమును ప్రదర్శించు నిట్టి మార్పు లన్నియు సముచితములే యని చెప్పుకొన నొప్పును.

కథాకథనమునం దిట్టి మార్పులను చేసినను పినవీరన భారత శాకుంతలము చేత నధికముగా ప్రభావితుడయ్యెనే యని చెప్పవలయును. కాళిదా

---

1. కాశ్యప :- వత్సే! ఇమే అపి ప్రదేయే. నయుక్త మనయో స్తత్ర గంతుమ్. అభిజ్ఞాన శాకుం.

సమునుండి యెన్నియో శ్లోకములను, వాని యందలి రామణీయకముచే సాకర్షితుడై యనువదించుకొనెను. ఈ క్రింది యనువాదక్రమమును తిలకింపుడు

1. గ్రీవాభంగాభిరామం ముహు రనుపతతి స్యందనే బద్ధదృష్టిః
పశ్చార్ధేన ప్రవిష్టశ్శరపతనభియా భూయసా పూర్వకాయమ్
దర్భైరర్ధావలీఢైః శ్రమవివృతముఖభ్రంశిభిః కీర్ణ వర్త్మా
పశ్యోదగ్రప్లుతత్వా ద్వియతి బహుతర స్తోక ముర్వ్యాం ప్రయాతి.

అభిజ్ఞాన- 1-7

విలుగాని వెంట వెంట పృథివీపతి రా శరపాతభీతిఁ దా
మలఁగి మలంగి కన్గొనుచు మార్గము క్రేవకు నడ్డగించుచున్
నిలుచుచుఁ గొంత కొంత గమనించుచు నర్ధము మేసి మేసి ద
ర్భలు వివృతాస్యపార్శ్వముల రాలగ మింటికి చౌకళించుచున్.

శాకుంత. 2-19

2. అసంశయం క్షత్రపరిగ్రహక్షమా
య దార్య మస్యాభిలాషి మే మనః
సతాం హి సందేహపదేషు వస్తుషు
ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః

అభిజ్ఞాన. 1-20

నందియమేల యీ వికచ సారసలోచన రాజపుత్రి, నా
డెందము మౌని కన్యల బడిం జన నేరదు నిక్కువంబ యే
చందము నంచు సంశయ విచార పదంబగు నట్టి వస్తు సీ
మందమ చిత్తవృత్తులు ప్రమాణము లుత్తములైన వారికిన్ ॥

3. నీవారాః శుకగర్భ కోటర ముఖ భ్రష్టా స్తరూణా మధః
ప్రస్నిగ్ధాః క్వచిదింగుదీ ఫలభిదః సూచ్యన్త ఏవోపలాః
విశ్వాసోపగమాదభిన్న గతయః శబ్దం సహన్తే మృగాః
తోయాధార పథాశ్చ వల్కలశిఖా నిష్యంద రేఖాంకికా.

అభిజ్ఞాన. 1-

శుకగర్భ కోటర చ్యుతములై నివ్వరి
ప్రాల్కింద జెదరిన పాదపములు
దలలకు గారకాయలు నూర నందుల
జముర౦టి మెఱయు పాషాణ తలము
నిబిడ వల్కల శిఖా నిష్యంద రేఖల
జాడలు గల జలాశయ పదములు
దమ మేను లొరసి కొంచు మనుష్యు లరిగిన
భయమున జంచలింపని మృగములు
గలిగి యన్యోన్య మైత్రి సక్కడ జరించు
పులుల కూనలు జింకపిల్లలు మృగేంద్ర
పోతకంబులు నాల్కేపులును కడుపు
గట్టికొని కూడి యాడ సక్కజము చెంది.

ఇచట శ్లోక గతార్థము సీసము నాలుగు పాదములలో సరిపోవగా నెత్తు గీతి యందలి భావము పినవీరన సొంతమై వెలసినది. ఇట్టి వెన్నిటినో పద్యము లను శాకుంతలము నుండి యుదాహరణములుగా నీయ వచ్చును. అభిజ్ఞానము నుండియే గాక కాళిదాసుని కుమార సంభవము నుండి కూడ కొన్ని శ్లోకముల ననువదించుకొని పినవీరన తనకు కాళిదాసుపై గల గౌరవమును వెల్లడించు కొనెను. శకుంతలా జన్మవృత్తాంతమును చెప్పబోవుచు నంతేవాసి విశ్వామిత్రుని తపోవనస్థాన మైన హిమవన్నగ వర్ణనము చేసెను. ఆ వర్ణనము నందు కుమార సంభవ మందలి హిమశైల వర్ణనము యొక్క పోలికలు గోచరించును. గమనింపుడు :

1. అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా
హిమాలయో నామ నగాధి రాజః
పూర్వాపరౌ తోయ నిధీ విగాహ్య
స్థితః పృథివ్యా ఇవ మానదండః — కుమార. 1. 1,

పినవీరన హిమనగ వర్ణనము నొక సీసమున పెంచి పెంచి యెత్తు గీతిలో పై శ్లోకము ననువదించెను.

నలరి పెంపొందు। బూర్వాపరాంబునిధుల
నడుమ ధరణికి మానదండంబు వోలె
దేవతాత్మ ధరాధీశ దివ్యభూష
పుణ్య నిలయంబు నీహార భూధరంబు. — శాకుంత. 2—101

2. పదం తుషార స్రుతి ధౌతర క్తం
యస్మి న్న దృష్ట్వాపి హాత ద్విపానామ్
విదంతి మార్గం నఖరంధ్ర ముక్తైః
ముక్తా ఫలైః కేసరిణాం కిరాతాః కుమార. 1-6

వారనిమంచుపైఁ బోదివి వచ్చిన పోయిన చొప్పు మాసిన
న్స్ఫూరి నఖాగ్ర ముక్తమయి పొల్పగు ముత్తెపు జాలు వెట్టగా,
దారటు లేగి కాంతురు హాత ద్విప కేసరివాస సీమలన్
వీర కిరాతు లద్రి వన వీథుల సింగపు వేటలాడుచున్. శాకుంత. 2-104

భాష వేరు కావున పినవీరన కాళిదాసము నుండి శ్లోకముల ననువదించు కొనెను. తెలుగు భారతము నుండి పద్యములకు పద్యములే తన శాకుంతలమున పెట్టుకొనుటకు వీలు లేదు కదా! అయినను, అందలి సమాస రచన చేత, అర్థస్ఫూర్తి చేత నాకర్షితుడై వానినే విపులీకరించి తన కావ్యమున చిత్రింపగలిగెను. ఈ క్రింది యుదాహారణములను పరికింపుడు.

1. కాఱడవి బఱచు మృగముల
నూఱడకం దిగిచి డస్సియున్న తనిశ్రమం
బాఱగ నెడ పరితాపము
దీఱగ బైవీచె నన్నదీపవనంబుల్.

అన్న పద్యములోని నదీ పవనములను వివిధ సుగంధ వాసనా భరితములుగా చేసి మలయించెను.

చూడుడు :

కడగి సంక్రీడించు నడవి యేనుంగుల
గండస్థలుల దాన గంధములను
చెంచుల రాచ కెంజిగురాకు బోడుల
శిరసుల జవ్వాది పరిమళముల
విచ్చిన నెత్తమ్మి విరుల దుమ్మెదలాడ
జారిన పూదేనె సౌరభముల
గూల ద్రుమంబుల గాలి తాకున రాలి
వచ్చిన యలరు క్రొవ్వాసనలను
శబలితంబగు నద్యోటి సలిలకణము
లల్లనల్లన గొనుచు మందానిలుండు
చల్లఁగా వీచి వన పథ శ్రాంతి దీర్ప
నదికనుంగొను వేడుకం గదలి కదలి. శాకుంతల. 2. 24.

2. అట్లే

ధారుణీ తల విభుఁ డొక్కరుండ చని
తన్వి పయోజదళాయతాక్షి సంకుల
మిళితాళినీలపరికుంచితకోమలకుంతలన్
శకుంతల యను కన్యకం గనియె నసఁగ

అన్న భారతమునందలి శకుంతలాకోమలకుంతలసౌందర్యమును వెల్లడిచేయు పద్యమును చూచి పినవీరన

చంచత్పల్లవకోమలాంగుళకర న్సంపూర్ణచంద్రానన
న్యంచచ్చందనగంధి గంధగజయానం జక్రవాకస్తనిం
గించిన్మధ్య తటిల్లతావిలసితాంగిఁ

అని వర్ణనను పెంచి, యామీదట నన్నయభట్టారకుడు చేసిన వర్ణనకు సరిపోవునట్లుగా

....పద్మపత్త్రాక్షి వీక్షించిన్ రాజు శకుంతలన్
మధుకరశ్రేణీలసత్కుంతలఁ

అని చెప్పెను.

3. అట్లే శ్రవణసుఖంబుగా సామగానంబులు చదివెడు శుకముల చదువును నన్నపార్యుడు చెప్పగా దానిచే ప్రభావితుడైన పినవీరన–

"వేదాధ్యాపకులైన రాచిలుకలఁ వేదాంతమీమాంసలఁ
వాదం బిమ్ములఁ జేయు శారికల తత్త్వం బిందుజూటుండుగా
నాదేశించు పురాణముల్ చదువు చక్రాంగంబులఁ సామముల్
నాదంబొంద పినాకి పాడు సకులఁ వందారుఁడై చూచుచుఁ"

అని యితోధికకల్పనము చేయుటయే గాక, నందు తన శివభక్తిపారమ్యమును గూడ ప్రకటించుకొనెను.

4. శకుంతల రాజభవనమున ప్రవేశించి తన్నుఁ గుర్తింప నిరాకరించిన పతిని జూచి,

ఎఱుఁగఁడొకొ నన్ను నెఱిఁగియు
    నెఱుఁగనియట్లుండునొక్కొ యెడ చవ్వగుటన్
మఱచెనొకొ ముగ్ధు లధిపులు
    మఱువరె బహుకార్యభారమగ్నులు గారే

యని యనుకొనగా, శాకుంతలమున సంయమి శిష్యులు

ఏ మెఱుంగని పనియని హృదయవీథి
వెఱచెనో కాక మఱచెనో వెనుకచింత
మఱపులేదైన బహుకార్యమగ్నమతులు
భూపతీనాయకులు గదా దాని కేమి, యనుకొందురు.

[1]"సతియు, గుణవతియు, ప్రజావతియు సనువ్రతయు నైన వనితను, అవజ్ఞాన్విత దృష్టి జూచు నతిదుర్మతి కిహమును, పరమును గలవా" యని భారతమున శకుంతల రాజునకు ధర్మబోధ చేయగా, శాకుంతలమున కణ్వ శిష్యులు

గుణవతియుఁ బుత్రవతియును గులవతియును
నైన భామను విడుచు నన్యాయకారి
కిహపరంబులు లే వని యెఱు సమిద్ధ
ధర్మశాస్త్రంబు లెఱుఁగవా ధరణినాథ

యని యుపదేశింతురు. [2]అట్లే తాను తననీడను నీళ్ళలో జూచునట్లుగా జనకుడు తనసూనుని చూచి, మహానందము బొందునన్న శకుంతల వాక్యమునే మునిశిష్యులు,

అద్దములోని నీడవలె నాకృతియం దొక లేశమాత్రముం
బిద్దము గాక నీకుఁ బ్రతిబింబము వోలె వెలుంగుచున్న నీ
పెద్దకుమారు భూవర యభిన్నమతి న్మొగమెత్తి చూడుమా

యని చెప్పుదురు.

[3]భారతమున నాకాశవాణి, శకుంతల సత్యము పలికెను. వీడు నీకును, శకుంతలకును బ్రియనందనుడు. శకుంతల సాధ్వి, సద్వినుత, మహాపతివ్రత, యని సభాసదులు విస్మయమును పొందుచుండగా రాజును హెచ్చరించెను. దానినే శాకుంతలమున,

అనునాలోన తత్సభాజనము లత్యాశ్చర్యముం బొంద నో
జననాథోత్తమ యీశకుంతల మహాసత్యవ్రతాన్విత త
త్తనయుండు న్భవదీయవీర్యజుఁడు సత్యంబౌ మరి న్సత్య మా
ననుమానింపకు మంచు మ్రోసె వడి నయ్యాకాశవాణీధ్వనుల్.

1. ఆంధ్ర మహాభారతము. ఆది. 4. 82
2. ఆంధ్ర మహాభారతము. ఆది. 4. 88
3. ఆంధ్ర మహాభారతము. ఆది. 4. 105.

ఇట్లు కథాంశము లేకమైనచోట భారతరచనతో, పదవిన్యాసములో, నర్థస్ఫూర్తిలో, శైలియందు నెన్నియో పోలికలను శాకుంతలమునందు జూపింప వచ్చును. భారతశైలి ననుకరించుట యన్నది పినవీరన తన కావ్యమున నచ్చటచట చేసెనుగాని, స్వతస్సిద్ధముగా నతనిది భారతభిన్నశైలి. ఈయన పద్యములపోకడ, సమాసరచన, పదముల పొందిక అన్నియు శ్రీనాథుని రచనా పద్ధతిలో నెక్కువ సామ్యమును సంపాదించు కొనుచున్నవి గాని, నన్నపార్యుని రచనతో కాదు. ఈవిషయమును స్పష్టము చేయగల యీక్రింది యుదాహరణముల పరికింపుడు.

కణ్వాశ్రమవర్ణనము చేయుచు నన్నయ చెప్పిన సీస మి ట్లున్నది.

శ్రవణసుఖంబుగా సామగానంబులు
చదివెడి శుకముల, చదువు దగిలి
కదలక వినుచుండు కరులును, కరికర
శీతలచ్ఛాయఁ దన్పికరాంబు
కణముల చల్లని గా డ్పానపడి వాని
జెంది సుఖంబున్న సింహములును
భూసురప్రవరులు భూతబలుల్ దెచ్చి
పెట్టు నీవారాన్నపిండతతులు
కడఁగి భక్షింప నొక్కటఁ గలసియాడు
చున్న యెలుకలు, బిల్లులు నొండునహజ
వైరివర్గంబులయు సమావాస మపుడు
చూచి మునిశక్తి కెంతయుఁ జోద్య మంది.

ఇంచుమించు భావ మిట్టిదే యయ్యు, నీసందర్భమున పినవీరన రచించిన సీసము యొక్క నడక పై దానికి భిన్నముగా నున్న దనకతప్పదు.

చూడుడు :

వృద్ధసింహమునకు విహరింప దొండంబు
కైదండగా నిచ్చు గంధగజము
పులి క్రొత్త యీనిన పొదరింటి లోనికి
పురిటాలితగవు గొంపోవు హరిణి
శరభంబు కొనగోళ్ల శిరము దువ్వగఁ జొక్కి
కను మోడ్చు సుఖనిద్ర గండకంబు
సింహకిశోరంబు చేర వచ్చిన వింత
లేక చన్నిచ్చు జాలెంత కరిణి

ఎలుకతోడుత చెలఁగాడు నెనసి పిల్లి
నెమ్మి పురి విప్పి నిలచి పింఛమ్మునీడ
భుజగకన్యక నాడించు పూరినమలి
యనఘ కణ్వమునీంద్రుపుణ్యాశ్రమమున.

ఈసీసపునడక శ్రీనాథుని సీసపు నడకతో పోలియున్నది. ఇంచుమించిదే భావముతో విరాజిల్లు నొకసీసము కాశీఖండమున గలదు.

చూడుడు :

కండూయనము సేయు కరటి కుంభదంత
పుష్కరమ్మున సింహపోతకంబు
వాలారు నఖముల వదనమించుక యెత్తి
ముద్దాడు పులి లేటిముద్దరాలి
సింహ కౌఁగిటఁ జేర్చి నెమ్మిమై పోఁడేలు
కొదమచింబోతును గుస్తరించుఁ
గుంజమంటపకుటీ క్రోడమధ్యంబున
నాఖుతో చెలఁగాడు నడిపిపిల్లి
యెండ దాకక యుండంగ నెత్తిపట్టు
పగలు ముంగికి భుజగంబు పడగగొడుగు
కోతితో మైత్రి వాటించు కొండగొరియ
యార్వకేయుని పుణ్యాశ్రమాంతరమున

కాశీ ఖం. 2. 43.

చక్కఁగా పరిశీలించినచో శాకుంతలమున ప్రతిపదమునను శ్రీనాథుని శైలీవిన్యాసముయొక్క ఛాయలు గోచరించుచునే యుండును. శ్రీనాథుని ప్రౌఢసమాసరచనయు, వర్ణనాసౌందర్యమును పినవీరనను మిక్కిలి యాకర్షించినవి. దీనిని నిలువబెట్టుటకు శాకుంతలమునుండి కోకొల్లలుగ నుదాహరణములను జూపింపవచ్చును.

1. మదనారాతిసమాను గాశ్యపమహామౌనీంద్రు సేవింప స
మ్మదమారం జని యాశ్రమంబువనసీమం గంటి వాల్గంటిఁ దో
యదనీలాలకఁ గంబుకంఠిఁ గరిణీయానం బయోజాననం
సదసత్సంశయగోచరోదరి సుధాసంబాధబింబాధరిన్.

శాకుం. 2. 178.

2. మృదురీతిం బ్రతివాసరంబు గమికర్మీభూతనానానదీ
నదకాంతారపురీశిలోచ్చయుఁడనై నైకాద్భుతశ్రీజిత

త్రిదివంబైన విదర్భదేశమున నారీరత్నముం గాంచితిన్
సదసత్సంశయగోచరోదరి శరత్సంపూర్ణచంద్రాననన్.

శృంగార నైషధ. 2. 20

పై రెండుపద్యములయందును గల సామ్యము చివటిపాదములో స్పష్టముగా కాన్పించుచున్నది. నైషధమున శ్రీనాథుడు 'గమి కర్మీకృత' యను ప్రయోగమును తెలుగులో నమర్చుటలో పైపద్యమువలన తృప్తుడు కాక మరియొక పద్యమునుగూడ వెంటనే చెప్పెను. ఆపద్యములో పై పిన వీరనపద్యము మఱియు చక్కగా పోలుచు, నీకవిపై శ్రీనాథుని ప్రభావమును స్పష్టము చేయుచున్నది. ఆపద్య మిది :

కమలేందీవరషండమండితలసత్కాసారసేవారతిన్
గమికర్మీకృతనైకనీవృతుఁడనై కంటిన్ విదర్భంబునన్
రమణిం బల్లవపాణిఁ బద్మనయనన్ రాకేందుబింబాననన్
సమపీనస్తని వస్తినాస్తి విచికిత్సాహేతుశాతోదరిన్.

శృం. నై. 2. 21.

పినవీరన యిట్టి మహాకవిపద్యముల పోకడచే నాకర్షితు డగుటయే కాక నాయన చిత్రించిన కొన్ని ఘట్టములపైగూడ మనసు పడినట్లు కాన్పించును.

శ్రీనాథుడు కాశీఖండమున కులస్త్రీధర్మములను బృహస్పతిచే లోపాముద్రకు చెప్పింపగా, వానినే పినవీరన కణ్వునిచే శకుంతలకు చెప్పించెను. ఈ రెండుఘట్టముల పలుకుబడులయందును, చిక్కని సామ్యము కాన్పించును. పరికింపుడు.

1. జలమాడి మడుగు వస్త్రముఁ గట్టి కైసేసి
కొనిగాని కవయఁబోఁ జనదు ప్రియుని — శాకుంత. 4. 79.
కైసేయ కెన్నడు కదియ వధిపు. — కాశీ ఖం. 2. 72.

2. గడపమీఁదను సన్నెకల్లుమీఁద
రోలుమీఁద నునికి విభునికిఁ దఱుగు యశము — శాకుంత. 4. 79.
కడపమీదఁను మఱి సన్నెకంటిమీఁద,
జక్కిమీదఁను గూర్చుండ జాడ గాదు — కాశీ ఖం. 2. 75.

8. కంచెలయుం బటీరతిలకంబును [1]బాపట చందిరంబు ఫా
   లాంచలసీమ లేఁబసుపు టచ్చుత బొట్టు చెవాకు గాజులుం
   గొంచెపు పీడ్యము న్వీరులు కొప్పున నొప్పు నొనర్ప నెప్పుడుం
   జంచలనేత్ర యుండదగు సంతతభర్తృఫలాభివృద్ధికిన్.

శాకుంత. 4. 78.

వసుపుం గుంకుమ కజ్జలంబు నునుగూర్పాసంబు తాంబూలముం
గుసుమంబుల్ కబరీభరంబు చెవి యాకుల్ మంగళాలంకృతుల్
విను వొక్కింతయు లేక తాల్పవలయున్ వీనిన్ సదాకాలమున్
నసి చక్కంగ ప్రియుండు వర్ధిలుటకై నాంతికపత్త్రాశ్రితకిన్.

కాశీ ఖం. 2. 73.

ఇట్లు శ్రీనాథునికవిత్వము ననుకరించుటచే నాయన రచనా పద్ధతిపై తనకు గల ప్రత్యయమును చాటుకొన్నను పినవీరన శ్రీనాథుని పూర్వ కవి స్తుతియందు చేర్చి స్తుతింపలేదు. [2]సంస్కృత కవుల నుగ్గడించిన వెనుక నన్నయ భట్టోపాధ్యాయుని, తిక్కన సోమయాజిని మాత్రము స్తుతించెను. ఎఱ్ఱన ప్రసక్తి లేదు, కాని [3]జైమినీభారతమందు, నన్నయతిక్కనలతోపాటు ఎఱ్ఱ

1. ఈ పద్యము నుదహరించుచు నారుద్రగారు తమ సమగ్రాంధ్రసాహిత్యమున "పావట సిందూరం ఒకనాడు తెలుగువాళ్లుకూడా పెట్టుకునేవా రన్న మాట" అని నిర్ణయించిరి — తెలుగువారు పెట్టుకొనుట లేదనే, శ్రీనాథుడు తన పద్యమున 'సిందూర' పదము తీసివేయగా, నది గమనించని పినవీరన సంస్కృతానుసారగా దాని నట్లే యుంచెను. ఇవి స్కాందాంతర్గత ధర్మ ముల కనువాదములుగాని, యాకాలమున వాడుకలో నున్న ధర్మములని చెప్పుటకు నితరములైన యాధారములు లేవుకదా!

2. శాకుంత. 1 - 1, 12.

3. కవులన్ బంకజగర్భసన్నిభుల వక్కాణింతు వల్మీకసం
   భవునిన్ వ్యాసుని కాళిదాసు బిలహాన్ బాణున్ మయూరున్ శుకున్
   భవభూతిన్ శివభద్రు మల్హణుని ఘంటామాఘునిన్ జోరు భా
   రవి మా నన్నయభట్టు తిక్కకవి నెఱ్ఱా ప్రగ్గడన్ సోమునిన్.

జైమినీ భారతము—పీఠిక-6.

"ఈ పద్యములోని 'మా' అను విశేషణమునుబట్టి చూడ నన్నయ భట్టును పినవీరనయు నొక్కవంశమువారును, ఒక్కగోత్రమువారునై యుండు రని చెప్ప నొప్పియున్నది" అని శ్రీ గురజాడ రామమూర్తి పంతులుగారు

నను, నాచన సోముని తలంచెను. అచట శ్రీనాథప్రసక్తి లేదు.

పినవీరన పూర్వకవులను తలచుటయందును నొక విశిష్టతను చూపెను. తాను పేర్కొన్న యేకవియొక్క కవిత్వ సమీక్షయు నీయన చేయలేదు. నన్నయను నన్నయభట్టోపాధ్యాయు డని గౌరవించి, కవితాపట్టాభిషిక్తు డని యెంచి యుగ్గడించెను. తిక్కన నుభయ కవి మిత్రునిగా, ప్రణుతబహుదేశ కవిరాజుగా చెప్పెను గాని యాయనకవిత్వమును గూర్చి చెప్పలేదు. అట్లే జైమినియందు కేవలము నన్నయను, తిక్కనను, ఎఱ్ఱాప్రగడను, సోముని పేరుపేరున స్మరించెను. కాని వారికవిత్వవిశేషములనుగూర్చి ముచ్చటించుట గాని, యాకవిత్వలక్షణములు తనకవిత్వమునందును కలవని, శ్రీనాథునివలె యుగ్గడించుటకాని చేయలేదు. జైమినీభారతశాకుంతలముల కృత్యవతారికలను చక్కగా పరిశీలింపగా పినవీరన యితరకవుల ఛాయలు తనకవిత్వము నందున్నవని యంగీకరించుటకు సమకట్టని యహంకార యనియే తోచును. [1]లోకమున నీకవిని గూర్చి వాడుకలో నున్న కథలన్నియు నీయనకు గల యహంకారగుణమునే చెప్పును. కాలమునుబట్టి చూచినచో, నీయన శ్రీనాథుని వార్ధక్య దశలో పిన్నవాడుగా నుండి తదనంతరము రాజాస్థానములం బ్రవేశించి యుచ్చస్థితికి వచ్చినవాడు.

ఇట్టి పరిస్థితులవలన, శ్రీనాథుడు కవిసార్వభౌముడైనను, ఉద్దండ పండితుడైనను, ఆయనకవితారామణీయకమును మనసార తాను మెచ్చినను కవిస్తుతిలో నాయనపేరు చేర్చుటకు పినవీరన యిచ్చగించి యుండడు. ఎట్లు వ్రాసినను సమకాలమువారు మెచ్చరను విషయమును పినవీరన శ్రీనాథుని

వివరించిరి. "అంతమాత్రమున శాఖైక్యము నది సూచింపదు" అని చాగంటి శేషయ్యగారు తమ ఆంధ్రకవితరంగిణియందు పై యభిప్రాయమును ఖండించుచు హరవిలాసమున శ్రీనాథుడు తిప్పయసెట్టిని మా తిప్పయసెట్టి యని వ్రాసెననియు వారిరువురు నొకకులమువా రందుమా యనియు వాదించిరి. నాఅభిప్రాయమున నిచట 'మా' యను విశేషణము సంస్కృత కవులకంటె వేరుగా, వరుసగా చెప్పబడిన తెలుగుకవులకొఱకు వాడబడినది. "మానన్నయభట్టుమాత్రమే కాక మాతిక్కన, మాయెఱ్ఱన, మా సోముడు" నని యన్వయము.

1. రాజాస్థానమునందు వాణి నారాణి యని యెలుగెత్తి చాటెనను కథ; శ్రీనాథుడు నైషధము నభిప్రాయార్థము పినవీరనకడకు కొనిపోగా, దాని నాతడు పరిశీలింపకయే మాబోంట్లకు రుచింపకపోయినను సామాన్యులు మెచ్చుకొందురు తెమ్మని యభయ మిచ్చెనని చెప్పుకొను కథ.

పట్ల సత్ర్యము చేసె ననవచ్చును.

కాని శాకుంతలమునందు [1]చిల్లర వెన్నయామాత్యుడు కవియొక్క కవితాప్రాశస్త్యము నుగ్గడించుచు చెప్పిన యొకపద్యము కానవచ్చుచున్నది.

[2]తనమనంబున నొక్కనా డిట్లు వితర్కించె యను వచనమునుండి చిల్లర వెన్నయామాత్యుడు చెప్పినట్లుగా నున్న పద్యములు వరుసగా కొన్ని కలవు. ఆక్రమమును బాగుగా పరికించినచో, నందు వివిధకవిత్వరీతుల నాపాదించి పినవీరనను ప్రశంసించిన యీపద్యము ప్రక్షిప్తమేమో యని యనుమానము కలుగుచున్నది. అట్లు కలుగుటకు గల కారణము లివి :

1. ఆపద్యము తీసివేసి, కృతిభర్త పినవీరనను కావ్యము చెప్పుమని యాచించిన ఘట్టమును చదివినచో, నన్వయము చెడకుండుటయే కాక నతికినట్లు సరిపోవుట.

2. ఈపద్యమునడకలో 'సమత' గోచరింపక పోగా, నెగుడు దిగుడుతనము కాన్పించుట.

---

1. నన్నపార్యుండు ప్రబంధప్రౌఢవాసనా
సంపత్తి, సొంపు పుట్టింప నేర్చు
దిక్కనయజ్వవాగ్భక్తికామోదంబు
చెలువు, కర్ణముల వాసింపనేర్చు
నాచిరాజుని సోము వాచామహత్త్వంబు,
సౌరభంబుల వెదజల్ల నేర్చు
శ్రీనాథభట్టు భాషానిగుంభంబుల
పరిమళంబులు, కూడబఱచ నేర్చు
మహితగుణశాలి పిల్లలమఱ్ఱి వీర
నార్యుడాయింట పైతామహంబగుచును
వెలయుచున్నది నేడు కవిత్వలక్ష్మి
యఖిలసత్కవినికరంబు నాదరింప    శాకుంత. 1-19.

"నన్నపార్యుండు" కాక "నన్నపార్యుని" యను పాఠము సమంజసమేమో ! అట్లు చేసిననే ఆపాదమందలి యన్వయము, మిగిలిన పాదము లన్వయించు పద్ధతితో సరిపోవును. కాని యీపద్యము నుదహరించిన సాహిత్యచరిత్రకారు లెవ్వరును "నన్నపార్యుని" అని గ్రహింపలేదు.

2. శాకుంత. 1-15 నుండి 27.

3. పద్యములోని అర్థస్ఫూర్తియు నిర్దుష్టముగా లేదు. i. నన్నపార్యుని కవిత్వగుణముగా ప్రబంధప్రౌఢవాసనాసంపత్తిని చెప్పెను. ii. తిక్కనకును నాచన సోమునకును, వాగ్భక్తికామోదము, వాచామహత్త్వమువంటి సరిపడని విశేషణములను వాడెను. iii. శ్రీనాథపరముగా వాడిన "భాషానిగుంభంబు" అన్న పదబంధముయొక్క స్పష్టార్థము నిర్ణయించుటకు వీలులేనిదిగా నుండుట. iv. ఇందలి కవితాగుణములు కలిగిన పినవీరనయొక్క కవిత్వవైభవమును తెలియజేయు విశేషమేదేని వాడక, "మహితగుణశాలి" యని సామాన్యముగం వీరనను చెప్పుట. v. "తిక్కన యజ్వవాగ్భక్తికామోదము చెలువు కర్ణముల వాసింపనేర్చు" ననుచోట- ఆమోదము, వాసించుట యను పదములు వాడినంతనే స్ఫురింప వలసినది 'నాస' కాని కర్ణములు కావు, ఇట్లువకతవకలతో నున్న పద్యమెుక్కటైనను వీరనరచన యందితరత్ర కాన్పింపదు. vi. జైమినీభారతావతారిక పరిశీలించినను, అచట కృతిపతియైన సాళ్వగుండ నరసింహ భూపాలుడు, చిల్లర వెన్నయామాత్యునివలెనే, సప్తసంతానములలో కృతియొక్క శాశ్వతత్వము నుగ్గడించి, తనకు జైమినీభారతమును విన వలయునని యున్నదని,

> ఆపురాణంబుఁ గనఁ దెనుఁగయ్యెనేని
> జెప్పనేర్చిన కవియుఁ బ్రసిద్ధుఁడేని
> దెనుఁగు నుడికారమున మెచ్చు గనియెనేని
> గుందనము కమ్మవలచిన చంద మగును.

అని సభాసదుల మొగము జూచెను. వారు వీరన వంశప్రతిష్ఠను జెప్పి యాయన జైమినిని తెలుగు చేయుచుండుట చెప్పిరి. [1]అల్లనవిచ్చు చెంగలువలు వెదచల్లు సౌరభములవంటి భావములు నాతిగూఢముగా పయ్యెదమాటున నున్న యువతీవక్షసౌందర్యమువలె తోచునట్లుగా నీయన కవిత్వము చెప్పగల డనిరి. కాని యీయనకవితలో ప్రాచీనకవుల కవితామార్గము లున్నవని చెప్పలేదు. అందువలన శాకుంతలమునందలి పైపద్యము ప్రక్షిప్త మనుకొన్నచో జైమిని యవతారికతో శాకుంతలావతారిక సరిపోలును.

[2]పిల్లలమఱ్ఱి వంశము శారదా పీఠకము. [3]శారదాదేవి విభ్రమ శ్రవణ కల్హారోదయామోదములు ఈ కవికృతియందెక్కడైనను పరిమళలోపము కలిగెనేని, పూరించుచుండును.

1. జైమినీ భారతము – పీఠిక – 25.
2. ,, ,, ,, – 22.
3. శాకుంతలము 1 – 7.

[1]ఈయనవంశమునందు తాతయు, తండ్రియు, నగ్రభ్రాతయు భువన భాసురకృతి నిర్మాతలుగా చెప్పబడిరి. శ్రీనాథుడు [2]తన హరవిలాసము నందొక పిల్లలమఱ్ఱి మహాప్రధాని పెద్దనను, కృతిభర్తయైన యవచి తిప్పయకు విద్య చెప్పిన గురువుగా జెప్పెను. ఈయన పినవీరనసోదరు డగుటకు కాల మనుకూలించునో ?—లేదేని యాయనవంశమువాడై యుండవలయును. పినవీరన జన్మ స్థల మేదియో తెలియదు. ఇంటిపేరునుబట్టి "పిల్లలమఱ్ఱి" గ్రామము తెలంగాణమునం దుండుటచే వీరిపూర్వీకు లచ్చటివా రనవచ్చును. కాని యీ యూహను బలవత్తరముగా నిలువబెట్టుట కాధారములు లేవు.

శృంగార శాకుంతలమును నెల్లూరు మండలస్థ గ్రామమైన సోమరాజు పల్లెయందు నివసించు చిల్లర వెన్నయామాత్యున కంకిత మిచ్చుటచే పినవీరన యాకృతిరచనాకాలమునాటి కాగ్రామవాసియై యుండియుండవచ్చును. శాకుంతలము పీఠికనుండి పినవీరనకుటుంబవిషయము లేవియును విపులముగా తెలియుటలేదు. తల్లి నాగమాంబ యనియు, తండ్రి గాదన యనియు చెప్పుకొనెను. తాను భారతీతీర్థయతిసార్వభౌమకృపాతిశయలబ్ధకవితావిభూతి కలిగిన వాడ నని చెప్పుకొనెను. కాని కృతిభర్తయగు చిల్లర వెన్నయామాత్యుని వంశవృత్త మి ట్లున్నది.

1. తాతయుఁ దండ్రియు నగ్ర
భ్రాతయునుం దాను భువనభాసురకృతిని
ర్మాతలు; పిల్లలమఱ్ఱి వి
ఖ్యాతునిఁ బినవీరుఁ బోలఁగలరే సుకవుల్.

జైమినీ భారతము — పీఠిక - 21.

2. పిన్నటనాఁడు సత్కరుణఁ బిల్లలమఱ్ఱి మహాప్రధాని పె
ద్దన్న గురూత్తముండు తగ నక్షరశిక్షయు దైవమార్గసం
పన్నతయుం వివేకపరిపాటియునుం గృపఁ జేసె నర్థి నే
యన్నకు సట్టిసెట్టి త్రిపురాంతకునిం దగు బ్రస్తుతింపగన్.

హరవిలాసము — పీఠిక - 29.




ఈ వెన్నయామాత్యుని కాలము తెలియుటకు తగినయంశము లీ గ్రంథమునందు కానరావు. ఈయన [1]యాఱువేలనియోగి. ఈయనగాని, యీయన వంశస్థులుగాని యాశ్రయించిన రాజవంశములనుగూర్చిన సమాచారము మనకు తెలియదు. [2]వంశపురుషుడైన మేడనను కవి జంబుద్వీపావనిపాల మంత్రిగా జెప్పెను. వెన్నయామాత్యుని కవి, "శీతశైలాబ్ధి వేలామధ్యక్షితిపాలమంత్రిమకుటాలంకార హీరాంకురా!" యనియు, "సదా స్వామికార్యక్రియాచారునీతిక్రియా!" యనియు, "పతిహితకార్యా!" యనియు సంబోధించెనేగాని, ఆపతి యెవ్వరో చెప్పలేదు. రాజు ప్రసిద్ధుడు కాకపోయిన నట్లు తలుగనచ్చును. లేదా రాజును, రాజ్యమును లేకయే గ్రామ వ్యవహారములను చూచుచు, ప్రభుత నెరపు కారణమున నీవంశస్థు లమాత్య బిరుదాంచితులై యుండవచ్చును. ఇందు రెండవయూహయే సమంజస మనుకొందును.

పినవీరన శాకుంతలరచనమునకు ముందే మఱినాలుగు గ్రంథములను రచించెనని [3]శాకుంతలమువలన తెలియవచ్చుచున్నది. అవి (1) అవతార దర్పణము, (2) నారదీయము, (3) మాఘమాహాత్మ్యము, (4) మానసోల్లాస సారము. ఇందొక్కటియు నీనాటివఱకు మనకు లభ్యములు కాలేదు. పేర్లను బట్టి యందలి యితివృత్తముల నూహించుటలో నిం దేయొక్కటియు శృంగార రసప్రధానకావ్యముగా పేర్కొనుటకు వీలు లేదు. అవతారదర్పణముగూర్చి చర్చించుచు [4]చాగంటి శేషయ్యగారు, కవి దీనియందు విష్ణుదేవుని పది యవతారములను వర్ణించి యుండునేమో యనిరి- దానినే ఆరుద్రగారు తమ సమగ్రాంధ్రసాహిత్యమున బలపఱచిరి.

1. షట్సహస్ర కులోద్భవ సచివులందు
   సుకృతిగాఁ జేయు నా కొక సుకృతిఁ జేసి - శాకుంత. — 1–23.
2. శాకుంత. - 1 - 30.
3. శాకుంత. - 1-22.
4. ఆంధ్రకవి తరంగిణి - 6 వ సంపుటము.

కాని పినవీరభద్రుడు తన కావ్యములలో తానే చెప్పుకొనినట్లు శివభజనాసక్తుడు; [2]ఆరాధితామరవీరభద్రుడు; [3]వీరభద్ర; పద పద్మ ధ్యాన శుద్ధాంతరంగుడు; [4]పరమేశ్వరుని యవతారమే యతడంచు జను లెన్న దగిన సౌజన్యశాలి. అట్లే శాకుంతల కృతిపతియగు వెన్నయామాత్యుడును [5]ప్రాసాదపు పంచవర్ణమున వేదోక్త సంసిద్ధి కాలగ్రీవుం బూజించువాడు. [6]ఆయన సోమవారవ్రతము చేయగా, అర్ధశశాంకమౌళి, భక్తముఖంబుల విందారగించి, షడ్రసములచే గళస్థ విషకల్మషమును కడుగుకొనును.

ఇట్టి శైవముమధ్య వెలసిన యవతారదర్పణము విష్ణుదేవుని దశావతారములను వర్ణించియుండదు. శాకుంతలమున కవి చేసిన యిష్టదేవతాస్తుతి యందు [7]భైరవస్వామిస్తుతి గలదు. అచట "పృథివి కవతంసమణియైన బిట్రగుంట దానకంబుగ నవతార మైనవాడు" అన్న కవినుడుగు ననుసరించి బిట్రగుంటయందు వెలసిన యాభైరవమూర్తి యవతార కథనమునే యవతార దర్పణముగా దీర్చెనేమో ! అనుశ్రుతముగ నేదేని భైరవావతార గాథ బిట్రగుంట పరిసరముల చెప్పుకొనబడుచున్నచో నీయూహకు కొంత బలము కలుగును.

పినవీరన కాలమునుగూర్చి శాకుంతలమునుండి మన కేమియు తెలియదని చెప్పుకొంటిమి. కాని యీయనకాలమును నిర్ణయించుటకు జైమినీభారతమున చారిత్రకాధారములు గలవు. జైమినీభారతము సాళ్వగుండ నరసింహ భూపాలున కంకిత మీయబడెను. సాళ్వ నరసింహుని వంశమువారిలో "సాళ్వ మంగు" అనునాతడు సంగమరాజును, విజయనగరాధీశుడు నగు మొదటి బుక్కరాయలకడ సైన్యాధిపతిగా నుండెను. ఆయన మధుర నేలు సుల్తాను నజీరుద్దీను నోడించి, తొండై మండలమున సాంబువరాయని ప్రతిష్ఠించి, సాంపరాయస్థాపనాచార్య బిరుదమును వహించెను. ఇది క్రీ॥శ॥ 1345 లో జరిగెనని శాసనాధారము లగ్గడించుచున్నవి. అట్లే యీయన శ్రీరంగమున విగ్రహ ప్రతిష్ఠ చేసెనన్న వార్తయు జైమినీ భారతమున చెప్పబడెను. [8]అది క్రీ॥ శ॥ 1871 లో జరిగిన దని శాసనములు చెప్పుచున్నవి. జైమినీభారతము సాళ్వ నృసింహుని తండ్రియగు గుండని విజయములను, పినతండ్రియగు సాళువ తిప్పని విజయములను వర్ణించెను.

సాళువాభ్యుదయమువలన గుండడు చంద్రగిరికి చేరువనున్న కళ్యాణ

1. శాకుంతలము - 1-20; 2. శాకుంత – ఆశ్వాసాంత గద్య; 3. జైమినీ భార–పీఠిక; 4. జైమినీ భార - పీఠిక; 5. శాకుంత - 1-60; 6. శాకుంత - 1-61; 7. శాకుంతల - 1-5; 8. Madras Epigraphical Report— (M.E.R.) 250/901 *Epi. Ind. Vol. vi. No. 33.*

పురమునకు పాలకుడని తెలియుచున్నది. సంగమ వంశస్థులను సేవించి, యనేక విజయములకు కారణభూతుడైన యీయన శక్తిని గుర్తించియే యంతకుముందు సైన్యాధికారిగా నున్న వీనికి రాజ్యాధికారము నొసంగి యుండవచ్చును. [1]శాసనాధారముల వలన, సాళువ తిప్ప గోపడను నామాంతరము కలిగిన సాళువ తిప్పరాజు విద్యానగరాధిపతియైన రెండవ దేవరాయల చెల్లెలిని హరియమ్మను పెండ్లాడెనని తెలియుచున్నది. ఈ సంబంధము వలన గూడ సాళువవంశస్థుల రాజ్యాధికారము స్థిరపడి యుండవచ్చును. అట్లు కళ్యాణపురమున నుండియే, పరిసరస్థములైన చంద్రగిరి మొదలగు ప్రదేశముల యందు పర్యవేక్షణాధికారమును సాళ్వగుండని కుమారుడగు నరసింహరాజు నెఱపుచుండెడివాడు. కొన్నాళ్ళకు కల్యాణపురము నుండి రాజధానిని చంద్రగిరికి మార్చుకొనె నని సాళువాభ్యుదయము చెప్పును. చంద్రగిరి రాజ్యములోని తిరుపతి నుండి వెలువడిన సాళ్వనృసింహుని [2]మొదటి శాసనకాలము 12-9-1456. అప్పటినుండి క్రీ॥ శ॥ 1489-90 వఱకును సాళ్వనృసింహుని శాసనములు, చిత్తూరు, ఉత్తరార్కాడు, చెంగల్పట్, మైసూరు, కడప, కర్నూలు, సేలమ్, పెనుగొండ, నెల్లూరు జిల్లాలలో, వివిధ ప్రదేశములలో కాన్పించుచున్నవి.

ఈయన కుమారుడు ఇమ్మడి నరసింహరాయలి పేర 1491 నుండి శాసనములు కాన్పించుటచే, [3]సాళ్వనృసింహుడు క్రీ॥ శ॥ 1491 వఱకును జీవించి యున్నట్లు చరిత్రకారులు భావించుచున్నారు. విజయనగరాధీశులైన మల్లికార్జున రాయల క్రిందను (క్రీ॥ శ॥ 1450-67), విరూపాక్షరాయల క్రిందను (క్రీ॥ శ॥ 1468-86) నుండి, సాళ్వనృసింహుడు అధికారము నెఱపుచుండెను. జైమినీ భారతము నందు సాళ్వనృసింహుని విజయములు కొన్ని చెప్పబడినవి. అతడు తమిళదేశము నాక్రమించిన చోళులను పారద్రోలె ననియు, ఒడ్డెరాజును జయించె ననియు, పాలదుర్గము పెనుగొండల యందలి ప్రతిపక్షులను నిర్జించె ననియు పినవీరన చెప్పెను.

మల్లికార్జున రాయల పరిపాలనా కాలమున గజపతుల దండయాత్ర [4]క్రీ॥ శ॥ 1454-55 లోను, [5]క్రీ॥ శ॥ 1464 లోనూ జరిగినట్లుగా చరిత్రకారులు

1. Epigraphia Carnatica—(*Epi. Car.*) *Vol. xi. cd. 14.*
2. Tirumalai Tirupati Devasthanam inscriptions (*T. T. D. I.*) *Vol. V. No. 4.*
3. Historical Inscriptions of Southern India (*His. Ins.*) *By Sewell. pp. 230 to 31.*
4. M. E. R. 70/1917; 386/1915.
5. M. E. R. 51/1919; The Suryavamsi Gajapathis' of Orissa; *By Dr. R. Subrahmanyam.* M. E. R. 84/1919; 93/906 — *pp. 44–45.*

శాసనాధారమును బట్టి చెప్పుచున్నారు. విరూపాక్షరాయల కాలమున గూడ (క్రీ॥ శ॥ 1474-76) గజపతుల దండయాత్ర జరిగినట్లు [1]శాసనాధారము లున్నవి. గజపతుల నూచముట్టుగ సాళ్వనృసింహరాయలు ఓడించి యవమానము పాలు చేసినది 1474-76 లో జరిగిన యుద్ధము నందే! ఆ దండయాత్రనే పినవీరన జైమిని యందు పేర్కొన్నచో, జైమినీభారత రచనము 1474 తరువాతనే యగును. సంగమ వంశమున నాఖరు రాజైన ప్రౌఢదేవరాయలు (వీనినే న్యూనిజ్ 'పడేరావ్' అని చెప్పెను.) రాజకీయ సంక్షోభమునకు భయపడి పారి పోగా సాళ్వనృసింహుడు విజయనగర రాజ్యమునకు మకుటాధిపతి యయ్యెనని చారిత్రకులు చెప్పుచున్నారు. సాళ్వనృసింహుడు క్రీ॥ శ॥ 1-11-1486 లో విద్యానగర సామ్రాజ్యాధినేత యయ్యెనని [2]శాసనాధారము లున్నవి. జైమినీ భారతము సాళ్వనృసింహుని విజయనగర సామ్రాజ్యాధినేతగా చెప్పక పోవుటచే, నిది క్రీ॥ శ॥ 1486 లోపుననే వ్రాయబడి సాళ్వనృసింహునకు కృతి యీయబడి యుండవలయును. ఈవిధముగా జైమినీభారత రచనాకాలమును 1474-86 మధ్యకాలముగా గుర్తించినచో, శాకుంతల రచనాకాలమును క్రీ॥ శ॥ 1474 కి ముందుగా నిర్ణయింపవలసి యుండును.

[3]లోకోక్తిగా ప్రచారములో నున్న కథలలో పినవీరన వీధిలో గోలి కాయల నాడుకొనుచుండగా, శ్రీనాథుడు నైషధమును తెచ్చి యాయనకు జూపించె నని కలదు. శ్రీనాథుని వృద్ధాప్యమున నీయన పూపవయస్సు వాడై యుండును. శ్రీనాథుని కాలము [4]క్రీ॥ శ॥ 1380-1445 మధ్యకాల మగుటచే 1445 నాటికి పినవీరన పదియేండ్ల ప్రాయము వాడైనను, మఱియొక పదునే నేండ్ల తరువాత, అనగా 1460 ప్రాంతమున గాని కావ్యరచనకు నర్హ వయ స్కుడై యుండడు. అనగా క్రీ॥ శ॥ 1460-1474ల మధ్య నెప్పుడేని యీయన శృంగార శాకుంతలమును రచించి సోమరాజుపల్లెయందు ప్రభుత్వము నెఱపు చున్న చిల్లర వెన్నయామాత్యున కంకితమిచ్చి యుండును.

స్వయముగా నవ్యపథ ప్రవర్తకుడును, ప్రవక్తయు కాకపోయినను పినవీరన ప్రతిభావంతుడైన కవి. ఇంచుమించు సమకాలికు డనిపించుకొను కొఱవి గోపరాజు జీయనను 'మహామతి' యని స్తుతించెను. సంస్కృతాంధ్రములు

---

1. The Suryavamsi Gajapathis' of Orissa—*pp. 78–79.*
   *By Dr. R. Subrahmanyam.*
2. Epi. Car. *Vol. XII. Tm. 54.*
3. ఆంధ్రకవుల చరిత్ర—శ్రీ గురజాడ రామమూర్తి పంతులుగారు.
4. ఆంధ్రకవి తరంగిణి—అయిదవ సంపుటము—శ్రీ చాగంటి శేషయ్యగారు.
5. సింహాసన ద్వాత్రింశిక — అవతారిక.

రెండును నీయనకు వశ్యములై వర్తిల్లినవి. సంస్కృత సమాస భూయిష్ఠమైన ప్రౌఢ రచన నీయన యెట్లు పొంకముగా తీర్చగలడో, యలతియలతి పలుకులతో గూడిన తెనుగు తీయదనమును అంత అందముగా జతచేయ గలడు. ఉదాహరణ మున కీ క్రింది రెండు పద్యములను గమనింపుడు.

శకుంతలా దర్శనోత్సాహియై మున్యాశ్రమమున కేగనున్న దుష్యంతున కెదురుగా నగరి వేటపులి వచ్చెను. దానిని వర్ణించు సందర్భమున ప్రౌఢసంస్కృత భూయిష్ఠ రచనను కావించినాడు పినవీరన.

మ. "అని చింతించుచు సంతసించుచు రయంచారంగ సారంగలాం
ఛనవంశాగ్రణి యేగుచో జటుల వర్షాకాల కాలాంబుద
స్తనితధ్వాన వథాధ్వనీన గళగర్త క్రోడ నిష్ఠ్యూతని
స్స్వన నిర్భగ్న నితాంతశాంత బహుసత్త్వ స్వాంతకాంతారమై.

క. శైలద్రుమచరదేణీ
జాలోదర దళనకేళిసమయాతి గళ
త్కీలాలసిక్త దంష్ట్రా
భీలనఖంబగుచు నొక్కబెబ్బులివచ్చెన్."

అట్లే, తెలుగు పలుకుబడి కీ క్రింది యుదాహరణము పరికింపుడు :

దుష్యంతుడు శకుంతలను జూచి, మునికన్య యేమోనని సంశయించి మఱల,

క. "కానీ సంశయ మెల్లను
మానుం బరిపాటి వీరిమాటల వలనన్
లోనున్న రాగివెలుపల
గానంగావచ్చు పూతకడియము భంగిన్.

తే.గీ. వీనులకుఁ బండువులుగాగ వీరిమాట
లాలకించెద గాకని యధిపుఁడుండె
నంతనొక తేఁటి వచ్చి శకుంతలా ము
ఖాంబుజమునందు ముసరిన నలతనొంది.

క. కరమున బలుమఱు వామధు
కరము నదల్ప నది నెమ్మొగము విడువమికిం
గరము భయంకుచు రజనీ
కరముఖి యనసూయఁ జూచి కడు దీనతతోన్...."

ఈ విధముగా నీ కావ్యము నందు సులభమును, ప్రసన్నమధుర మును, అర్థవంతము నగు నిట్టి శైలియే యంతటను కాన్పించును. తీయని

తెలుగు పలుకుబడిని తమతమ కావ్యములందు విరియింపజేయవలయు నన్న ప్రతిజ్ఞ యీ యుగమునందలి యందఱుకవులును నించుమించు గైకొనినట్లే తోచును. అనంతామాత్యుడు, జక్కన, కొఱవి గోపరాజు తమతమ కావ్యములలో తెలుగు తీయదనమును వెలార్చిరి.

శాకుంతలము నందు, పదబంధములు, నుడికారములు, సామెతలు, నేడు వెలుగులో లేని యెన్నియో మారుమూల పదములు, కుప్పలు తెప్పలుగా లభింపగలవు. ఇచట లభించు భాషాప్రయోగ విశేషములు, భాషాశాస్త్ర పరిచితులకు మోదమును కలిగించునవి గానున్నవి.

1. వెచ్చము పెట్టుమన్న పదివేలకు "నుద్దరు"లొల్లరు.

ఉద్దరి యను పదము నేడు 'అరువు' అను నర్థమున వాడబడుచున్నది. కన్నడ, మరాఠి భాషలయందును నేడా పదమున నాయర్థమే కలదు. శబ్దరత్నాకరమున ఉద్దరి యనుపదము నీయక పోయినను, ఉద్దరువు అను పదమునకు "నేల మొదలగు వాని నుండి తీసుకొనెడి వడ్డీ లేని యప్పు" అని వివరణ మీయబడెను. కాని పినవీరన దీనిని 'అప్పు' అనునర్థమున కాక 'తాకట్టు' అను నర్థమున వాడెను. హస్తిన యందలి వైశ్యుల నెవ్వానినేని చిల్లర సరుకుల (వెచ్చముల) నీయ మన్నచో, వేల విలువ గల సరుకుల నైనను కుదువ లేకుండనే యిచ్చుటకు వారు వెనుదీయరు.

2. ఓమనఁ బాపఁ గోలెఁ గృపనోమితి నీ మృగరాజ డింభముఁ—

ఓమనఁ బాప యను పదబంధము నవ్యమైనది. ఓము=సాకు, కాపాడు, రక్షించు అను నర్థములు గల క్రియకు వాడుక గలదు. ఓమన యను రూపమును శబ్దరత్నాకరము గ్రహింపలేదు. ఓమన గాయలు అను పదమునకు "ఓమనగుంటలాడు గింజలు" అను నర్థము చెప్పెను. కాని వాడుకలో ఓమనగాయలు, వామన గాయలు అను పదమున్నది. అప్పుడే చెట్టుకు దిగెడి, పూపపిందెల వంటి కసటు వోని చింతకాయలను ఓమనగాయ లనుట కలదు. ఈ యర్థమును శబ్దరత్నాకరకారుడు గ్రహింపలేదు. [1]ఇతర ద్రావిడ భాషలలో, ఓము అను తెలుగు ధాతువునకు సరిగా, కన్నడమున 'ఓవు' రక్షించు అను ధాతురూపమును, తుళు భాష యందు ఓమన-ప్రియము (Dear), పసి (Tender) అను నర్థముల యందు ధాతురూపమును, తమిళమున ఓమ్బు-రక్షించు, పెంచు అను నర్థమున ధాతు రూపమును వాడబడుచున్నవి. ఈ యర్థములను సమన్వయము చేయగా, ఓమన పాప యనగా మిక్కిలి పసిపాప, కన్ను తెఱువని నెత్తురుగుడ్డు, అని యర్థమగును. అట్టి దశనుండి యీ జింకపిల్లను నేనే కాపాడితి నని యర్థము.

---

1. Dravidam Etymological Dictionary *Burrow & Emeneau*

3. పురటాలి ''తగవు'' గొంపోవు వారిణి—

'తగవు'నకు నేఁడు వాడుకలో నున్న యర్థము 'కలహమై'నను సాంప్రదాయకమైన యర్థము 'ధర్మము; ఉచితము'అని గదా! కాని తమిళమున 'తగవు' అనగా సంప్రదాయము ననుసరించి వారు వారు తీర్చవలసిన కానుకలు అను నర్థము కలదు. అనగా కవులు రాజునుండి గ్రహించు కానుకలను ''తగవరిందవరిసె'' అందురు. దీనికితోడు శబ్దరత్నాకరకారుడు, 'పెండ్లికుమారునకు తలిదండ్రు లిచ్చు కానుక' అను నర్థము నిచ్చెను. అదియు సంప్రదాయము ననుసరించి యొక మర్యాదకు కట్టుబడి యిచ్చు కానుకయే. ఆయర్థముననే పినవీరన 'తగవు' నిక్కడ వాడెను. కాని యిచట కావింపబడిన చిన్న మార్పు ప్రసవించిన స్త్రీకి చూడబోవువారు కొనిపోవు కానుక యని—పులి యీనియుండగా, లేడి ప్రసవించిన వారికి కొనిపోవలసిన కానుకలను గొనిపోవును అని యర్థము.

4. టంకము బంగారము తోడి యొర ప్రబంధము వొందుఁ....

ఇచట టంకము అను పదము మేలిమి యను నర్థమున వాడబడినది. సాధారణముగా నీనాడు వాడుకలో నున్న యర్థము. బంగారపు నగలకు వాడు 'నతుకు' అని; కాని టంక మనగా పదాఱువన్నె బంగార మని శబ్దరత్నాకర కారుఁడు వివరించెను. తెలంగాణమున ''టంక మెత్తు బంగారము'' అను వాడుక కలదు. ఇక్కడ నిది మానార్థమున వాడబడుచున్నది. తమిళమున, మళయాళమున ''తంగమ్'' అనగా మేలిమి బంగారము అని యర్థము. పినవీరన యిచట 'టంక'మను పదమును మేలిమి యను నర్థముననే వాడెను. శృంగార మంగియై యంగరసములతో కూడుకొన్న ప్రబంధము టంకము బంగారము, అనగా మేలిమి బంగారముతో సామ్యమును బొందుచున్నదని దీని యర్థము.

ఇట్టి వెన్నింటినో ప్రయోగవిశేషములను ఈ కావ్యమం దంతటను చూపింపవచ్చును. గ్రంథవిస్తరభీతిచే మానుచున్నాను.

ప్రయోగవిశేషములతోపాటు చక్కని జాతీయములకు గూడ నీ గ్రంథ మొక 'బండరువు' అని చెప్పనొప్పును.

1. దుష్టమృగ శిక్షణంబువలన సుకృతంబుగా మృగయాసౌఖ్యంబును సిద్ధించె. దేవర ప్రసాదంబు, జాదులుం బలెనయ్యె నని యమాత్యుల యనుమతంబున కొలువు లిచ్చి,

ఒకేకార్యమున రెండర్థంబులు సిద్ధించిన వనుదానిని చెప్పుచు వాడబడిన జాతీయ మిది. దైవప్రసాదముగా గన్నేరుపువ్వు లిచ్చినను శిరోధార్యములే. అట్టియెడ దైవప్రసాదముగా జాజిపూవు లిచ్చినచో ప్రసాద మను ప్రత్య

యమే కాక, సువాసనాభరితములైన కుసుమశ్రేష్ఠము లని యింకను సంతోషము కలుగును. అట్లే వేటవలన దుష్టమృగ శిక్షణ యొక్కటియే గాక మృగయాసౌఖ్యమును గలిగెనని చెప్పెను.

2. సరవి యెఱుంగ లేకకట జాదులు వేచర మంగలంబునన్—

కణ్వమహర్షి శకుంతలను తరుసేచన మాచరింపగా నియమించెను. దిరిసెన పువ్వుకంటె కడు మెత్తన యామె మేను. ఏమని చెప్పవలయును? పద్ధతి యెఱుగని వారు మంగలమున జాజిపూపులను వేయించినట్లుగా, కణ్వు డాసుకుమార గాత్రయైన శకుంతలను వృక్షసేచన మాచరింప నియమించెను.

3. అదయుఁడై విధి కంచము మొదలివాని లేశమంతయుఁ గృప లేక లేవనెత్తె—

శకుంతలాదర్శనాకాంక్షియై పోవుచున్న భూవరునకు బెబ్బులి యడ్డమై వానిగమనమున కంతరాయము గలిగించినది. అందుమూలమున కలిగిన నిస్పృహచే రా జిట్లు పలికెను.

కడుపు నిండుగా భుజింపవలయునని కంచములో పెట్టిన పదార్థములను తినుటకు మొదలు పెట్టకమునుపే విధి లేశ మేనియు కృపలేక కంచము ముందు నుండి లేవనెత్తెను-అని దీని యర్థము. "నోటిదగ్గర కూడు పడగొట్టుట" యను జాతీయమున కిది యన్యరూపము.

అటులే 'నాలుక వెచ్చన' 4—35; లోన నీతలుం బోతలు నైన యట్టి తలపోతలు 3-58; మూసిన ముత్తియంబు 3-77; వంటి వెన్నియేని మనోహరములైన ప్రయోగములను చూపింపవచ్చును.

సామెతలనుగూడ నీకవి సమయోచితముగా వాడును. అందును తీయని తెలుగు పలుకుబడితో గూడి యర్థస్ఫూర్తి కలిగి యతికినట్లు సరిపోవు లోకోక్తులను వాడుటలో నీయన మెలకువ చూపింపగలడు. మచ్చునకు :

1. తోటకూరకు చంద్రహాసము దెత్తురే! 4-48
2. తెఱవ యేనుంగు నెక్కల దిడ్డిచొఱగ 3-246
3. అనఁటిపం డొల్వ నేఁటికి నినుపగోరు 4-47
4. తల్లివిసము పెట్టి,తండ్రి యమ్మఁగ,మాన్పఁగలరె యొరులు 4-49
5. అరయంగా మెడ బెట్టుకొంచు దిరుగ నీ హారంబులే
భామినుల్ 3-242

ఈ కావ్యమునుండి యెక్కువగా నాకాలమునాటి సాంఘికాచారములు తెలియుట లేదు. కాని యున్నంతలో నీక్రిందివి గమనార్హములు.

1. శకుంతల విరహవేదనావశయై యుండగా చెలులు పొగడలను, బొడ్డుమల్లెలను, పొన్నవిరులను నాలుగు దిక్కుల బడిసివైచిరి 3-41. దీని వలన దిష్టితీయు నాచార మాకాలమున నుండెడి దనవచ్చును.

2. ప్రసవించిన స్త్రీలకు, చూడబోవువారు కానుకలు కొనిపోవు నాచారముండెడిది. 2-45; 4-62.

3. అత్తవారిపై నేరము లెన్ను నల్లుండ్రు కలరు. కన్నె నిచ్చినవారు వరుని దృష్టిలో గౌరవహీనులుగ కాన్పించుటయు నానా డుండియుండవచ్చును. 4-73.

4. స్త్రీకి పతియే ప్రత్యక్షదైవ మను ప్రచారము చేయుటలో పురుషుల కెక్కడలేని శ్రద్ధ యున్నట్లు కానబడును, 4-74 నుండి 82 వరకు.

5. ఆటకాడు తెఱబొమ్మలచే గొండ్లి యాడించు వినోద మానాడున్నట్లు తెల్లమగుచున్నది. 3-125.

ఇట్టివే మఱికొన్ని యాచారముల నెత్తి చూపింపవచ్చును.

పినవీరన దుష్యంతుడు మృగయావినోదియై వెడలెనని చెప్పిన ఘట్టమున వేటను మిక్కిలి విపులముగా వర్ణించెను. ఈయన అప్పుడు వాడిన వలలు, వేటాడుట యందలి భేదములు, పద్ధతులు, వేటకాండ్రు సమమార్చుకొనెడి వివిధసాధన సామగ్రి, వారివెంట బయలుదేరిన చిత్రవిచిత్రనామాంచితములైన జాగిలములు, సాళువములు, మచ్చిక జంతువులు- వీని నన్నిటిని విపులముగను, సహజముగను వర్ణించెను. అల్లసాని పెద్దన, స్వారోచివేటసందర్భమునను, ధూర్జటి తిన్నని వేటసందర్భమునను వర్ణించిన వర్ణన పినవీరనవర్ణనవలన ప్రభావితమైనదై యుండవచ్చును,

పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి కవిత్వమునకు వలసిన యన్ని ముఖ్యాంశములలోను నేవిధముగను ప్రశస్తులైన యాయుగపు కవులకు తీసిపోని ప్రజ్ఞాశాలి. తనకు గల యమేయపాండిత్యముచేతను, మృదుమధుర కవితాశక్తిచేతను, ఆంధ్రసాహితీలతను అసమానసౌరభములను వెదచల్లు జంట పూవులను పూయించెను. ఆజంటపూవుల యమృతసౌరభ మీనాటికిని మనలను తన్మయులను చేయుచునే యున్నది.

ఈపీఠిక వ్రాయుటలో నా కనేకగ్రంథములును, శాసనములును

శ్రీ ర స్తు

# శృంగార శాకుంతలము

## ప్ర థ మా శ్వా స ము

శ్రీవత్సాంకుఁడు భక్తవత్సలుఁడు లక్ష్మీప్రాణనాథుండు రా
జీవాక్షుండు సమస్త భూత భువన క్షేమంకరానేక రూ
పావిర్భావుఁడు వాసుదేవుఁ డను కంపావాసుఁడై దాన వి
ద్యా విఖ్యాతుని మంత్రి వెన్నని నితాంత శ్రీయుతుం జేయుతన్. 1

సీ. పూని చరాచరంబు భరించు నొకమూర్తి
యుడుపుఁ దృష్ణాఖేద మొక్కమూర్తి
యారగించు మనోజ్ఞమగు హుతం బొకమూర్తి
యొసఁగు జైతన్యంబు నొక్కమూర్తి
యాదిత్యులకుఁ ద్రోవయై పొల్చు నొకమూర్తి
యుడుగణంబుల నేలు నొక్కమూర్తి
విశ్వంబు చీఁకటి విరియించు నొకమూర్తి
హోతయై దీపించు నొక్కమూర్తి
తే. యరయ నెవ్వనియందు నయ్యష్టమూర్తి
యిష్టఫల దాత కరుణాసమేతుఁ డగుచు
వెలయఁ జిల్లర నాగయ వెన్నమంత్రిఁ
జిరతరైశ్వర్య సంపన్నుఁ జేయుగాత. 2

శా. చేయు న్విశ్వము నెవ్వఁ డంచిత కళాశిల్పం బనల్పంబుగా
వ్రాయుం బ్రాణుల ఫాలపట్టికల నెవ్వం డర్హావర్ణంబు లా

మ్నాయవ్రాతము లూర్పు లెవ్వని[1]కి నయ్యబ్జాత గర్భుండు దీ
ర్ఘాయుష్మంతునిఁ జేయు నాగవిభు వెన్నామాత్య చూడామణిన్. 3

మ. జననీ స్తన్యముఁ గ్రోలుచుం జరణ[2] కంజాతంబునం గింకిణీ
స్వన మింపారగఁ దల్లిమేన మృదుల స్పర్శంబుగాఁ దొండ మ
ల్లన యాడించుచుఁ జొక్కు-విఘ్నపతి యుల్లాసంబుతో మంత్రి వె
న్ననికి న్మన్నన సొంపు మీఱ నొసఁగు న్భద్రంబు లెల్లప్పుడున్. 4

సీ. పగడంపుఁ జిగురు జొంపము సొంపు విహసింపు
కడునొప్పుఁ గుఱుచ కెంజడల వాఁడు
విదియ చందురుతోడ వీడుజోడాడెడు
రమణీయ దంష్ట్రాంకురముల వాఁడు
సీధుపానక్రీడఁ జెంగల్వ పూఁజాయ
దొంగిలించెడు కన్నుదోయి వాఁడు
క్రొత్త నీలాల రంగునకు నించుక మించి
మెఱుఁగారు నల్లని [3]మేనివాఁడు
తే. పృథివి కవతంసమణి యైన బిట్రగుంట
దానకంబుగ నవతారమైన వాఁడు
భైరవస్వామి సకల సంపదల నొసఁగి
మనుచుఁ జిల్లర వెన్నయామాత్యవరుని. 5

ఉ. మెచ్చగు విచ్చు దమ్మిపువు మేడలలోన నిధానదేవత
ల్వచ్చి కటాక్ష సంజ్ఞకుఁ గెలంకులఁ గొల్వఁగ నోలగంబు సొం
పచ్చుగనుండు చంద్రముఖి యాదిమలక్ష్మి వసించుఁ గావుత
న్మచ్చిగ వెన్నయప్రభుని మందిరరాజమునందు నిచ్చలున్. 6

మ. పొసఁగ న్నేఁ గృతిఁ జెప్పఁగాఁ బరిమళంబు ల్చాల కొక్కొక్కచోఁ
గొస రొక్కించుక గల్గెనేనియును సంకోచంబు గాకుండ నా

1. i. కి నానాళీక గర్భుండు, ii. కగున్ దత్స్వర్ణ గర్భుండు; 2. సంచారంబు నం; 3. మేనువాఁడు.

రసి యచ్చోటికి నిచ్చుఁగాత పరిపూర్ణంబొందు వాగ్దేవి యిం
పెసలారం దన విభ్రమశ్రవణకల్హారోదయామోదముల్. 7

శా. అర్థి న్నాత్మక మానసాబ్జమున నధ్యాసీనుఁ గావించి సం
ప్రార్థింతు న్యతి సార్వభౌముఁ బరమబ్రహ్మానుసంధాత నా
నార్థాలంకృతబంధురశ్రుతిరహస్యజ్ఞాత శ్రీ భారతీ
తీర్థశ్రీ చరణంబు నుల్లసితముక్తిప్రేయసీవల్లభున్. 8

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబు గావించి, 9

సీ. వల్మీక సంభవ వ్యాస మౌనీంద్రుల
వాణి కంజలిబంధపాణి యొసఁగి
భట్టబాణ మయూర భట్టారకుల
మంజుభాషావిశేషంబుఁ బ్రస్తుతించి
భవభూతి శివభద్ర బంధుర భారతీ
హేలా విలాసంబు నిచ్చగించి
మాఘ భారవుల నిరాఘాటచాటు
సరస్వతీపుణ్యగౌరవముఁ దలఁచి
తే. లల్లటుని గాళిదాసు సౌమిల్లకునిని,
భామహుని దండి వామను భాను హర్షు
హర్షసంపూర్ణహృదయుఁడనై కవిత్వ
సమధికస్ఫూర్తికై భక్తి సంస్తుతించి. 10

క. ఇట్టుల మగుమతి భారత
ఘట్టమునకు నడవవచ్చుఁ గట్టిన కవితా
పట్టాభిషక్తు నన్నయ
భట్టోపాధ్యాయుఁ దలఁచి పరమప్రీతిన్. 11

గీ. ఉభయ కవిమిత్రు నత్యంతశుభచరిత్రు
భానుసమ తేజుఁ గొమ్మయప్రభుతనూజు

పద్ధతియు, ప్రాత కథ క్రొత్త రీతిగా నలంకరింప బడిన వైనమును — అన్నియు శ్రీనాథ కవితా లక్షణములు. అనగా నాయుగలక్షణములు. ఈ యుగము వాడును శ్రీనాథున కించు మించు సమకాలీనుడు నైన పిల్లలమఱ్ఱి పినవీరన యీ లక్షణములచే ప్రభావితుడు కాకుండ నుండలేకపోయెను. ఈయన శృంగార శాకుంతలము శ్రీనాథయుగలక్షణములకు నిర్దుష్టమైన యుదాహరణము.

ఈ యుగము నందలి కావ్యముల నన్నిటిని మూడు విభాగములు చేయవచ్చును.

## 1. పురాణములను పరివర్తించుట :

1. వరాహ పురాణము.
2. జైమినీ భారతము.
3. పద్మ పురాణోత్తర ఖండము.
4. భాగవత దశమ స్కంధము.
5. వాసిష్ఠ రామాయణము.
6. ప్రబోధ చంద్రోదయము.

## 2. పురాణాంతర్గత కథలను ప్రబంధములుగా చెప్పుట :

1. శృంగార శాకుంతలము.
2. హరవిలాసము.
3. కాశీఖండము.
4. భీమఖండము.
5. శృంగార నైషధము.
6. నాచికేతూపాఖ్యానము.

## 3. వివిధ కథలను గూర్చి యేక కావ్యముగా రచించుట :

1. విక్రమార్క చరిత్ర.
2. భోజరాజీయము.
3. సింహాసన ద్వాత్రింశిక.
4. పంచతంత్రము.

పురాణ కథలను ప్రబంధములుగా మలచినవానిలో ప్రసిద్ధములైనవి రెండే కాన్పించుచున్నవి. అందు మొదటిది యుగకర్త యైన శ్రీనాథుని శృంగార నైషధమును, రెండవది పినవీరన శృంగార శాకుంతలమును. నైషధము ఆనాటికే శ్రీహర్షునిచలన సంస్కృతమున రచింపబడి యుండుట చేతను, [1]శ్రీనాథుడు తాను హర్ష నైషధ కావ్యమును తెలుఁగున తీర్చుచున్నాడ నని చెప్పుకొనుటచేతను దీనిని స్వతంత్ర గ్రంథ మనుటకు వీలు లేదు. కాని పినవీరన

---

1. సంతరించితి నిండు జవ్వనంబున యందు హర్ష నైషధ కావ్య మాంధ్ర భాష — కాశీ.

చిత్తప వచన రాజి నిబంధనంబున
దారమహోపురాధ్యతు మహిమ
కాళిదాస వచోవిళాలతాప్రౌఢత
విక్రమాదిత్య భూ విభుని చరిత
తే. మఱియుఁ దత్తత్కవీంద్ర సమగ్ర వాగ్వి
భూతిఁ దెలుపుచు నున్నది పూర్వరాజ
శీల దానాది చర్యా విశేషములను
గీర్తి సదనంబు కృతియ తర్కింప ధరణి. 17

క. ఆచంద్రతారకంబుగ,
భూచక్రమునందుఁ గీర్తిఁ బోషింపఁగఁ దా
రోచిష్ణు వగు ప్రబంధము,
వైచిత్రి యొనర్చు సుకవివరుఁడు కలిగినన్. 18

సీ. నన్నపార్యుని ప్రబంధప్రౌఢ
వాసనా సంపత్తి సొంపు పుట్టింప నేర్చుఁ
దిక్కన యజ్వవాగ్భక్తికా మోదంబు
చెలువు కర్ణముల వాసింప నేర్చుఁ
నాచిరాజుని సోము వాచామహత్త్వంబు
సౌరభంబులు వెదచల్ల నేర్చు
శ్రీనాథభట్టు భాషానిగుంభంబుల
పరిమళంబుల గూడఁ బఱచనేర్చు
తే. మహితగుణశాలి పిల్లలమఱ్ఱి వీర
నార్యుఁడా యింటఁ బైతామహంబగుచును
వెలయుచున్నది నేఁడు కవిత్వలక్ష్మి
యఖిల సత్కవి నికరంబు నాదరింప. 19

క. ఆసుకవిచేత శివభజ
నాసక్తుని చేతఁ గళ్యపాన్వయు చేతన్

పూర్ణముగా స్వీకరింపక వానిలో తన కిష్టమైన కథాంశములకు స్వకపోల కల్పనను జోడించుటలో పాటించిన యౌచిత్య మెట్టిది? అందున సాధించిన ప్రయోజన మేమి?

భారతకథయందలి దుష్యంతుడు ధీరోదాత్త నాయకుడుగా నిలుచుటకు తగడు. ఎఱిగి యెఱిగి లోకోపవాద భీతిచే నసత్య దోషమునకు పాలైన వాడు నాయకుడగుట కావ్యనాటక మర్యాదకు విఘాతము కలిగించు నంశము. అందువలన కాళిదాసు తన దుష్యంతుని ధీరోదాత్తునిగ తీర్చుటకే సంకల్పించెను. దుర్వాసశాపమును కల్పించి ముద్రికను శకుంతల జారవిడుచుకొనెడి ఘట్టమును సృష్టించి రాజునకు మతిమఱపు కల్పించెను. శకుంతలా దుష్యంతుల సమాగమమును రాజసభయందు గాక మారీచాశ్రమమున సంభవింపజేసెను. రాజచటికి వచ్చుటకై దేవదానవ యుద్ధ కల్పనమును, రాజందు దేవతలకు సహాయకుడుగా నేగుటయు కల్పించి, వీరమును నాటకాంతర్గత శృంగారమున కంగముగా పోషించెను. శకుంతలా దుష్యంతుల మధ్య విప్రయోగమును సృష్టించి వియోగ శృంగారమును పోషించెను. అట్లు చిన్నదియు ప్రాసంగికముగా చెప్పబడినదియు, భావ సంఘర్షను స్పష్టముగా చిత్రింపనిదియు నైన భారత కథను రమణీయమైన నాటక కథగా కాళిదాసు తీర్చెను. కాళిదాసువలె పినవీరయ్య తన కావ్య నాయకుని ధీరోదాత్తునిగా చిత్రించుటకే సమకట్టెను. అందువలన దుర్వాసశాప వృత్తాంతమును కాళిదాసునుండి గ్రహించెను. కాని నాటక కథ కనువుగా తీర్చబడిన నాయికా నాయకుల మధ్య దీర్ఘ వియోగమును కావ్య కథా సందర్భమున కపసరమైనదిగా నాయన భావింపలేదు. దుష్యంతుని శీలమును నిర్దుష్టముగ చిత్రించుటయే ప్రధానాశయము గాని శృంగార భేదమగు విప్రయోగ శృంగారమును పోషించుట యీాయనయభిమతము కాదు. కావుననే కాళిదాసమునుండి ముద్రికా ప్రాధాన్యము నంగీకరించినను, శకుంతల దానిని జారవిడుచుకొన్నట్లు చెప్పలేదు. ముద్రికను చూచిన వెంటనే శాపావసానము కలుగునన్న సత్యము రెంటియందును సమానముగ నున్నను కాళిదాసుదుష్యంతుడు ముద్రికను చూచుటకు కొన్ని యేండ్లు పట్టుటయు, పినవీరనదుష్యంతుడు దాని నా సభా భవనము నందే కొన్ని గడియల తరువాత చూచుటయు, నీ రెండు కథల మధ్య గల తారతమ్యమును తెలియజేయును. మొదటిది నాటకోచితముగా నుండగా, రెండవది కావ్యశిల్పమునకు సరిపోయినట్లు తోచును. దీనినిబట్టి పినవీరన శాకుంతలమున నొక్క దుర్వాసశాపకల్పనము తప్ప మిగిలిన కథ యంతయు భారతప్రోక్తముగనే నడచినదనవలయును.

భారతమున శకుంతలోపాఖ్యానము ప్రాసంగికముగా చెప్పబడినది.

క. శృంగారము ముఖ్యంబగు
నంగియు నంగములుఁ దలఁప [1]నన్య రసములు
న్సాంగ మగునేనిఁ డంకము
బంగారముతోడి యొర ప్రబంధము వొందున్. 25

గీ. కథ ప్రసిద్ధయు మిగుల శృంగార వతియుఁ
బరిగణింపంగ శ్రీమహాభారతమునఁ
గథితమైన శకుంతలాఖ్యాన భంగి
నది ప్రబంధంబుఁ జేయు ప్రఖ్యాతినొందఁ. 26

సీ. [2]సరపువ్వులుగ మాలకరి పెక్కు తెఱఁగుల
విరుల నెత్తులుగఁ గావించినట్లు
కర్పూర కస్తూరికావస్తు వితతిచే
శ్రీ ఖండచర్చ వాసించినట్టు
లొడికంబుగా గందవొడికి నానాసూన
పరిమళంబులు గూడఁ బఱచినట్లు
సరఘలు వివిధ పుష్ప మరందల
వములు గొనివచ్చి తేనియఁ గూర్చినట్లు
తే. భారతప్రోక్తకథ మూలకారణముగఁ
గాళిదాసుని నాటక క్రమము కొంత
తావకోక్తికి నభినవశ్రీ వహింపఁ
గూర్మిఁ గృతిసేయు నాకు శాకుంతలంబు. 27

వ. అని సవినయంబుగాఁ గర్పూరతాంబూలంబు జాంబూనదపాత్రంబున నర్పించి ప్రార్థించినఁ దద్వచన ప్రకారంబున మిశ్ర బంధంబుగా శాకుంతలం బను ప్రబంధంబు బంధుర ప్రీతిం జెప్పఁబూనితి నే తత్ప్రారంభంబునకు మంగళాచారంబుగాఁ గృతినాయకుని వంశావతారం బభివర్ణించెద.

1. నష్ట; 2. సరవిపూల్గల.

[1]పినవీరన విపుల చాటూక్తి నిర్నిద్రుడు. కీ॥ శే॥ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు సంపాదించిన చాటుపద్యమణిమంజరియందు సాళ్వగుండ నరసింహా భూపాలుని పేర జెప్పిన కొన్ని చాటువులు గలవు. "గుండ భూపాలు నరసింహా మండ లేంద్ర" యను మకుటముతో నున్న వాని నెవరు రచించిరో తెలియదు. రాజు జైమినీ భారత కృతిపతి యగుటచేతను, వీరన చాటూక్తి నిర్నిద్రుడగుట చేతను పిన వీరనయే వీనిని చెప్పి యుండవచ్చునని [2]శ్రీ ప్రభాకర శాస్త్రిగారి యభిప్రాయము. చాటువుల యందును రాజనీతియు, సప్తాంగ పద్ధతియు చెప్పఁబడి నది. ఒక వేళ తా నాశువుగ చెప్పి భావములను కావ్య బద్ధము చేయగోరి శాకుంత లము చివఱ వానిని నారదోపదేశ రూపమున చేర్చెనేమో! కాని జైమినీ భారత రచనా కాలమున పినవీరయ సాళ్వగుండ నరసింహ భూపాలుని ప్రాపు పొందినట్లును, శాకుంతల రచనా కాలమున సోమరాజుపల్లెయం దున్నట్లును, గ్రంథస్థాధారములు చెప్పును. అనగా నీ చాటుధార శాకుంతల రచన తరువాతనే వెలువడి యుండవలయును గదా ? అది శాకుంతలమున నెట్లు చేరియుండునను సందేహము కలుగవచ్చును. శాకుంతల కృతిపతి సోమరాజుపల్లె నివాసి యైనను. శాకుంతల కృతి రచనా కాల మిద మిత్థమని తేల్చుటకు మనకు ప పత్తులు లేవు, జైమినీ భారతము దాని తరువాతి రచనయే మైనను శాకుంతల రచనా కాలముననే కవి సాళ్వగుండ నరసింహ భూపాలుని యాస్థానమునకు రాకపోకలు చేయుచుండుటలోను, పద్యము లాశువుగా చెప్పుచుండుటలోను ప్రతిబంధ మున్న దని యనుకొనుట కాధారములు లేవు. ఆ పక్షమున శాకుంతలమున నారద కృతోపదేశమునకు స్థానము లభించుటకీ యాశుపద్యములే కారణమై యుండ వచ్చును.

శాకుంతలమున విపులముగా చిత్రించిన మఱియొక ఘట్టము [3]కణ్వుడు శకుంతల కుపదేశించిన పతివ్రతా ధర్మములతో గూడినది. ఈ ధర్మము లన్నియు శాకుంతలము కాలము నాటికి ప్రచారములో నున్న వని చెప్పుటకు సాక్ష్యములు లేవు. [4]శ్రీనాథుని కాశీ ఖండమున బృహస్పతి లోపాముద్రకు చెప్పిన ధర్మములు

---

1. భారతీ తీర్థ యతిసార్వభౌమ గురుకృపాతిశయ లబ్ధ కవితావిభూతి గలిగి
గౌరవము కాంచినాఁడవు కవులచేత విపుల చాటూక్తినిర్నిద్ర వీరభద్ర.
శాకుంతల. 1. 22.

2. చాటుపద్య మణిమంజరి — పీఠిక.

3. శాకుంతల. 4-75 నుండి 82.

4. కాశీ ఖం. 2-72 నుండి 94 వరకు.

దా నొంది మంత్రి మేడన
జానుగ భజియించె సప్తసంతానము1లన్. 33

క. ఆ మేడన మంత్రికి సాధ్వీమణి
మాంచాంబకున్ శ్రుతిత్రయము గతి
త్రామత్రయంబు పోలిక
నాముష్యాయణులు గలిగి రనుపమ తేజుల్. 34

వ. అందు, 35

శా. దుగ్ధాంభోధిగభీరు రూపజితచేతోజాతు నుద్యత్ప్రభా
రుగ్ధాముం గరుణాభిరాము ధృతి మేరుక్ష్మాధరంబు న్సుధా
దిగ్ధస్వాంతు నితాంతదానసురపృథ్వీజాతము న్బాంధవ
స్నిగ్ధుం జిల్లర యెఱ్ఱయ ప్రభుమణిం జెప్పందగుం బెంపునన్. 36

శా. ఆ యెఱ్ఱయ్యకుఁ, గూర్మి తమ్ముఁడగు వెన్నాఖ్యుండు ప్రఖ్యాతిగా
మ్రోయించె న్బహుదేశ భూవర సభామూర్ధంబులం దుల్లస
త్సాయంకాలనటన్మహానటజటాసంఘాట 2ఘాటీవళ
త్తోయస్ఫాలన ఫక్కికానఘయశస్తుత్తుంభ నిర్ఘోషమున్. 37

వ. తదనుసంభవుండు. 38

సీ. గౌతమ మునినాథుచేత నొప్పరి మేను
వికృతి నొందనినాఁడు వేల్పుఱేఁడుఁ
బెండ్లిలో గిరిజాస్య బింబంబుఁ జూచుచోఁ
దాల్మి వీఁడని నాఁడు తమ్మిచూలి
కలశపయోరాశి చిలుకు కవ్వపుఁ
గమ్మకుంది కబ్బనినాఁడు మందరంబుఁ
గాళికా విభుని డాకాలి తాటింపులఁ
గమల బారనినాఁడు కుముదహితుఁడు

1. లున్; 2. వాటీ.

తే. భోగధీధైర్య కాంతులఁ బోల్పఁబోలుఁ
గాని నాఁటిక నేఁడిదు గా రనంగ
వెలసె వెన్నయయనుజుండు వినయధనుఁడు
త్యాగశిబిరాజు చిల్లరనాగరాజు. 39

క. ఆ నాగసచివధీమణి
శ్రీనాయకుఁ డిందిరను వరించిన కరణి
న్మానవతీతిలకముఁ బృథ్వీను
తగతిఁ బోతమాంబ వివహంబయ్యెన్. 40

ఉ. ఆ పురుషావతంసమున కా[1]సుచరిత్రకు నుద్భవించి రు
ద్దీపితకీర్తి వెన్ననయు ధీనిధి మేడనయు న్సమస్త వి
ద్యాపరమేష్ఠి యాదెనయు ధార్మికుఁ డెఱ్ఱనయు న్సుధానుస
ల్లాపుఁడు వీరభద్రుఁడును లాలితనీతి కళాధురంధరుల్. 41

వ. ఇట్లు సమంచితదానవంచితకల్పతరుపంచకంబగు నా యమాత్యకుమార
పంచకంబునందు, 42

మ. కుల పాథోనిధిపూర్ణ చంద్రముఁడు దిక్కుంభీనహేలాకట
స్థలనీరంధ్రమదప్రవాహలహరీచక్రాంగసత్కీర్తి కుం
డలిరాట్కుండలపూజనారతుఁ డఖండశ్రీసమన్వితుఁడై
వెలసెం జిల్లర వెన్నమంత్రి సకలోర్వీచక్రవాళంబునన్. 43

క. వెన్నయ కూరిమి తమ్ముఁడు
సన్నుతచరితుఁడు సమస్తజనసమ్మతుఁ డ
త్యున్నతవాచావైభవ
పన్నగపతి మేడ మంత్రి ప్రస్తుతి కెక్కెన్. 44

ఉ. మేడన పేర్మినొందెఁ బుడమి న్నయసంపద దేవమంత్రితో
నీడన యాచకావళి కభీష్టపుటీగుల కల్పశాఖికిం

1. సుచరిత్రున కుద్భవించి.

జోడన ధీజనస్తుతవచోవిభవంబున శేషచక్రి వాఁ
దోడన సాటిగా నతనితోఁ బెఱమంత్రులు జాడుబేడనన్. 45

శా. ఉన్నారెన్నిక కెందఱే సచివు లత్యుచ్చోదరు ల్పాలసం
పన్నుల్వారలఁ గింపచానుల గణింపం బోరు వాగ్వైఖరు
ల్మిన్నుల్మోసి వెలుంగు సత్కవిజను ల్మెడయ్య వర్ణింతు రా
వెన్నామాత్యు ననుంగు దమ్ముని జగద్విఖ్యాత చారిత్రునిన్. 46

క. అతని యనుజన్ముండ[1]గు
నాతఁడు బుధవిబుధతరువు నళినదళాక్షీ
నూతనమదనుం డాదెన
భూతలము యశఃపటీరమున వాసించెన్. 47

ఉ. ఆది నృప ప్రధాను లెనయాదురు గాని సుధీగుణంబుల
న్మేదిని నేఁటివారి నుపమింప సమానులుగారు ధర్మ స
మ్మోదికి సత్కళానివహమోహనవేదికి లోకహృన్ముదు
త్పాదికి మిత్రభృత్యహితబంధు వినోదికి మంత్రియాదికిన్. 48

సీ. కులసమాగత ధర్మగుణ రక్షణమున
సీతాకాంతు రెండవ తమ్మునికిని
నవికార నవమోహనాకారమునఁ
బురందరసూతి రెండవ తమ్మునికిని
సన్నుతాశ్రాంత విశ్రాణనంబున
బరేతస్వామి రెండవ తమ్మునికిని
సుకృత సంధుక్షణాశోభితామల బుద్ధి
దశకంఠు రెండవ తమ్మునికిని
తే. ధరణి వెన్నయ్య రెండవ తమ్మునికిని
సాటి యనవచ్చు నవ[2]విల సద్గుణముల

1. ధువాతన; 2. ఖిల.

నఖిల బంధుజనంబుల నాదరింప
సన్నుతి వహించు నాదెనసచివవరుఁడు. 49

వ. తదనుసంభవుండు, 50

సీ. జలజసంభవుఁడు ప్రజ్ఞావిశేషంబున
నిర్జరాచార్యుండు నీతి గరిమ
వాతాశనస్వామి వాచానిరూఢత
ధర్మనందనుఁడు సత్య[1]ప్రశస్తి
జహ్నుకన్యాసూతి సచ్చరిత్రంబున
శైలారి శంభుపూజనము కలిమి
జామదగ్న్యుఁడు ప్రతిజ్ఞాపాలనంబున
సౌమిత్రి భ్రాతృవత్సలత పేర్మి
తే. వంశవనవాటి చైత్రుఁ డన్వయపయోధి
చందురుఁడు గోత్రజలజకాసారతిగ్మ
కరుఁడు కులనందనారామకల్పతరువు
మహిత గుణశాలి యెఱ్ఱనామాత్యమౌళి. 51

గీ. ఎఱ్ఱనామాత్యునను జన్ముఁ డహిప
భూపణాంఘ్రిపంకేరుహభ్రమరాయమాణ
మానసుఁడు మానధనుఁ డసమాన గుణుఁడు
వీరభద్రుండు వితరణవిబుధతరువు. 52

ఉ. ఈ జగమెల్లనుం బొగడు నెప్పుడు నెన్నికచేసి నిత్య వి
భ్రాజిత నీతిమార్గబలభద్రుని జాతకృపాసముద్రునిం
బూజితరుద్రుని న్వివిధ పుష్పశరాసనకేళి భద్రుని
న్రాజితదానసంపదమరద్రుని జిల్లర వీరభద్రునిన్. 53

వ. ఇట్లు విశిష్ట మాతా పితృజన్యులు నభినంద్యసౌజన్యులు నగు వీరల
యందు, 54

1. ప్రసిద్ధి.

సీ. కూర్చుండు వయసున గూర్చుండ నేర్చెను
నను దినత్యాగసింహాసనమునఁ
గొంకక నడ నేర్చుకొనుచుండి నడనేర్చెఁ
దప్పక వేదోక్త ధర్మసరణి
మాటలాడఁగ నేర్చు నాటనుండియు
నేర్చెఁ బలుకంగ హితసత్యభాషణములు
చదువంగ వ్రాయంగ [1]సరవి నేర్చిన
నాఁడె నేర్చెను గార్యంబు నిర్వహింప
తే. వినయమున కాకరంబు వివేకమునకు
సీమ జన్మస్థలంబు దాక్షిణ్యమునకు
నాలవాలంబు విద్యలకరయ మూర్తి
మరుఁడు చిల్లర వెన్నయామాత్యవరుఁడు. 55

చ. అతఁడు వివాహమయ్యె సముదంచిత వైభవ మొప్పగాఁ; బతి
వ్రత యగు భైరమాంబయును వర్ణితనిర్మల వాగ్విలాస వా
కృతియగు సూరమంత్రియును భాగ్యఫలంబునఁ గన్నయన్నమన్
క్షితి ననసూయతోడ సరిసేయఁగ వచ్చు లసద్గుణాన్వితన్. 56

సీ. మాంగళ్య శృంగార మంగీకరించి
వర్తించుచో పార్వతీదేవిగుణము
నఖిలార్థులకును నిష్టార్థంబు లిచ్చి
సంభావించుచో రమాదేవి గుణము
హితమితోక్తుల చేత నెదిరికిఁ బ్రీతి
నొందించుచో భారతీదేవి గుణము
బరమ పాతివ్రత్య పరతమైఁ బతి
భక్తి గావించుచో శచీదేవి గుణము
తే. వరుస నే నోమునోచి యొప్పరసె గాక
సతుల కిట్టి గుణంబులు జగతిఁ గలవె

1. సరవడి నేర్చియు.

యనఁగ బొగడొందె సుతబంధుజనకదంబ
యాస్యజితపూర్ణశశిబింబ యన్నమాంబ. 57

ఉ. శ్రీవత్సాన్వయ సింధుజాతయగు లక్ష్మిం బ్రీతి నన్నాంబికం
దేవింగా వరియించి యా పరమసాధ్వీమౌళి రత్నంబుతో
శ్రీవత్సాంకుఁడు వోలె వెన్నన ఘనశ్రీమంతుఁడై సత్కృతు
ల్గావించె న్నిజబంధుమిత్రతతికిం గార్హస్థ్య మొప్పారగన్. 58

సీ. రక్షించె బంధు వర్గముఁ బ్రమోదంబంద
నర్థుల కిచ్చె నిష్టార్థ సమితి
గట్టించె ఘనతటాకంబు లంబుధులుగా
ధర్మకాననములు తఱుచు నిలిపె
స్థిరసమున్నతి సంప్రతిష్టించె నల్లిండ్లు
వరవిధానంబులు త్వర ఘటించె
నన్నసత్రము లెడరైనచో సాగించె
నోలిఁ జేయించె దేవోత్సవములు
తే. సప్తసంతానవతిఁ జేసె జలధినేమిఁ;
జేసె ధర్మంబు లెన్నేనిఁ జెలువు మిగుల
జేయుచున్నాఁడు సుకృతము లాయతముగ
మనుజ మాత్రుండె వెన్నయామాత్య మౌళి. 59

మ. వెలయం జిల్లర వెన్నయప్రభుఁడు దా వేదోక్తసంసిద్ధి వే
శలఁ బ్రాసాదపుఁ బంచవర్ణమునఁ గాలగ్రీవు బూజింపఁగా,
నలవాలై మఱి యొండెఱుంగవు తదీయ శ్రీనివాసంబునం
బలుకుం బంజరశారికా శుకములు స్పంచాక్షరీ మంత్రమున్. 60

చ. విడువక సోమవారములు వెన్నన సేయఁగ వత్సలత్వమే
ర్పడఁ దనుదానవచ్చి నిజభక్తముఖంబుల నారగింపఁగాఁ
దడఁబడి [1]పోక గంధముల తావులు పూనిన షడ్రసంబులం
గడుగఁబడెం గళస్థ విషకల్మష మర్ధశశాంక మౌళికిన్. 61

1. పోవ.

సీ. విలసితంబైన కావలి వెన్న మారాధ్య
మణివ_త్తయగు శైవమంత్ర శక్తి
సమధిక స్ఫూర్తితో శాశ్వతైశ్వర్య
బీజంబైన శంభుపూజా ఫలంబు
ప్రమాథాధిపతి గూర్చి భక్తితోఁ
గావించు సోమవారవ్రతసుకృతగరిమ
యన్నమాంబిక కంధరాంతరంబునఁ
జాల శోభిల్లు మంగళసూత్రలక్ష్మి
తే. సకలసౌభాగ్యములకును సాధనములుఁ,
గారణంబులుఁ, దగు బోధకములుఁ, గాఁగ
సచివ సంఘములోనఁ బ్రశస్తి గాంచె
విశ్వనుత కీర్తి చిల్లర వెన్న మంత్రి. 62

## షష్ఠ్యంతములు

క. ఏతాదృశ గుణగణ వి
ఖ్యాతునకునునిత్యఘన దయాన్వితునకున్
శ్రౌతపదానందునకును
బోతాంబాగర్భజలధిపూర్ణేందునకున్. 63

క. శరనిధి గాంభీర్యునకును
బరహితకార్యునకుఁ దుహినపర్వత కన్యా
వరపద పంకజపూజా
కరికాలునకును నిరస్తకలి కాలునకున్. 64

క. బాలామదనునకు రమా
హేలాసదనునకు బంధుహితజనరక్షా
శీలాయతమతికిని నిఖి
లేలాజన వినుతసురమహీధరధృతికిన్. 65

క. కౌండిన్యగోత్రునకు ను
ద్దండాహిత సచివమతిలతాదాత్రున కుం

బండిత చింతామణికిఁ
ప్రచండ వచోవిభవవిష్ణు శయ్యాఫణికిన్. 66

క. అన్నాంబికా సమంచిత
హృన్నళినాదిత్యునకు మహీదివిజానీ
కాన్నత్యునకును జిల్లర
వెన్నామాత్యునకు సత్కవిస్తుత్యునకున్. 67

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధియు నభీష్టఫల సిద్ధియుం గా నాశీర్వదించి నా యొనర్పం బూనిన శాకుంతల కావ్యకథాలతాలవాలం బగు పురీ లలామంబు, 68

సీ. పద్మరాగోపల ప్రాకార రుచిజాల
గండూషిత వ్యోమ మండలంబు
పాతాళజలఝరీ పర్యాప్తకల్లోల
సుకుమార పరిఘోపశోభితంబు
శక్రనీల శిలా విశాలగోపుర రోచి ర
సమయ జనిత మిథ్యాతమంబు
కనక సోపానసీఖచితముక్తాఫల
[1]రాజి విలగ్న తారాగణంబు
రాజసదనాగ్ర దేశవిరాజమాన
తోరణాలీన మణిగణ ద్యుతివితాన
విభవలక్ష్మీవిలంబిత విలసదింద్ర
చాపరుచిచాపలము హస్తినాపురంబు. 69

ఉ. ఆ పురి నున్నత స్ఫటిక హర్మ్య విభాపటలంబు నింగి ను
ద్దీపితమై చెలంగ నిది దివ్యతరంగిణి యొత్తివచ్చెఁ దా
నీపయి తోవ నంచు బయలీదుఁచుఁ గోయదలంతు రగ్రసం
స్థాపిత హేమకుంభములు తామరలంచు వియచ్చరాంగనల్. 70

1. రాజీవ లగ్న.

మ. దివిఁ బ్రాకారము ముట్టియుండగఁ దదుద్దేశంబునం గోటతోఁ
దవులుం జక్రమ నిక్కమంచుఁ బురిమీఁద న్నాక పార్శ్వంబులం
[1]గవనుంద్రోవ ననూరుయత్నమున రాఁగానౌటఁగాఁబోలుఁ జో
రవితే రుత్తరదక్షిణాయనములం బ్రాపించి దీపించుటల్. 71

శా. ప్రాసాదోపరి నాట్యశాలికలపైఁ బద్మాననల్ నృత్తనా
భ్యాస క్రీడ లొనర్పఁ [2]దద్భ్రమిరయవ్యాయామజంబైన ని
శ్వాసా మోదముఁ బ్రోదిసేయు నికట స్వర్వాహినీకూలకు
ల్యాసంవర్ధిత కేసర ప్రసవ మధ్వాసార సౌరభ్యముల్. 72

చ. మెలఁతుక లప్పురి న్నిడుద మేడలఁ గ్రీడలు సల్పుచుండి మిం
చులు జళిపించు కన్గవల సోరణగండ్లను జూడ నీడగుం
దెలుపును నల్పుఁగూడ నెడత్రెవ్వని చూపులఁ గైరవంబులుం
గలువలు దోరణావళుల గట్టిన యోజల రాజవీథులన్. 73

క. పురి కోట రత్న దీప్తుల
నరుణములై చుక్కలుండ నంగారకునిం
బరికించి యందుఁ దెలియక
కరము విచారింతు రెంత[3]కార్తాంతికులున్. 74

క. పరిఘజలంబులు మొదలను
సురనది నీరాడ పరికె చుట్టున నుండం
బురికోట లగ్గవట్టఁగ
నరిది వితర్కింప వాసవాదుల కైనన్. 75

చ. శ్రుతి గవుడొందినం గమల సూతికినైనను దీర్చి చెప్ప నే
రుతురు పురాణశాస్త్రములు ప్రొద్దున నిండ్లను గీరశారికా
తతుల పరీక్షలీవిని ముదంబును బొందుదు రింద్రు పట్టముం
గ్రతువులు వే యొనర్చినను గైకొన రప్పురి విప్రసత్తముల్. 76

1. గవుఞం, గవడుం; 2. దద్భ్రమర; 3. కార్తాంతికులన్.

ఉ. మందరగోత్ర ధీరులభిమానధనుల్పురభేది వచ్చినం
గ్రిందు పడంగ నేరని యరిందము లంచిత నిత్యభోగ సం
క్రందను లార్తరక్షణ పరాయణు లంబుజలోచనా శుక
స్యందను లర్థిలోక హరిచందను లా పురి రాజనందనుల్. 77

ఉ. వెచ్చము పెట్టు మన్నఁ బదివేలకు నుద్దరు లొల్ల రర్థము
ద్దెచ్చిన శేషు నౌదలల దివ్యమణుల్వెలెనన్న విల్వలన్
హెచ్చును గుందు నాడుకొన కిత్తురు లాభముఁ గోర కెన్నఁగా
నెచ్చటఁ గోటికిం బడగ యెత్తని వైశ్యులు గల్గ రప్పురిన్. 78

క. సంగరము లేక యుండిన
సింగంబులఁ బులుల సమద సింధురముల నే
కాంగిఁ దొడరి పడవైతురు
పొంగునఁ దమ కుబుసు పోక పురవీర భటుల్. 79

శా. పక్షంబు ల్మును శాలిహోత్రుఁడు శపింపం బోయినం బోవనీ
శిక్షానైపుణి నర్కతేజుల నధిక్షేపింపఁగాఁ జాలిన
ట్లక్షీణత్వర నింగినైన గతిసేయం జాలు నుచ్చైః శ్రవ
స్సాక్షాత్కారము లప్పురిం దురగముల్ ఝంపా కళాసంపదన్. 80

మ. గణనాతీతములై సురేంద్రుఁ డెఱక ల్ఖండింప వజ్రాయుధ
వ్రణరక్తంబన బిందువు ల్వొడమఁగా వర్తిల్లు జాతవ్యథా
క్వణనంబై పటుబృంహితంబులు సెలంగ న్సామ్యు మొందింపఁ బ
ట్టణమార్గంబునఁ బడ్డ పెద్ద నడగొండ ల్వోలె శుండాలముల్. 81

సీ. హరినీలరుచుల నీలాలకంబులు గావు
చిత్తజు మధుపశింజినులు గాని
క్రొన్నెల వంకలాగుల భ్రూలతలు గావు
విషమాస్త్రు తియ్యని విండ్లు గాని
యలసంబులైన వాలారుఁ జూపులు గావు
రతిరాజు మోహనాస్త్రములు గాని

బంధురస్థితిఁ బొల్చు కంధరంబులు గావు
కందర్పు విజయశంఖములు గాని
తే. నలినదళలోచనలు గారు నడువ నేర్చు
కంతు నవశస్త్రశాలలు గాని యనఁగ
నంగకంబుల సౌభాగ్య మతిశయిల్ల
వారసతు లొప్పుదురు పురవరమునందు. 82

చ. వెలకుఁ దగం బ్రసూనములు వేఁడుచు మార్వరికింప నెత్తులం
గలసి చిగుళ్ళువెట్టి యడకట్టిన క్రొవ్విరిమొల్ల పూవు టె
త్తులు దశనాధరద్యుతులఁ దోఁచిన బైకొని సరివిగా విటు
ల్విలువగ వారిచిత్తములు విల్తురు తత్పురిపుష్పలావికల్. 83

మ. సరసుల్ చొచ్చి సరోజకోటరకుటీసంవర్తి కాచారుకే
సర గుచ్ఛంబులు గ్రొచ్చి బాహ్యవనపుష్పశ్రేణి నిర్యన్మధూ
త్కరముం దెచ్చి తదీయసౌరభము లుద్గారింపుచు న్సంతత
స్మరసంజీవనమై చరించు గలయ న్మందానిలుం డప్పురిన్. 84

గీ. శశవిషాణంబు గగనపుష్పంబునైన
వణిజు లిండులలో విలువంగ గలవు
హంసగమనల మధ్యంబునందు దక్క
లేమి యేవస్తువులయందు లేదు పురిని. 85

వ. ఇత్తెఱంగున సమస్తవస్తువిస్తృతి బ్రస్తుతి పహించి పయఃపారా వారంబు ననుకరించుచు సర్వతోముఖదర్శనీయంబును, సదాగతి సంచారసమంచితబహులహరీమనోహరంబును, సంతతానంతభోగ లీలాలాలితపురుషోత్తమోపేతంబును సమున్నతలక్ష్మీజనకంబునునై యమరావతియునుంబోలె శతమఖపవిత్రాయమానంబును, నలకా పురంబునుంబోలెఁ బుణ్యజనాకీర్ణంబును, మధురాపురంబునుబోలె నుగ్ర సేనాభిరక్షితంబును నంతరిక్షపదంబునుంబోలె ననువర్తితమిత్రరాజ

సంబాధంబును, బరమేశ్వరు వామభాగంబునుబోలె సర్వమంగళాలంకృతం
బును, మేరుమహీధరంబునుంబోలెఁ గల్యాణమహిమాస్పదంబును,
మహాకవిప్రబంధంబునుంబోలె నుత్తమశ్లోకబంధురంబును, రత్నాకరం
బయ్యును గుట్టిమప్రదేశసుగమంబునై, ముక్తామయంబయ్యును
భూరిఘయోపేతంబై, ప్రకటితపర్జన్యవైభవోదారంబయ్యును జిర
ప్రభాభాసురంబై, మంగళాచార మహితంబయ్యును సౌమ్యపరిచారికా
ధిష్ఠితంబై, యారూఢపాతిత్యంబు క్రీడాకందుకంబులయందును, బరిచిత
స్నేహనాశంబు రత్నదీపంబులయందును, నీరసత్వంబు సముద్రంబుల
యందును ద్రాసదోషంబు పద్మరాగాదిమణులయందును, యతిని
బంధంబు పద్యంబులయందును, దారిద్ర్యంబు విద్రుమాధరామధ్యంబుల
యందును, బదచ్ఛేదంబు వాక్యంబులయందునుగాని దనయందుఁ గలుగ
దన నొప్పు నప్పురంబు కప్పురంపు, దాళువాలించు సన్నసున్నంబుల
చేత లేత వెన్నెలల నెమ్మించు గ్రొమ్మించులుం గల మేడలును, విరా
జితంబులగు వాడలును, రేయెండకు మాఱుమందు పదాఱువన్నె
బంగారు ముద్దవరుస నద్దుకొనవైచి యద్దంబులమీఁదువలె నుండ నున్నఁ
జేసి విన్ననువున మెఱుంగువెట్టి నం ద్రొక్కినజిక్కంజీరువారుచుం
దళతళ వెలుంగు వేదులును, విలసితంబులగు వీధులును, బూర్వంబునం
బార్వతి యొఱింగిన తెఱం గగ్గిరికన్యచేతంబాణపుత్రి నేర్చిన రీతి నా
రక్షోరాజిరాజనందనచేత ద్వారవతీగోపికాపికవాణుభ్యసించినబుద్ధి
శుద్ధదేశివృత్తంబులవిశేషంబులు భిత్తిభాగంబులం జిత్తరువులం జిత్త
రంజకంబు లగుచుఁ బ్రత్యక్షభంగి నంగీకరించు విలాసలీలలను విలసిల్లు
నాట్యశాలలును, నొక్కవీక నాకసం బెక్క విశ్వకర్మ నిర్మించిన తావు
రంబులఁ బోలుచు గోపురంబుల మీఁదికిఁ రాఁబో సుసరంబులుగాఁ గట్టినం
గారుకొనుచు నేచిన మేచకద్యుతులు పుక్కిలించు శక్రోపలసోపా
నంబులును, సాదనంబు లగు ప్రాసాదంబులును. నుదంచచ్చంచరీక చక్ర
హంసక్రౌంచజలపక్షికుల కలకలంబులం గోలకోల మను కొలంకుల
నలంకరించు పంకరుహకుముద కువలయ కల్హారషండంబులును, దండతం
డంబులుగ తావులం గదంబించు బావులును, జిత్తంబులుబ్బ గబ్బితనంబున
విత్తంబు లొడ్డి నెత్తంబులాడి యోడినధనంబు లాడినం గాని పెట్టమను

దిట్ట మాటలం బుట్టిన జగడంబులు విగడంబులై యుద్ధపత్తంబు లగు పంతంబులం గుంతంబులం గొనివచ్చు జూదరిఘట్టంబుల హెచ్చగు రచ్చ కొట్టంబులును, గలిగి వినోదంబులకు నాకరంబును, విశ్రామంబులకు సీమయు, విక్రమంబునకు నెలవును, విజయంబునకుం దానకంబును, విద్యలకు నుపాధ్యాయయు, వితరణంబులకు సదనంబును, విభవంబులకు ప్రభవస్థానంబును, విలసనంబులకు వినిమయంబునునైన యప్పురి కధీశ్వరుండు. 86

సీ. విశ్వసన్నుతశాశ్వతైశ్వర్యపర్యాయ
కుటిలకుండలిరాజకుండలుండు
దిగిభశుండాకాండదీర్ఘబాహాదండ
మానితాఖిలమహీమండలుండు
జనసన్నుతానన్యసామ్రాజ్యవైభవ
శ్లాఘాకలితపాకశాసనుండు
కులశిలోచ్చయసానుకోణస్థలన్యస్త
శస్తవిక్రమజయశాసనుండు

తే. భాసమానమనీషాంబుజాసనుండు
సకలదేశావనీపాలమకుటనూత్న
రత్నరారజ్యదంఘ్రినీరజయుగుండు
శంబరారాతినిభుఁడు దుష్యంతవిభుఁడు. 87

మ. రజనీనాథకులావతంసుఁ డసిధారాదారితారాతిరా
డ్గజకుంభవ్రణమార్గనిర్గళితముక్తారక్తహారుండు స
ద్ద్విజసంతర్పణకేళిలోలుఁ డఖిలద్వీపావనీపాలది
గ్విజయాన్వితుఁడు పాపభీతుఁడు మహావీరుం డుదారుం డిలన్. 88

మ. ప్రజలెల్లం జయవెట్ట ధర్మమహిమం బాలించె వీరారి భూ
భుజుల న్వ్రేల్మిలం జేసి యధ్వరములం బ్రోచెం బదాంభోజన
మ్రజనాధీశులఁ గాచి నిల్పె నిజసామ్రాజ్యంబుల న్సర్వసా
ధుజనస్తుత్యుఁడు సత్యకీర్తి యగు నాదుష్యంతుఁ డత్యున్నతిన్. 89

సీ. నిచ్చెనఁ జేసె దోర్నిసితాసి కేరాజు
దివి నేఁగు సమదప్రృథ్వీభుజులకుఁ
గల్పవృక్షముఁ జేసెఁ గరకాండ మేరాజు
భూచక్రమునఁ గల యాచకులకు
గేహాబ్జములు చేసెఁ గ్రేఁగన్ను లేరాజు
చెలఁగి సంక్రీడింప సింధుసుతకుఁ
బూఁటకాపుగఁ జేసె భుజశక్తి నేరాజు
ఫణిరాజు మోచు భూభరముఁ దీర్ప
తే. ననుచు వర్ణింపఁ దగదె శీతాంశువంశ
రాజహంసంబు దానధారాప్రవాహ
జలపరీక్షాళితాఖిలకలుషనికరు
సంచితాక్రాంతకృపుని దుష్యంతనృపుని. 90

ఉ. ఆజననాథయూథమణియం దుదయంబును బొందె దిగ్జయ
వ్యాజమునం బ్రతాపనలినాప్తుఁడు కీర్తివిధుండు రాఁ దదు
ద్వేజితు లౌటఁగాదె పరివేషమిషంబున నాత్మగుప్తికై
యోజ నమర్చికొండ్రు రవియుం గమలారియు నింగి వప్రముల్. 91

సీ. ఆలానదండంబు హేలాహవాహూత రిపు
రాజధరణీకరేణువునకు
మానదండము మహామనుజేశగర్వాబ్ధి
గంభీరతా పరీక్షావిధికిని
నాళదండము సమున్నతజయశ్రీ
వధూసముచితక్రీడాబ్జసౌధమునకు
నాధారదండంబు హరిణాంకకులకు
భృజ్జనకుశ్రీకీర్తిధ్వజంబునకును
తే. యష్టిదండంబు వృద్ధశేషాహిపతికి
మూలదండంబు సైన్యసముద్రతతికి

కాలదండంబు శాత్రవక్ష్మాపగతికి
బాహుదండంబుఁ జెప్పఁ దత్పార్థివునకు. 92

చ. జగమున రెండు తత్త్వములు శాస్త్రులు చెప్పుదు రందులోపలన్
జగడము కాని యొక్కరయినం బొడఁగానరు వానిరెంటిలో
సగుణముఁబట్టి నిర్గుణము శత్రువధూగళసీమలం జను
ల్పొగడఁగ జూపు నవ్విభుఁ డపూర్వముగా ఘనశాస్త్రపద్ధతిన్. 93

ఉ. పాయక శిష్టలోకపరిపాలనముం బహుదుష్టశిక్షయుం
జేయుచు రాజ్యమవ్విభుఁడు సేయగఁ దారు నిజప్రయోజనం
బేయెడ లేకయున్న ధరియింతు రుదంచితలాంఛనార్థమై
తోయజనాభుఁడు న్రవిసుతుండు సుదర్శనకాలదండముల్. 94

సీ. చెఱుపనేరఁడు విశ్వసించి యుండినవాని
నభిలషింపఁగనేరఁ డన్యవనిత
నిందింపనేరఁడు నీచశత్రుగణంబు
బొంకనేరఁడు హాస్యమునకుఁ బలికి
విడువనేరఁడు చెడ్డవిటునిఁ జేపట్టినఁ
గడపనేరం డర్థిగణమువాంఛ
నడుగువెట్టఁగనేరఁ డపశయంబగుత్రోవఁ
జనఁగనేరం డార్తజనము విడిచి
యైదు పదిసేయ నేరఁ డాహవముఖమున
గ్రించునందును నేరఁడు గీ డొనర్ప
ననుచు నేరము లెన్నుదు రవనిజనులు
విపులయశుఁడైన దుష్యంతవిభునివలన. 95

వ. ఆరాజపరమేశ్వరుం డొక్కనాఁడు శుకతుండరోచిరుద్దామవిద్రుమ స్తంభసంభారసమున్నతంబును, హాటకమణివిటంకాలంకారవిశ్రుత నిశ్శ్రేణికాపదగమ్యమానచంద్రశాలోపకంఠంబును, గంధేకాలకంఠ మేచక

రుచి కచాకచిక్రీడాచతురసితేతరపట్టపటలప్రాలంబముక్తాఫలవితానతారకితవియత్సీమంబును, నత్యంతసమున్నతిమదుపరినిశాతశాతమన్యవశిలాశలాకానీలనీలచ్ఛర్దివిలగ్నవినూత్నరత్నకేసరస్తబకనిబిడబిసకనక కుముదారవిందసౌగంధికసందర్శితకపటగగనపుష్పంబును, నభిరామదూర్వాదళదామకోమలప్రభాపటలగర్వసర్వస్వపశ్యతోహార హారిదుపలభిత్తికాంతరజితరూపవాతాయనంబును,వళక్షకిరణచ్ఛవిచ్ఛటావిస్ఫుటస్ఫటికపాషాణఫలకసోపానమార్గనిర్గమప్రవేశద్వారవిద్యోతమానవిపులతపనీయకవాటాలంకృతంబును, నభ్రంకషశిరోభవనశిఖరస్థాపితశాతకుంభకుంభకాంతిగండూషితనభోమండలంబును,[1]రయ్యంతరాస్తీర్ణవిచిత్రరత్నకుథాసనవిన్యాసంబుల శోభిల్లు సభాసౌధంబున నమూల్యరత్నకీలనజాజ్వల్యమానకల్యాణభద్రపీఠాంతరంబున నాసీనుండై యొక్కమంజువాణి వింజామరంబును,నొక్క [2]జోటి పీటికాపేటికయు, నొక్కబాల యాలవట్టంబును, నొక్క కరటిగమన [3]సురటియు, నొక్క తేఁజిగురాకుబోఁడి కాళంజియు, నొక్కచందనగంధి గందవొడిబరిణయు, నొక్కపుండరీకనయన యగరుధూపధూమకరండంబును, నొక్కకన్నె పన్నీరుతోడి కప్పురంపుగిండియు, నొక్కశృంగాలక బంగారు సంగెడయు ధరియించి డగ్గఱి కొలిచియుండఁ బాండ్యపల్లవపాణి యాటలాడ ఘోటకరహాటకళింగాంగవంగబంగాళచోళనేపాళకాదిభూపాలకకుమారవర్గంబుం దగిన నెలవులం బలసి సేవింప హితపురోహితామాత్యబంధుమిత్రభృత్యపాఠకపీఠమర్దవిదూషకాదులు భజింప సుధర్మాంతరంబున నోలగంబైన దేవేంద్రుడునుం బోలె సాంద్రవైభవంబునం గొలువుకూర్చున్న యవసరంబున, 96

ఉ. ఝుంఝురుపల్లవెంట్రుకల జొంపములుం గల మస్తకంబులుం
గెంజిగురాకుఁ గెంపుఁ దులకించెడు వక్త్రువకన్నులుం జర
త్కుంజరచర్మపట్టములకు న్సరివచ్చు బెరళ్ల మేనులు
న్మంజులు గొల్వఁగొందఱు సముద్ధతి వచ్చి పుళిందవల్లభుల్. 97

---

1. రమ్యాంత; 2. బోటి; 3. సురంటియు.

సీ. కాననేఱువుల ముక్తములైన ముత్యాలు,
ముదిరిపండిన మంచి వెదురు బ్రాలు,
దినములోఁ [1]గ్రొత్తయొత్తిన కట్టుజవ్వాది,
ముక్కలు మురియని [2]మొరళిపప్పుఁ,
చంద్రికారుచిఁ బోల్చు చమరవాలంబులుఁ,
బొందుగాఁ గాఁచిన [3]పూతివడువు,
అలఁతి దంతంపుఁగామల పీలిసురటులు,
సోదించి వడిచిన జుంటితేనె,
తే. కమ్మఁబిల్లులపిల్లలు, కారుకోళ్ళు,
కన్నుదెఱవని కస్తురిగమి శిశువులు,
పులులకూనలు, భల్లూకపోతకములు
నాదిగాఁ దెచ్చి పతి కుపాయనము లిచ్చి. 98

వ. ప్రణామంబు లొనర్చి కేలుదోయులు ఫాలంబులం జేర్చుకొని వినయ వినమితస్కంధులై క్రిందుచూపుల నిల్లుతారల వారం గనుంగొను చున్న వారల నవలోకించి చిత్తంబు మృగయాయత్తం బగుటయు నృపోత్తముం డిట్లనియె, 99

క. దలముగఁ గ్రొవ్విన మృగములు
గలిగి సమీపమున నేఱుఁ గాలువ[4]యే దేఁ
గలిగి తఱచైన తరువులు
గలిగిన పేరడవి యెచటఁ గలదు గణింపన్. 100

క. నావుడు వారలు విభుతో
దేవర వేటాడవలసితే విచ్చేయం

1. యొత్తిన; 2. మొకరిపప్పు; 3. పూతి వఱవు; 4. యొండే.

గావలయును యమునాతటి
నీవరసీమంతిశాపనీవసమునకున్. 101

క. రోమము వెదకిన నెత్తురు
నామము లేఁదొడలు చమురునుం జేసినయ
ట్లాము గవిసి యుండును నా నా
[1]ముఖ యూధంబు లవ్వనంబునఁ గలయన్. 102

గీ. ఊళ్ళకూళ్ళు సమీపమై యునికిఁ జేసి
లేశమైనను గొరనాఁగ లేమిఁ జేసి
యచటి కొర్నెలఁ బసికి మేయంగఁ గలిమి
నగరి కీలార మున్నది నరవరేణ్య. 103

ఉ. జల్లెడపాటు వడ్డయవసంబులు మేసి సమీపసీమలం
జల్లని నీరు ద్రావి సుఖసంగతి దాపులు గ్రేవు లాఁగఁగాఁ
బొల్లగఁ జేరి గోవృషభము ల్మది కింపులు సేయ నుండియుం
బల్లిక బెబ్బులు ల్దిరుగ సాధ్వస మందును మందధేనువుల్. 104

ఉ. సాయకపుంఖితంబులగు చాపములం ధరియించి యుక్కునం
బాయక రేయునుం బగలుఁ బాలెము వెట్టి మెకంబుఁ గన్నచో
నేయుచుఁ బొంచి రాఁ దెలిపియాక చరించుచునున్న మందక
ల్యాయతవర్ణసత్వనినదావళి హావళి మాన దెప్పుడున్. 105

గీ. కోలఁ బదినైదు గుదిగ్రుచ్చి కొనఁగ నేయ
వచ్చు మృగముల నెమకంగవలవ దచట
పసికి నయ్యేడు కీడు వాపంగఁగలదు
వేడుకకు నిమ్ముగాఁగ వేఁటాడఁగలదు. 106

వ. ఆవల దేవరచిత్తంబు కొలఁది యనిన గోరక్షణంబుకొఱకును, దుష్టమృగ శిక్షణంబువలన సుకృతంబుగా మృగయాసౌఖ్యంబు సిద్ధించె దేవర

1. మృగయూధంబు.

ప్రసాదంబు జాదులుంబలె నయ్యోనని యమాత్యుల యనుమతంబునఁ గొలువు విచ్చి యందఱ సముచితప్రకారంబుల వీడుకొలిపి వేత్రహస్తులం బిలిపించి పట్టణంబున మృగయావిహారసన్నాహంబునకుం జాటించిన, 107

సీ. పులిమల్లఁ డడవిపోతులరాజు గరుడుండు
గాలివేగంబు పందేలపసిఁడి
విష్ణుప్రసాదంబు వేడిగుండులు పరి
పచ్చిమిర్యము వెట్టిపుచ్చకాయ
వేఁటమాణిక్యంబు విరవాది మెడబల్మి
పెట్టుఁగాఁడు వకారి పిడుగుతునుక
జిగురుండు చిత్రాంగి శ్రీరాముబాణంబు
పులియందు కస్తూరి బొడ్డుమల్లె
తే. యనఁగ మఱియుఁ బెక్కుతోయముల పేళ్ళ
దారకులు దేరవచ్చె నుద్దండవృత్తి
వేఁటకుక్కలు మృగరాజవిగ్రహములు
వటుకనాథుని వాహ్యాళివాహనములు. 108

మ. శబరుల్పట్టెడత్రాళ్ళఁ బట్టి తిగువం జండోద్ధతిం గిట్టి వ
ట్టి బయల్ ద్రవ్వుచు విద్వరాహముల గుండె ల్వ్రయ్య నాకాశముం
గబళింపఁ జనునోజ మోర లెగయంగా నెత్తి గర్జిల్లఁగాఁ
బ్రబలెం గుర్కురకంఠనాళకుహరీభాభామహారావముల్. 109

గీ. మృగయు లంతటఁ దెచ్చిరి లగుడుగిడ్డుఁ
జాలె జలకట్టె కణుజు వేసడము బైరి
కురుజు లోరణమను డేగ కొలము సాళు
వములఁ బిలుపుకు వేఁటకు వచ్చువాని. 110

సీ. బంగారు మెరనడి పల్లనంబులతోడఁ
గెంబట్టు కీలు పక్కెరలతోడ

ముఖసమర్పితహాటకఖలీనములతోడఁ
గాంచనగ్రైవేయకములతోడ
సమకట్టి ముడిచిన చామరంబులతోడఁ
దాఁపఁబెట్టిన యడిదములతోడ
కనకఘంటలయురుగజ్జెపేరులతోడఁ
గర్ణకీలితదీర్ఘకళలతోడఁ
తే. జిత్రమున వ్రాయఁగారాని చెలువుతోడ
నొప్పి యుచ్చైశ్శ్రవముతోడి యుద్దులనఁగ
వాహకులు దేఱవచ్చె దుర్వారలీల
వసుమతీనాయకుని పూజవారువములు. 111

సీ. [1]వలనంబు పుట్టించి వంకంబు లొలయించి
డిల్లాయి ప్రకటించి రేవ చూపి
వరసంబు నొందించి [2]పల్లంబు కలిపెంచి
నిగుడంబు సమకొల్పి నెఱను నెఱపి
లవిగూర్చి లవిదేర్చి లాగిచ్చి కుండాల
ముల నోజవట్టించి ఖలువు దెచ్చి
లవణి సంకోచంబులకుఁ దెచ్చి హవణితో
రససిద్ధి వడయించి రాగెలందు
తే. నాఱుతానకములను గృత్యమ్ము లేదు
నరువదే నాసనంబుల నెఱిగి హరుఁల
నెక్కు రసికులు వచ్చిరి హెచ్చునగరి
రాగరవుతులు సమరానురాగమతులు. 112

సీ. జడలల్లి ముడిచి పాగడఁ జొళ్ళెములు
దీర్చి తలముళ్లు బలువుగా నెలవుకొల్పి

1. వరసంబు; 2. వల్లంబు.

మృగము చేరఁగవచ్చు మొగసిరి చూర్ణంపు
దిలకంబు లలికసీమల ఘటించి
వాకట్టు వదనికె చేకట్టు మండలు
కరకాండ మధ్యభాగములు దొడగి
కుఱుచగాఁ గట్టిన కరక దట్టీ దిండు
నంతరమ్మునఁ బిడియాలు దోపి
తే. పందిపోట్లును దడవిండ్లుఁ బాఱవాతి
యమ్ములును జిల్లకోలలు నడిదములును
వలతి యీటెలు ధరియించి వచ్చి రంగ
రక్షకులు లేతతరముల ప్రాంతవారు. 113

క. అరిగెలు నిష్ఠురబాహాపరిఘులు
ధరియించి నగరిపాలురు నేతెం
చిరి శిఖిపటు జిహ్వాసమ
కరవాలద్యుతులు గగనకాలిమ గడుగన్. 114

శా. సింగంపుంబొది వచ్చు చందమున వచ్చెం బోయకాలార యు
త్తుంగశ్యామలదేహసంజనితకాంతు ల్వ్యాపలక్ష్మీనవా
పాంగచ్ఛాయలతోడఁ బెల్లొదవి క్రమ్మాయ [1]న్వేల్లదుద్యద్భుజా
సంగత్వంగదభంగభంగురధనుర్జ్యావల్లరీఝల్లరుల్. 115

గీ. ఉరులు జిగురుగండె ద్రెత్తలును బోనులు
వారువాఱెనలును వసులు గనులు
[2]మిళ్ళువలలు పేట్లు గోళ్ళు దీమంబులు
నాదిగాగ దెచ్చి రాటవికులు. 116

వ. మఱియును మూలభృత్యబలంబును, సామంత[3]కుమారవర్గంబును నర్హ
ప్రకారంబుల సముచితాలంకారులు, సాయుధులు, సవాహనులునై చను

1. న్వ్యలదుద్య; 2. i. మళ్లు, ii. వేళ్లు; 3. మంత్రివర్గంబు.

దెంచి రప్పు డప్పుడమిఱేఁడు వేఁటకుం దగిన శృంగారం బంగీకరించి
గతివిజితమరుత్కురంగంబు లగు తురంగంబులం బూనిన యరదం బెక్కి
యిరువంకల నుమ్ముంగలిం బింగలిం జతురంగబలంబులు గొలువ శంఖకాహళ
వేణువీణామృదంగంబులు చెలంగ నెడలేక సందడిం గ్రందుకొన మంద
వైభవంబునం బురందరవైభవుండు పురంబు వెడలి వృద్ధహాయంబు మీఁద
విదూషకుం డగు మాండవ్యుండు దోడరాఁ గొంత దవ్వరిగి యొక్క
చిక్కణప్రదేశంబున రథవేగంబుఁ దెలియు వేడుక సారథింజూచి నిమ్నోన్న
తంబులుగాక యిచ్చట సమతలంబై యున్నయది నీహాయంబుల రయంబుఁ
జూపు మనవుడు నతండు యుగ్యంబుల పగ్గంబులు వదల్చి యదల్చిన, 117

సీ. కనుదృష్టి నెయ్యది మినుమిను క్కనుచుండు
ఘనత వ్రేల్మిడిలోనఁ గానఁ బడఁగ
నెడ ద్రెవ్వియుండు నెయ్యది యేని
నదికూడ నదికిన చందాన నన్వయింప
నేయది విలువంకయై యుండుఁ బదమున
నది సమరేకతో నందమంద
దూరాన నెయ్యది తోఁచు నాలోకింప
నది పార్శ్వమున లేక యపులఁ జనఁగ
తే. శ్రవణములు నిక్క నిష్కంపచామరాగ్ర
ములనునిర్వ్యాత పూర్వాంగములఁ దనర్చి
ఘనఖురోద్ధూతరేణువు గడవఁ బాజి
నిగిడె[1]భువి తేరిహాయములు మృగజయములు. 118

వ. అయ్యవసరంబున. 119

గీ. కుక్క లలయక యుండంగఁ గొంచువచ్చు,
మంచి యొక కొంత చిక్కె నాస్యందనంబు
గూడి రారాక వడి చెడి కొంత చిక్కె,
ననిలగతి నేగు రథ మెవ్వఁ డంట గలఁడు. 120

1. విభు.

క. సారథిఁ గనుఁగొని యపు డా
ఙ్మారమణుఁడు రథము దవ్వుగా వచ్చెఁ బరీ
వారము గూడదు రా నె
వ్వారలు గల రిచట నిలువవలయు ననుటయున్. 121

వ. అతండును, నృపాలకానుశాసనంబునం దేజుల నేఁగనీక వాగెలు గుదియించి వీపుఁలు నిమిరి నిలుపుటయు సకల జనంబులుం గూడుకొని యుల్లసితయానంబున మెల్లనఁ జని మంద చేరంజను నయ్యవసరంబున విజయకాహాళారావంబు లాలకించి బిరుదధ్వజవితానంబు లవలోకించియు దమ రాజు రాకఁ దెలసి నిసర్గభీరువులగు నాభీరువులు భీతచేతస్కులై నవీనంబగు హయ్యంగవీనంబు గానుక తెచ్చి ప్రణామంబు లాచరించి కరంబులు శిరంబునం బెట్టుకొని తిర్యగాలోలంబు లగు చూపులం గద్గద కంఠ లగుచు ప్రస్ఖలితవినయవాక్యంబుల నిట్లని విన్నవించిరి. 122

సీ. దూరంబువచ్చిన [1]వారిట సైన్యంబు
ప్రజలెల్లఁ జాల దూపట్టినారు
నీర్వట్టుగొని దీర్ఘనిశ్వాసములతోడ
వరరథ్యములు ప్రేలవైచెఁ జెవులు
వేఁటకుక్కలు డస్సి వివృతాస్యముల
నిల్చి వగరించుచున్నవి దగలుడొట్టి
శిథిలపక్షముల నతియుగంబులు నోర్మెడ్చి
శ్రమనొందె డేగలు సాళువములు.

తే. తిమురు మధ్యాహ్న మయ్యెను దేవ
యిచట నేడు[2]కాలాగి మామందపాడి చూచి
గోరసముఁ బాయసంబులు నారగించి
నిగ్రహంబైన మమ్ము మన్నింపవలయు. 123

గీ. అనుచు విన్నపమొనరించు నవసరమున
హయము డిగ్గి మాండవ్యుఁడు రయముతోడ

1. వారౌట; 2. కాల్మాగి.

నవనిపాలుని రథము డాయింగ వచ్చి,
చేయి పుడిసిరి వట్టి యాశీర్వదించి. 124

ఉ. ఒల్లమిచేసి వీరలకు నుత్తర మీకు నృపాల పెర్వులుం
జల్లలు నమ్ముకొన్నయవి చాలఁగ నున్నవి చిత్రధాన్యము
ల్కొల్లలు త్రవ్వితండములు కుప్పలు నేతులు పాలువెన్నలుం
గొల్లల కేమి మూఁడె మనకు న్మఱి కూడొక పూట వెట్టినన్. 125

క. కానిక కప్పము వెట్టరు
మానము దప్పఁ దిని క్రొవ్వి మనుబోతుల సం
తానమువలె నున్నా రీకాననమున
రాచసొమ్ము గతముగఁ గొనుచున్. 126

వ. అది యట్లుండె నింక నొక్క విన్నపం బవధరింపుము. 127

గీ. వేఁటపోయెడువారలు విప్రుమాట
కలుగుదురు పొడప్రువ్వున గలిగినట్లు
విన్నవింపక నాలుక మిన్నకుండ దేచి
నీమేలు గోరెదు హితుఁడగాన. 128

క. పాయసముం గలలో భూ
నాయక భోజనము సేయు నరులకు నెంతే
శ్రేయస్కరమని స్వప్నా
ధ్యాయంబునఁ జెప్ప విందు దజ్జ్ఞులచేతన్. 129

గీ. భోజనము సేయు మనఁగఁ దాంబూలగంధ
పుష్పములు గొమ్మనఁగఁ ద్రోసిపోవఁ జనదు
ఇంపుతోడుత నంగీకరింపవలయుఁ
గార్యఫలసిద్ధి కవి యాదికారణములు. 130

క. ఇలు వెడలి మానవుఁడు తన
తలఁచిన తావునకుఁ జేరుఁదాఁకను నేయం
కిలి లేక యెక్క తీరుపు
నలయును శాకునికవరులవచనవిధమునన్. 131

సీ. హర్మ్యంబు వెడల వాయసము చేరువ
దీర్చె వృషభం బెదుర ఱంకెవేసి నిలిచె
వాడలో శునకంబు వచ్చెను దక్షిణం
బుదపూర్ణకుంభంబు లెదురుపడియె
గవని వెలుపల బెరికయుఁ బోతు వలగొనె
వలయెక్కసూపెఁ జేవలతిఁ జెమరు
పరువు నేలను వచ్చెఁ బాల [1]పయ్యేరవంక
కుడినుండి యెడమకు నడిచె నక్క
తే. నీవు వేఁటకు విచ్చేయునెడ నృపాల
పంచి పెండ్లికి నగు శకునంబు లయ్యె
నేడు గొల్లలమాట మన్నించి నిలిచి
మృగయ కరుగుట మిక్కిలి మేలు చేపు. 132

క. నా విష్ణుః పృథివీపతి
నా విష్ణుం డనఁగ నీవ నరవర దైవం
బీ వారగింప కుండిన
నీ వల్లవులకు శుభంబు లేలా కలుగున్. 133

వ. వీరలం గృతార్థులం జేయం గృపగలదేని యారగింపవలయు నది యెన్ని దినంబులం గోలెఁ గన్నయదిలేదు దండుగ దర్శనంబులు గొనం దలం పయ్యేనేని ముందఱఁ జాగి విచ్చేయు మనిన గొల్ల లుల్లంబునం దల్లడిల్లి యీ బ్రాహ్మణుండు పలికినది యథార్థంబు. మా యర్థప్రాణంబులు నీసొమ్ము. వలసినట్లు చేసికొమ్మనిన మాండవ్య ద్రిమ్మరి మాటలకు [2]దిగులు సొచ్చిన గోపాలకుల భూపాలకుండు మృదువచనంబుల నుపచ

1, పయ్యెదవంక; 2. సొబగు విచ్చిన.

రించి సైన్యంబు సముచితక్రమంబుల విడియించి కనకకుంభకలితంబై
కనుపట్టు గొల్లెనలం గృతావాసుండై. 134

సీ. వెనుపారు కడియంపుఁ బిండివంటలతోడఁ
గమ్మని సద్యోఘృతమ్ముతోడఁ
గనరువోకుండ గాచిన యానవాలతోఁ
గడిసేయవచ్చు మీఁగడలతోడఁ
బెక్కులాగులఁ గదంబించు జున్నులతోడఁ
బేరి దాఁకొన్న క్రొంబెరుగుతోడఁ
బిడిచినఁ జమురు గాఱెడు మాంసములతోడఁ
దేట తియ్యని జుంటితేనెతోడఁ
తే. బాయసాహారములతోడ ³బ్రేవేయు లొసఁగ
నఖిలసేనాప్రజలతోడ నారగించి
సంతసంబంది పటకుటీరాంతరమున
జనవిభుండు భజించె నిశాసుఖంబు. 135

శా. కౌండిన్యాన్వయసింధుచంద్ర విమతక్ష్మాపాలకామాత్యవే
దండానీకమృగేంద్ర చంద్రవదనాతారుణ్యకందర్ప శ్రీ
ఖండక్షోదవిపాండునిర్మలయశోగంగాజలక్షాళితా
జాండాఘోరకలంక శంకరనివాసాహార్యధైర్యోన్నతా. 136

క. సురసురభికల్పభూరుహ
తరణిజశిఖిఖచరదేవతామణిరజనీ
కరకాలబలాహకసఖ
కరపద్మ సమస్తవిబుధకవినుతసద్మా. 137

మా. జనహితసుచరిత్రా సజ్జనాబ్జాతమిత్రా, జనితవృషపవిత్రా, సత్కవిస్తోత్రపాత్రా వనరుహదళనేత్రా వంశమాకందచైత్రా, యనుపమశుభగాత్రా యన్నమాంబాకళత్రా. 138

3. ప్రమద మెసగ.

ప్రథమాశ్వాసము

## గ ద్య ము

ఇది శ్రీభారతీతీర్థగురుశ్రీచరణకరుణాలబ్ధసిద్ధసారస్వత పవిత్ర
గాదయామాత్యపుత్ర యారాధితామరవీరభద్ర పిల్లలమఱ్ఱి
పినవీరభద్ర ప్రణీతంబయిన శాకుంతల శృంగార
కావ్యమునందు ప్రథమాశ్వాసము.

# శృంగార శాకుంతలము

## ద్వితీయాశ్వాసము

శ్రీసదన సదారాధిత
వాసుకికేయూర వంశవర్ధన వినయా
వాస పయోజాసనక
న్యాసఖకీర్తి ప్రసన్న నాగయవెన్నా ! 1

వ. ఇత్తెఱంగున దుష్యంతమహీకాంతుండు సంతోషంబున ఘోషంబున నా రాత్రి నిలిచి మఱునాఁడు సూర్యోదయం బగుటయుఁ గల్యకరణీయం బులుం దీర్చి లావరుల నేర్చి కదలి. 2

చ. మెకములఁ బట్టఁ గట్టి వలమీఁటి చనం జననీక యాఁగి [1]తెం
కికిఁ జనఁజేయ బోనునకుఁ గీల్కొలుపం బయి వచ్చెనేని ద
ప్పక పొడువంగ నేర్పు ఘనబాహుబలంబును గల్గి [2]నేటు వేఁ
టకు నెఱవాదులైన సుభటప్రకరంబులు మ్రోల నేఁగఁగన్. 3

క. ముదమును మదమును మనమున
గుదిగొన గోష్ఠంబుఁ గడచి కొండొకచని య
ల్లదె యిదె కాంతారంబన,
నెదురం జూపట్టుదాఁక నేఁగగ నచటన్. 4

సీ. ఛాయా మృగంబుల ద్రేయ గర్జిల్లఁ బ్ర
చండమై పొడము భేరుండరవము
భేరుండనినదకంపితములై పాఱెడు
శరభసంతతిసాధ్వసస్వనంబు

---

1. దెంకికి; 2. నేటి.

శరభనినాదవిస్రస్తంబులై గమ
నించు కంఠీరవ నిక్వణంబుఁ
గంఠీరవారవస్ఖలితంబులై చను
భీతవన్యకరీంద్రబృంహితమ్ము

తే. మక్కడింపఁ దదీయ కల్మాషభీష
ణోగ్రఘోషంబునను సత్వయూధవివిధ
సత్వరధ్వానముల బహుజాతపక్షి
కలకలంబులు వినవచ్చెఁ గర్ణములకు. 5

క. ఆరావములుఁ గృతాంతా
కారములై వేఁటకుక్క కదుపులు వెలుచం
దారకులు వట్టి తిగువం
గా రయమున మృగయులకు [1]మొగంబుల కెగయన్. 6

గీ. సంతసంబందు నృపతియాస్యంబుఁ జూచి
తిమురుకుక్కల బెడిదంపుఁ దెంపుఁ జూచి
మృగయవర్గంబు గర్వంపుఁ బొగరుఁ జూచి
యుల్లమునఁ జాల మాండవ్యుఁ డులుకు పుట్టి. 7

వ. వనంబుఁ జేరవచ్చితిమి, మృగంబులు గానవచ్చుచున్నయవి, యీ వచ్చిన వారిలోన నెవ్వరిని విచారించినం గాతరత్వంబు లేదు పోతరంబు బహులంబై యున్నది. ఏను [2]బేదబ్రాహ్మణుండ నివ్వనమృగంబుల నవ లోకించిన శరభస్వామి తలంపునంబడి పుట్టిన శరభంబులును, వైకుంఠ కంఠరవంబు మీఁది యుత్కంఠ నావిర్భవించిన సింగంబులును, జాంబవంతుం డల్లపనిసేయునప్పు డుప్పతిల్లిన భల్లూకంబులు, నాగ్రహంబున వ్యాఘ్రురక్షోభర్త లాక్షారుణాక్షుంబుల నధిక్షేపించి చేయు నిక్షుచాప వ్యాపారంబున నుదయించిన పులులును, గుంభిదానవునకు సంభవంబైన యిభంబులును, గృతాంతుని లాయంబు లులాయంబుసంతతిం బ్రబలిన

1. మృగంబుల; 2. వేద.

కారెను పోతులును, గుహానా వరాహంబుపై మోహంబున సమూహం
బైన పందులును, గాని చేతన్మాత్రంబులు గావు. నాకుం బోవుట బుద్ధి
గాదు, కాదని మగుడ నుద్యోగించిన మందకును దూరంబుగా వచ్చితిమి.
1నడ గఁడు నడతెగె మానిసి మట్టి చిట్టాడని యీ చిట్టడవి నెట్లు చన
నేర్తు నొక యుపాయాంతరంబున దోడు వెట్టించు కొని2యెదం గాక
యని యల్లనల్లన భూవల్లభుం జేరంజని యిట్లనియె. 8

సీ. కర్మకాండం బెఱుంగని పామరుండుఁ గా
ర్యాదిఁ జేకొని వినాయకునిఁ గొల్చు
వేఁటమైఁదమి విఘ్నవిభుఁ బ్రార్థనమ్ము సేయ
కయు వచ్చినారము గమనవేళ
శరభశార్దూలాది చండసత్వంబుల
మర్దించు కొఱకునై మనదురాక
మృగములు మనచేతఁ దగులువడంగ నం
దుల భీతి ప్రజలకుఁ గలుగకుండ
తే. గజముఖునినేని బ్రార్థింతు వ్రజములోనఁ
బాలకును నేతి కుండ్రాల బ్రాల కచటి
గొల్లలకుఁ జెప్ప నన్నుఁదోడ్కొని చనంగ
నంగజాలల ననుపు ధరాధినాథ. 9

క. సేమంబుపూని మృగజయ
కామన సంకల్పపూర్వకముగ జపంబున్
హోమముఁ జేయుచునుండెద
సామజవదనునకుఁ, బత్రపసాదము కలిమిన్; 10

సీ. చిక్కుఁజీరుగ గూల్చు సింహపోతకములఁ
దోలి తొప్పలలాడు గ్రోలుపులుల
విలయంబు నొందించు విపినంబునందుల
వెరఁజి వెంపలలాడు హరిణములను

1. నడకయు నెడతెగె; 2. చనియెదంగాక.

విఱువు కంఠాస్థుల నుఱికి చివ్వంగుల
　　　　మొత్తిమోదరలాడు మత్తకరులఁ
గూల్పు ముర్వరఁ [1]దన్నికొన మన్నుఁబోతుల
　　　　వ్రచ్చి వందఱలాడు వాహరిపుల

తే. జంపి వసియాడు శశములగుంపు కుఱికి
చించి చెండాడుఁ గణుజులఁ జేతికొలఁది
వెదకి వేఁటాడు దుప్పుల మెదలనీక
చండవిక్రమచాప దుష్యంతభూప. 11

క. అనుటయు మాండవ్యుని మన
మునఁ గలిగిన భీతిఁ దెలసి భూపాలకుఁ డి
ట్లను బ్రాహ్మణమిత్రునిఁ
బాఱుని నే నిన్నకట యేమఱుదునే యెచటన్. 12

వ. నీవు నావెంట నంటుకొని యొంటివడక తోడునీడయుంబోలెఁ నేతెమ్ము
ప్రమాదంబు గాకుండఁ బ్రమోదంబుగా వేఁటవేడుక జూపి కుసుమంబు
నుంబోలెఁ [2]గందకుండ నిన్నుం దెచ్చెదనని భుజం బప్పళించి మృగయ
వర్గంబునుం దానును నిరర్గళప్రచారంబుల డాయనేఁగి [3]ప్రోగువారించి
దాపులమేపుల జువ్వులమొవ్వుల రేఁగులగోఁగుల రేలలజాలల వొద్దుల
మద్దుల గురుగుల విరుగుల నెమ్మలజమ్మల నేరేళ్ళమారేళ్ళఁ గలువల
బలువులఁ గొడిసెల నొడిసెల నందుగుల నిందుగులఁ గలుగొట్లఁ గొట్లఁ బం
చారుల నారులఁ బ్రేంకణంబుల గణంబులఁ గొండమామిళ్ళ వావిళ్ళ
తాండ్లమాండ్ల జంద్రులనుంద్రుల వెలగలమొలగల బీరలగారల వేములఁ
బ్రేముల మఱియునుం బెదబిచ్చి పినబిచ్చి నల్లిందనెల్లింద యిప్పకప్పు
మద్ది గద్దగోరు గోరంట వెలమ యులిమిరి మూఁగవేఁగిస మొదలుగా
బెక్కుతెఱంగుల మ్రాఁకులు మూఁకలుగొని యిసుము జల్లించిచల్లిన
రాలని దట్టంబునం బొడకట్టు లేక పరిక్రీడమాన క్రోడ సింహ సైరిభ
శరభ శార్దూల చమరు రురు కురంగాది జంతుఘోషంబులును, గంకకల
వింక కడింజర ఖంజరీట కపోత శిఖావళ శుక పికానేక పక్షికుల కలకలం

1. దన్నుకొక; 2. గసుగందకుండ; ౩. పోగు.

బులను, ఝుంఝూపవన ఝుంపాసంపాత కంపమాన కల్పాంతకాలజలధి ననుకరించు నరణ్యంబుఁ బ్రవేశించి వలయు వంకలం గాలువలలు [1]నురులు బోనులు దీమంబులుం జిగురుంగండెలువెట్టి వేయించి సార మేయంబుల విడిపించిన. 13

సీ. గళనాళములఁ ద్రుంచెఁ గారుపోతులఁ
గొన్ని తోలాడెఁ గొన్ని శార్దూలములను
నెలుఁగులఁ గొన్ని మేనుల నఖంబుల వ్రచ్చె
జమరీ మృగంబులఁ జంపెఁ గొన్ని
కొఱప్రాణములఁ జేసి కూల్చె దుప్పులఁ గొన్ని
చెండెమన్నుఁల గొన్ని గుండెలవియ
గఱచెఁ బందుల గొన్ని కంధరాంతరములు
కొండగొఱియల మన్నిగొనియెఁ గొన్ని
చటులగతిఁ గొన్ని కణుజుల సంహరించె
వెంటఁబడిఁ గొన్ని శశముల విత్తు[2]మాల్చెఁ
గొన్నిజింకల ప్రేవులు గ్రుచ్చివైచెఁ
గుక్క లాటవికంబులు నుక్కుమిగిలి. 14

సీ. కడిమిమైఁ బిడియానఁ బొడిచి యొక్కఁడు కొఱ
ప్రాణంబుతోఁ బులిఁబట్టి తెచ్చె
భల్లాన నిర్గతప్రాణంబు గావించి
లావున నొక డేకలంబుఁ దెచ్చె
నసిధార మెడద్రెవ్వ నడచి కొమ్ములతోన
నొకఁడు కార్పోతు మస్తకముఁదెచ్చె
[3]బాణాభిహతిఁ గూలఁబడవేసి యొకఁడు
కాననదంతితొండంబు నఱకిదెచ్చె
తే. గుఱుచకుంతాన బెను మోర గ్రుచ్చియెత్తి
యెలుఁగు నొక్కఁడు కాల్పట్టి యీడ్చితెచ్చె

1. తెరలు; 2. మూన్చె; 3. బాణనిహతి.

శేవమై జిల్లకోల నాటించి యొక్కఁ
[1]డేదుఁ గొనివచ్చెఁ గరిపురాధీశుకడకు. 15

చ. అవి గనుఁగొంచు నెంతయుఁ బ్రహర్షమునొందుచుఁ దానులీలఁగా
నవిరళశక్తిఁ గాంచనసమంచిత పుంఖశిలీముఖంబులం
గవయవరాహదంతిరురుకాసర పఙ్క్తులఁ గూలనేయుచున్
గదిసి తదీయకంఠములు ఖడ్గముఖంబునఁ ద్రెవ్వనేయుచున్. 16

క. వనచరులను జూచుచు నటఁ
జన జనపతి కాంచె నొక్కచక్కని యిఱ్ఱి
న్మునిపతి పెంపుడు బుఱ్ఱిని
వనమునఁ జరియించు వేళ వలపులకుఱ్ఱిన్. 17

క. హరిణము నెఱిఁగని పుంఖిత
శరుఁడై వెంబడిన యరిగె జనపతి కడిమి
న్వరయజ్ఞమృగము వెంబడి
నరిగెడు సాక్షాత్పినాకహస్తుడుపోలెన్. 18

చ. విలుగొని వెంటవెంటఁ బృథివీపతి రా శరపాతభీతిఁ దా
మలఁగి మలంగి కన్గొనుచు మార్గముఁ ద్రేవకు నడ్డగించుచు
న్నిలుచుచుఁ గొంతకొంత గమనించుచు నర్ధము మేసిమేసి ద
ర్భలు వివృతాస్యపార్శ్వముల రాలఁగ మింటికిఁ జౌకళించుచున్. 19

సీ. శాలాంతరంబు మోసంబైన విడివడి
యరుదెంచు గాడ్పువాహనమృగంబో
శశముతో నొంటక జగతిపై వచ్చిన
చంద్రునిలోని లాంఛనమృగంబో
వీరభద్రుని కృపావీక్షణంబునఁ బున
ర్నవమైచరించు జన్నపు మృగంబో

1. డెద్దుగొనివచ్చె.

పార్వతీకన్యక [1]ప్రార్థింప విడిచిన
యురగేంద్రకంకణు కరమృగంబో
తే. యనఁగ మాయామృగమువోలె నామృగంబు
ధరణిపతి బాణనిహతికిఁ దగులువడక
నదులు నగములు ఘనకాననములు గడచి
చటులగతి నేఁగె మాలినీతటమునకును. 20

క. ఏతెరువున నరిగె మృగం
బా తెరువున నదులు వనము
లద్రులనక ధాత్రీతలపతి సైన్యసమా
న్వితుండై యరిగె మాలినీనదిదాఁకన్. 21

గీ. అచట మృగమును బోలేక యలసినిలిచె
నానెలవు నాశ్రమాంతిక మగుటఁజేసి
స్థలవిశేషం బెట్టిదో ధరణిపతికి
హారిణపతిమీఁద నెంతయుఁ గరుణపుట్టె. 22

వ. ఇత్తెఱంగునం గురంగంబుమీఁదఁ గురంగాంకకులీనుండు కృపాతరంగి
తాంతరంగుండై యేయకయుండం దత్తరంగిణీ తటంబున, 23

సీ. కడఁగి సంక్రీడించు నడవియేనుంగుల
గండస్థలుల దానగంధములను
జెంచులరాచకెంజిగురాకుఁబోఁడుల
శిరసుల జవ్వాదిపరిమళముల
విచ్చిన నెత్తమ్మివిరులఁ దుమ్మెద లాడ
జాఱిన పూదేనెసౌరభములఁ
గూలద్రుమంబుల గాలితాకునరాలి
వచ్చిన యలరు క్రొవ్వాసనలను

1. ప్రార్థించి.

తే. శబలితంబగు నయ్యేటిసలిలకణము
లల్లనల్లన గొనుచు మందానిలుండు
చల్లఁగా వీచి వనపథశ్రాంతి దీర్ప
నది గనుంగొను వేడుకఁ గదలికదలి 24

మ. ఒకచో మత్తమరాళనృత్తనినదం బొండొక్కచోఁ జక్రవా
కకుటుంబస్మరకేలిజాతకలనిక్వాణంబు వే ఱొక్కచో
వికచాంభోజమరందసన్మధుమదావేశభ్రమద్భృంగ గా
నకలాప ధ్వని మానసంబునకు నానందంబు సంధింపఁగన్. 25

క. కంజకుముదోత్పలచ్యుత
కింజల్కపరాగపటలకీలిత మగుచు
న్మంజుసరోవరదేవత
మాంజిష్ఠము గట్టుకొనినమాడ్కిం దనరున్. 26

మ. చలదిందీవరచారునేత్ర సముదంచచ్చంచరీకాలకం
జలజాతాననఁ గంబుకంఠి బిసహస్తం జక్రవాకస్తనిం
బులినశ్రోణి మరాళరాజగమన న్భూజాని గాంచె న్నట
జ్జలకల్లోలపరంపరానినదవాచాశాలిని న్మాలినిన్. 27

వ. కాంచి వితత పరిశ్రాంతుఁడును, సంతోషితస్వాంతుండునునై బెదరి బెదరి తన వదనంబుఁ గనుంగొనుచుం గదలకున్న యిఱ్ఱిగున్న వీక్షించు చున్న యవసరంబున, 28

సీ. దీర్ఘదీర్ఘంబులై తిరి గట్టి మదములు
గడచి తూలాడు కెంజడలతోడ
వింజామరము విచ్చి వ్రేలవైచిన మాడ్కి
డాలొందు నరపగడ్డంబుతోడ
ఫాలబాహూదరపార్శ్వదేశంబుల
గొమరారు భూతిత్రిపుండ్రములతోడఁ
బోశంబు విడిచి కప్పుకొనివచ్చిన
కొత్తమణుఁగుఁ జమూరుచర్మంబుతోడ

తే. బ్రహ్మతేజోధికులరైన బ్రహ్మచారు
లిద్ద ఱిరువంక నలమి రా నెలమితోడ
నగ్నిశిఖవోలియును జల్లనైనకాంతి
యడర నొక వృద్ధముని వచ్చె నధిపుకడకు. 29

వ. వచ్చి వెడవెడ దీవించి కృతాంజలియై యున్న రాజునుం గూర్చుండు మనక తాను నాసీనుండుం గాక నిలిచి హరిణంబు నంగుళిముఖంబునం జూపి, 30

క. ఆశ్రమ సారంగంబిది
యాశ్రితమందార దీని నలయించితి నీ
విశ్రామమునకు నిది మా
కశ్రాంతముఁ బ్రాణమిత్రమై చరియించున్. 31

ఉ. ఏమని చెప్ప నప్పు డటు లీనిన మైఁదడి యాఱలేదు దా
నీమహితాశ్రమంబునకు నేసరవింబడి తప్పివచ్చెనో
ప్రేమయుఁ జేసి యంగుళులఁ బెట్టిన దర్భలు మేయుచుండగా
నోమనఁ బాపగోలెఁ గృపనోమితి నీమృగరాజడింభమున్. 32

క. తనతల్లులు మునిపత్నులు
తనతండ్రులు మునిజనములు; తనసహజన్మల్
మునికన్యలుగా; గారవ
మున బెరిగి వనౌకసులకు ముద్దులు గురియున్. 33

వ. ఇది యొకనా డాహారవిహారార్థం బరిగి కాననంబులం గసవుమేయుచు దాపసజనంబు వేరనెవ్వరుం గనుంగొనినం గనుచూపుమేరన మేత చాలించి డాయవచ్చి యొరసికొనుచు సౌహార్దోత్కంఠం గంఠం బెత్తి కండూయనంబుఁ జేయించుకొను; మమ్ము సమ్ముఖంబున నాలోకించు చుండియు బెండుపడి యోలంబునం దలవ్రాలవైచుకొని మిన్నకున్న యది; యొచ్చెల యెంత నొచ్చెనో కదా యని డగ్గఱి కపోలంబులు పుడికి, గళంబు దువ్వి. యంగంబులు నిమిరి, సారంగంబు మపలాలించుచుఁ

గృపాతరంగిణీతరంగంబులగు నపాంగంబుల మృగంబు వీక్షించు ముని
పుంగవుం గని నృపపుంగవుండు కలంగిన యంతరంగంబున, 34

క. నొచ్చెనో వీరల హృదయము
లిచ్చట నామీఁద నలిగి యేమని శాపం
బిచ్చెదరో కద నాలుక
వెచ్చన మునులకును గినుక వేగమ వచ్చున్. 35

సీ. భృగుని నూసరవెల్లి వగుమని యొకఁడల్గె;
సగరుల నొకఁడు భస్మముగఁ జూచె;
శీతాంశు నొకఁడు నాశిలుచుండఁ గోపించె;
భానుని నొకఁ డుర్వి బడ నదల్చె;
నబ్ధులేడును నొకఁ డాపోశనము గొనె;
నగభేది నొకఁ డేవముగ శపించె;
జంకించి యొకఁ డగ్ని సర్వభక్షుకుఁ జేసె;
నహుషుని నొకఁ డంపె నహుల గలయ;
తే. గోత్రరిపులక్ష్మి మున్నిటఁ గూల్చె నొకఁడు;
మునుల మనసుల నొప్పించి మొక్కవోయి
బ్రైసి దొలఁగిన వా రెంతలేసివార
లితరజనముల గణుతింప నెంతవారు. 36

చ. దిరిసెన పూవుకంటెను నుతింపగ మెత్తన చాలఁ జిత్తముల్,
కెరల యుగాంతవాయుసఖకీలలకంటెను వేడినాలుకల్,
దరిసిన గూలద్రోయుదురు దంతులతోడి దిగీశరాజ్యముల్,
కరుణ వహించిరే మునులు కట్టుదు రల్పుల బ్రహ్మపట్టముల్. 37

గీ. కుడిచికూర్చుండి యురక యెన్నడును లేని
వేఁట యే నేల వచ్చితి విపినమునకు
వత్తుఁ గాకేమి దుష్టసత్త్వములఁ జంపి
యేల తనియక వచ్చితి నిట్టిబడిని. 38

వ. విధికృతం బెట్లు కానున్నదో కాక యని యాకులితచిత్తుండై, యానృపో త్తముండు తాపసో త్తముపదంబులకు ముదంబొదవం బ్రణామంబు చేసి కరకంజంబు లంజలిబంధంబు గావించి యంటియంటి మంజులోక్తులం దపస్వికుంజర! యేను దుర్వ్యసనంబున మృగయావిహారంబునకుఁ గడంగినది లేదు. సింహశరభసైరిభ ద్వీపిద్విపాది దుష్టమృగంబులు గోష్ఠంబులకు, నేదిష్ఠగ్రామంబులకు, నరిష్టంబు సేయుచున్నయవి యని ఖిల్లపల్లవ జనంబు లెఱింగించిన, వాని మర్దించుటకునై, నిర్దయశార్దూల సమ్మర్దంబును, మదభరోత్కంఠకంఠీరవారావభైరవంబును, శరభ సైరిభధ్వానభయదంబును, బ్రచండవేదండప్రకాండబృంహితాకాండ జలదగర్జానుస్ఫూర్జితంబును, సముల్లసద్భల్లూకహింకారనిక్వణకలితంబును, నుద్ధత స్తబ్ధరోమోద్దామ నిర్ఘృణ దీర్ఘ ఘుర్ఘుర నిర్ఘోషభీషణంబును, దుర్వ్రాహదర్వీకరభీకరంబును నైన యరణ్యంబున వేటలాడుచు వచ్చి యిది యాశ్రమమృగంబౌట యెఱుంగక కురంగలించియుండ వన్యమృగంబకా నిర్ణయించి, వేటాడి, యలయించితి. ఈయజ్ఞానంబు సహింపవలయు ననినం బరమజ్ఞానియగు మునీంద్రుండు నరేంద్రు నాలోకించి, 39

క. జననాథ దుష్టమృగ మ
ర్దన మొనరింపంగ నీ వరణ్యంబునకుం
జనుదెంచు టంతరవలో
కనముల నెఱుఁగుదుము నీకుఁ గలుషము గలదే. 40

గీ. దీని నాశ్రమమృగమని తెలియ [1]కీవు
వచ్చు టెఱుఁగుదు మవనీశ వలదు భయము
వైరిమర్దనుఁడవు, వంశవర్ధనుఁడవు
కీర్తిఘనుఁడవు నీ కొక కీడు గలదె. 41

ఉ. సర్వజనైకపూజ్యుఁడవు సత్యయుతుండవు నీవు మామకా
శీర్వచనంబునం గను ప్రసిద్ధు నపూర్వసుపర్వనాయకాం
తర్వసుఁడైన నీ యనుఁగుఁదాతఁ బురూరవుఁ బోలువాని, నీ
యుర్వరఁ జక్రవర్తి పద మొందు సుపుత్రుని, సచ్చరిత్రునిన్. 42

1. లేవు.

క. ఈ మాలినీతరంగిణి
సీమముగా నింతనుండి క్షితినాయక ని
స్సీమతపోనిధి కణ్వమ
హాముని తపముండు నాశ్రమాటవి యిచటన్. 43

సీ. మునులు నిత్యస్నానములు దీర్చి యెడలక
కాసారముల కంచ గదియ వెఱచు
మౌనిజనం బనుష్ఠానంబుఁ దీర్పక
మృగశాబకము దర్భమేయ వెఱచు
సంయమీంద్రులు శివార్చనలు చెల్లింపక
ప్రసవంబునకుఁ దేఁటి ముసర వెఱచుఁ
బారికాంక్షులు ఫలాహారతృప్తులు గాక
కీరంబు పంటికిఁ జేర వెఱచుఁ
తే. దపసిజనములు నుతిమంత్రజపము లుడిగి
వచ్చియుండక పికశిఖావళములాది
గావనంబునఁ గల విహంగమకులంబు
తత్తరము నొంది నోరువా యెత్త వెఱచు. 44

సీ. వృద్ధసింహమునకు విహరింపఁ దొండంబు
కైదండగా నిచ్చు గంధగజము
పులిక్రొత్త యీనిన పొదరింటిలోనికిఁ
బురిటాలి తగవుఁగొంపోవు హరిణి
శరభంబు కొనగోళ్ళ శిరము దువ్వఁగఁ
జొక్కి కనుమోడ్చు సుఖనిద్ర గండకంబు
సింహకిశోరంబు చేరవచ్చిన
వింతలేక చన్నిచ్చు బాలెంత కరిణి
తే. యెలుకతోడుతఁ జెరలాడు నెనసి పిల్లి
నెమ్మిఁ బురివిచ్చి నిలిచి పింఛమ్మునీడ

భుజగకన్యక నాడించుఁ [1]బూరినమలి
యనఘ కణ్వమునీంద్రు పుణ్యాశ్రమమున. 45

మ. పవనుండాహుతి గంధము ల్గొనుచుఁ బైపైవచ్చె నాసాపుటీ
వివరప్రీతిగ నాస్వదింపుము చతుర్వేదోక్తమంత్రధ్వనుల్
కవియం బారెడు యజ్ఞవాటముల నాకర్ణింపు వీక్షింపు న
చ్చె వియద్వీథికి హోమధూమలతిక ల్జీమూతజీవాతువుల్. 46

వ. సంయమీంద్రులు నరేంద్ర నీవిచటికి వచ్చుట తమదివ్యజ్ఞానంబున నెఱింగి యున్నవారు నీ వెఱుంగమి చేసికొనిపోవక యాయురైశ్వర్యాభివృద్ధి కరంబును, గలుషకర్శనంబును నగు తాపసదర్శనంబుఁ జేసిపొమ్మని యమ్మునివరుండు నిజేచ్ఛం జనియె. నృపవరుండును నచటనుండి యరదం బెక్కి చనుట యుచితంబు గామిం జేసి, తేరు మాలినీతీరంబున నునిచి శరాసనాదిసాధనంబులు సారధిచేతి కిచ్చి, తేపనంబునం బరమపావనం బగు తపోవనంబు సొచ్చి, 47

సీ. శుకగర్భకోటరచ్యుతములై నివ్వరి
ప్రాల్క్రిందఁ జెదరిన పాదపములుఁ
దలలకు గారకాయలు నూఱ నందులఁ
జమురంటి [2]మెఱయు పాషాణతతులు
నిబిడవల్కలశిఖానిష్యంద రేఖల
[3]జాఱులుగల జలాశయపదములు
దమ మేను లొరసికొంచు మనుష్యు లరిగిన
భయమునఁ జంచలింపని మృగములుఁ
తే. గలిగి యన్యోన్యమైత్రి నక్కడఁ జరించు
పులులకూనలు, జింకపిల్లలు, మృగేంద్ర
పోతకంబులు, నాలకేవులును గదుపుఁ
గట్టికొని కూడియాడ నక్కజముఁ జెంది. 48

1. బూని; 2 మెఱచు; 3. జాదులు.

శా. వేదాధ్యాపకులైన రాచిలుకలన్ వేదాంతమీమాంసలన్
వాదం బిమ్ములఁ జేయు శారికల దత్త్వం బిందు[1]జూటుండుఁగా
నాదేశించు పురాణముల్ చదువు చక్రాంగంబులన్ సామముల్
నాదంబొందఁ బినాకిఁ బాడు నళులన్ వందారుఁడై చూచుచున్. 49

చ. చను నెడ నంతలోఁ గుడిభుజం బదరంగఁ దొణంగినన్ మనం
బునఁ గడుఁ జోద్యమందుచుఁ దపోవన మిచ్చట దీనికిన్ ఫలం
బొనర మనోజ్ఞమూర్తియగు యుగ్మలిఁ గౌఁగిలిఁ జేర్పఁగావలెన్
గొనకొని యీశ్వరుండ యెఱుఁగం గనరానిది మానుషంబునన్. 50

మ. అని నాగ్లేనుపదంబు లేఁగు నెడఁ గర్ణానందసంధాయులై
వినగా వచ్చెఁ బ్రియంవదా నిగిడి రావే యంచు రారాఁగదే
యనసూయా యని వృక్షసేచనము సేయం జాలఁ బ్రొద్దెక్కెఁగా
యని యాక్షేపము సేయు నొక్కతనుమధ్యామంజులాలాపముల్. 51

క. ఆమాట లాలకించుచు
భూమీశుఁడు కొన్నిచరణములు చని యడరన్
గామునిదీపము లనఁ జను
వామాక్షుల ముగురఁ జూచి వారలలోనన్. 52

శా. చంచత్పల్లవకోమలాంగుళకర స్సంపూర్ణచంద్రానన
న్యంచచ్చందనగంధి గంధగజయానం జక్రవాకస్తనిం
గించిన్మధ్యఁ దటిల్లతానిలసితాంగిం బద్మపత్రాక్షి వీ
క్షించెన్ రాజు శకుంతల న్మధుకరశ్రేణీలసత్కుంతలన్. 53

సీ. దర్పకురాజ్యంబు దలచూప నెత్తిన
బంగారుటనటికంబము లనంగ
రతిమన్మథులు విహారమునకై చేతులఁ
బట్టి యాడెడి నిమ్మపం డ్లనంగ

1. జాటుండుఁగా

కేయివెన్నెలనాఁటి రేయెండ యుపయించఁ
బెదరు చకోరంపు బిల్ల లనఁగ
శృంగారసరసిరాజీవకాననమున
విచ్చిన కనకారవింద మనఁగ
తే. నూరుయుగమును జనుదోయి యొప్ప విప్ప
కన్నుఁగవ నెమ్మొగంబు నుత్కంఠ బెనుప
గౌతుకముఁ జేసె మేదినీకాంతుమదికి
విపులలావణ్య[1]పరసీమ తపసిలేమ. 54

వ. అప్పు డప్పుడమిఱేఁడు విస్మయాయత్తంబగు చిత్తంబున నత్తపస్వి
మత్తకాశిని నవలోకించి తనమనంబున, 55

సీ. సురకన్య కాఁబోలు సురకన్య యయ్యెనే
కవిమై తెప్పలాడించు టెట్లు
పుత్తడి కాఁబోలుఁ బుత్తడి యయ్యెనే
హంసీగతుల నడయాడు టెట్లు
వనలక్ష్మి కాఁబోలు వనలక్ష్మి యయ్యెనే
గటివల్కలంబులు గట్టు టెట్లు
రతిదేవి కాఁబోలు రతిదేవి యయ్యెనే
వలరాజుఁ బెడఁబాసి వచ్చు టెట్లు
తే. కన్నుగవ యార్చుటను సురకన్య కాదు
నడచియాడెడుఁగానఁ బుత్తడియుఁ గాదు
లలిఁ దపశ్చిహ్నమున వనలక్ష్మి కాదు
ప్రసవశరముక్త యైనది రతియు గాదు 56

వ. మానవమానవతియు కావలయుఁ గాక దేవకామిని యయ్యేనేని నన్ను
నవలోకించి యంతర్ధానంబునొందుఁ గాకుండెనేని నన్యోన్యసల్లాపంబు
లుజ్జగించి యూరకుందురు గావున నొక్కదిక్కున మఱుగుపడియుండి

1. తరసీమ.

యవలోకింపవలయు నని సమీపవటవిటపిమూలంబునం దాగి కనుం గొనుచుండె నయ్యవసరంబున, 57

క. బిందెలు కరములఁ గొని యర
విందాస్యలు జలము దెచ్చి వేడుకతో నం
దంద తరుసేచనంబును
సందడిగొని సేయుచును ససంభ్రమలీలన్. 58

క. అనసూయ నిగిడి చన న
య్యనసూయం గడచి వడిఁ బ్రియంవద చన న
య్యనసూయఁ బ్రియంవద మును
కొని వేగిరపాటుతో శకుంతల చనఁగన్. 59

సీ. అరుణపల్లవములు హస్తాంగుళంబులు
గెంజాయఁ దమలోన గ్రేణి సేయ
వెలిమంచుమొగ్గలు విమలదంతంబులు
చెలువంబుఁ దమలోన గలసి వెలయఁ
బరువంపు గుత్తులుఁ బ్రన్ననిపాలిండ్లు
మవ్వంబుఁ దమలోన మార్చికొనఁగఁ
జిందుతేనియలును జెమటచిత్తడియును
గ్రొత్తావి తమలోన బిత్తరింప
తే. లలితపుష్పితజంగమలతికవోలె
వల్లికావృక్షముల యాలవాలములకు
జలము వోయు శకుంతల చంద్రవదన
చారుతరవైభవముఁ జూచి జనవిభుండు. 60

చ. దిరిసెనపువ్వుకంటెఁ గణుతింపఁగ మెత్తన మేనుదీఁగె యీ
తరుణికి; నిట్టికోమలి లతాతరుసేచన మాచరింపఁగాఁ
గరుణ యొకింత లేక కడఁగట్టె మునీంద్రుఁడు మాట లేటికిన్
సరవి యెఱుంగలేకకట జాదులు వేచర మంగలంబునన్. 61

గీ చందనంబునఁ బుష్పంబు గుందనమునఁ
బరిమళం బిక్షులతికను ఫలమువోలె
రతిమనోహరమైన యీయతివ మేన
నరయఁ గనుగొంటిఁగాదె యీయౌవనంబు. 62

వ. ఈలతాతన్వి తపస్వినీచిహ్నంబులు పూనియున్నను నెరవు దోఁచుచు శరీరకాంతి సౌందర్యసౌభాగ్యంబువలన రాజసంబును, ప్రతాపంబును, గర్వంబును, లేవయు నించుకించుక ప్రకాశించుచున్నయవి, మౌనికన్యాకలితంబగు బ్రహ్మతేజోవిశేషంబు లేశంబును గాన[1]రాకున్న దది యట్లుండె. 63

ఉ. సందియ మేల యీవికచసారసలోచన రాజపుత్రి నా
డెందము మౌనికన్యలబడిం జననేరదు నిక్కువంబ యే
చందమునందు సంశయవిచారపదం బగునట్టి వస్తుసీ
మం దమచిత్తవృత్తులు ప్రమాణము లుత్తములైనవారికిన్. 64

ఉ. పౌరవవంశసంభవుల పావనచిత్తవిధంబు లన్యకాం
తారతికిం బ్రమోదభరితంబులు కావు ప్రకంప మొంది యీ
ధారుణి సంచలించినను దామరచూలి వరంబు దప్పినన్
వారిధు లింకినన్ మఱి దివాకరచంద్రులు తప్పఁ గ్రుంకినన్. 65

క. కానీ సంశయమెల్లను
[2]మానుం బరిపాటి వీరిమాటలవలనన్
లోనున్నరాగి వెలుపలఁ
గానంగావచ్చు పూఁతకడియముభంగిన్. 66

గీ. వీనులకుఁ బండువులుగాగ వీరిమాట
లాలకించెదఁగా కని యధిపుఁ డుండె
నంత నొకతేటి వచ్చి శకుంతలాము
ఖాంబుజమునందు ముసరిన నలఁత నొంది. 67

1. రాదున్న దది య ట్లుండె; 2. మానీ.

గీ చందనంబునఁ బుష్పంబు గుందనమునఁ
బరిమళం బిక్షులతికను ఫలమువోలె
రతిమనోహరమైన యీయతివ మేన
నరయఁ గనుగొంటిఁగాదె యీయౌవనంబు. 62

వ. ఈలతాతన్వి తపస్వినీచిహ్నంబులు పూనియున్నను నెరవు దోఁచుచు శరీరకాంతి సౌందర్యసౌభాగ్యంబువలన రాజసంబును, ప్రతాపంబును, గర్వంబును, తేవయు నించుకించుక ప్రకాశించుచున్నయవి, మౌనికన్యా కలితంబగు బ్రహ్మతేజోవిశేషంబు లేశంబును గాన[1]రాకున్న దది యట్లుండె. 63

ఉ. సందియ మేల యీవికచసారసలోచన రాజపుత్రి నా
డెందము మౌనికన్యలబడిం జననేరదు నిక్కువంబ యే
చందమునందు సంశయవిచారపదం బగునట్టి వస్తుసీ
మం దమచిత్తవృత్తులు ప్రమాణము లుత్తములైనవారికిన్. 64

ఉ. పౌరవవంశసంభవుల పావనచిత్తవిధంబు లన్యకాం
తారతికిం బ్రమోదభరితంబులు కావు ప్రకంప మొందు యీ
ధారుణి సంచలించినను దామరచూలి వరంబు దప్పినన్
వారిధు లింకినన్ మఱి దివాకరచంద్రులు తప్పఁ గ్రుంకినన్. 65

క. కానీ సంశయమెల్లను
[2]మానుం బరిపాటి వీరిమాటలవలనన్
లోనున్నరాగి వెలుపలఁ
గానంగావచ్చు పూఁతకడియముభంగిన్. 66

గీ. వీనులకుఁ బండువులుగాగ వీరిమాట
లాలకించెదఁగా కని యధిపుఁ డుండె
నంత నొకతేటి వచ్చి శకుంతలాము
ఖాంబుజమునందు ముసరిన నలఁత నొంది. 67

---

1. రాదున్న దది య ట్లుండె; 2. మానీ.

వాధరుల సల్లాపంబులు [1]చెవులకుఁ జల్లఁగా వినుచు నుల్లసంబున భూవల్లభుండు చప్పుడు సేయకుండె నప్పుడు శకుంతల విస్రస్త[2]కుంతలయు, విధ్వస్తధైర్యయు, విన్యస్తసాధ్వసయునై యనసూయాప్రియంవదల నవలోకించి, 73

గీ. ఏను మీచెలి నిం తేల యెరవు సేయ
వింతవారైన మొఱ యాలకింతు రకట
ప్రాణసములరు కావరే ప్రాణ మెత్తి
మమత విడువక మార్పరే మధుపబాధ. 74

క. నేఁ జనిన చోటికెల్లను
దాఁ జనుదెంచుచును మఱలఁ దనుఁ జోఁపంగా
మీఁజేతులెల్ల గిజగిజ
గాఁజేసెను మొగలిముండ్లు గాఁడినభంగిన్. 75

గీ. వివర మొనరింప బొందులు వేఱుగాని
ప్రాణ మొక్కటి మనకుఁ బద్మాక్షులార
పాపరే నాకు నీయాతిబాధ యనిన
జిట్టకాలకు వార లచ్చెలువతోడ. 76

ఉ. ఇంతి తపస్వికన్యకల మే మసమర్థల మీతిబాధ భూ
కాంతుఁడు మాన్పి ధాత్రిప్రజఁ గావను బ్రోవను గర్త కాన దు
ష్యంతున కేము చెప్పెదము సాధుజనార్తిహరుం డతండు దు
ర్దాంతుని నియ్యళిం గెడపి తామరపూఁజెఱసాలఁ బెట్టెడున్. 77

వ. రాజుసన్నిధికిం బోయెదమని నగవులకు రెండుమూఁడుపదంబు లరిగిన ననసూయాప్రియంవదల వెంట నాక్రోశంబు సేయుచు శకుంతలయుం గదలె నయ్యవసరంబున భూవల్లభుం డవ్వల్లవాధరలం గనుంగొని లీలా వ్యాజంబున నీరాజవదన లాశ్రమసదనంబునకుం జనకుండ నెఱింగించు

1. చెవులన్; 2. కేశయు.

కొన నిది యవసరంబని ప్రమానిచాటువిడచి జవనిక వాయందట్టినం 'బొడసూపు బహురూపి తెలుంగున మఱుంగుపడియున్న తా నన్నలి వి2లోచనలకుం గోచరుండై నిలిచి వెలవకుం దోడకుండు తపస్వికన్య లపు మీకు నాకులం బొనర్చిన దుశ్చరిత్రుం జెప్పెండు వాని నాజ్ఞాపించెద ననిన సుధామధురంబులగు నతని వాక్యంబు³లాకర్ణించి కనుంగొను నెడ. 78

సీ. కస్తూరిప్రవాసినకరణి మీసలు నల్లదొగడురేకు
జనించు మొగము మెఱయఁ
గ్రొత్తమ్మిపోగఱేకులమీఁదఁ దుమ్మెద
లున్నలాగునఁ బెద్దకన్ను లమర
నాజానుదీర్ఘంబులైన బాహులపెంపు
శేషభోగాకృతిఁ జెలువ మొందఁ
బిడికిలింపగవచ్చు నడిమి యొప్పిదముతో
నురమువిస్తారంబు సిరి వహింప
తే. నాననము పూర్ణచంద్రుపెం పపహసింప
గగనముననుండి వేడ్క నకాండ మిలకు
నదరిపాటుగ డిగిన జయంతుఁ డనఁగఁ
జాల నద్భుత మొసఁగె దుష్యంతమూర్తి. 79

వ. ఇట్లు పొడచూపిన నృపాలచంద్రు నాకార తేజోవిశేషంబులు భావించి జయంతుఁడో కంతుఁడో నలకూబరుండో యిచ్చటికి వచ్చుట కెయ్యది కారణంబకో యని యద్భుతంబును భయంబును మనంబునం బెనఁగఁ గొండొకవడి గనుంగొని నరుండకా నిశ్చయించి యతని కులనామధే యంబు తెలిసికొనవలెనని యనసూయా ప్రియంవదలు రాజువదనార విందం బాలోకించి, 80

ఉ. ఎక్కడివాఁడ వన్న జగతీశ్వరలక్షణలక్షితంబు నీ
చక్కనిమేను దీర్ఘభుజశాఖలుఁ దేజముఁ బర్చసేయఁగా

1. బొడకట్టు; 2. లోచనగోచరుండై; 3. లాలకించి.

నిక్కఁడి కొంటి వచ్చుటకు నెయ్యది కారణ[1]మంతవట్టు నీ
నిక్కముఁ జెప్పుమన్న ధరణీపతి సత్యచరిత్రుఁ డాత్మలోన్. 81

క. వారక యసత్యవచనము
నారకహేతు వనఁగను [2]వినంబడెదుం బు
ణ్యారణ్యములోపల ముని
దారికలకుఁ బొంక నేల ధర్మచ్యుతిగన్. 82

వ. అనివిచారించి వారలతో నేను దుష్యంతుఁడ గాంతారంబున దుష్ట
మృగంబుల మర్దించుటకై వేఁటవచ్చి మాలినీతీరంబునం బరివారంబు
నిలిపి కణ్వమహాముని న్నమస్కరించి పోవుతలంపున వచ్చి యిచ్చట నొక్క
కలువకంటియొంటి నాక్రోశింప మీయార్తనాదంబు విని యరుగుదెంచు
నప్పటికి మీసరససల్లాపంబులై యున్నయవి యని యల్లనల్లన శకుంతలం
గనుంగొనుచుండ నచ్చట, 83

శా. ఆ కాంతాతిలకంబు చన్నుఁగవపై నందంద రోమాంచ మ
స్తోకంబై పొడకట్ట నుత్కలికచేతోభీతి సంధిల్ల నా
త్మాకాంతామణిమంజుభాషణము లాకర్ణించుచుం దోన తా
నాకర్ణించె మనోజచాపగుణసాహంకారఠంకారముల్. 84

క. భావభవపుష్పచాప
జ్యావల్లీరవము తన్మయత్వముఁ దెలుపం
దేవేంద్రతనయసన్నిభు
నావిభుఁ గనుఁగొనుచునుండె ననిమిషదృష్టిన్. 85

చ. కొలఁదికి మీఱు కోర్కుల శకుంతల చూడ నృపాలుడెందము
న్నలువును దెల్పునైన నలినచ్ఛదలోచన లోచనచ్ఛవు
ల్కలలము లట్ల నాటుకొన సౌరభలోభమున న్మధువ్రతం
బులు దగులంగ నాటుకొనెఁ బుష్పధనుర్ధరుఁడేయు తూపులున్. 86

1. మింతపట్టు; 2. వినంబడునీ.

క. వాలికలై విరిదమ్ముల
యేలికలై భావభవుని యెలదూపులకుం
బోలికలై యుత్కలికల
మూలికలై యబలఁ దాకెఁ మొగి నృపుచూపుల్. 87

ఉ. బాలికచూపులున్ ధరణిపాలకు చూపులు నొండొకళ్ళవైఁ
గీలుకొనంజనంగఁ గను గ్రేవల నవ్వుచు నిల్చి యిద్దఱ
న్వాలికపువ్వుఁదూపు లిరువంకలఁ బాఱఁగ నిక్షుచాపముం
గేల నమర్చి యేయఁదొడఁగెం బ్రసవాస్త్రుడు సవ్యసాచియై. 88

ఆ. కాముఁ డనెడు వేఁటకాఁ డేయుచును రాఁగ
నువిద[1]చేత మనెడు[2]నోదమునను
వసుమతీశచిత్తవన్యకరీంద్రంబు
పడియెఁగాని మగిడి వెడలదయ్యె. 89

వ. ఇత్తెఱంగున లతాంతశరనికరనిర్భిదేశమస్వాంతుండై యుండ నందు
శకుంతలాలికుంతల తనమనంబున, 90

చ. విరులశరంబునుం జెఱకువిల్లును బూనఁడు గాని పీడుగో
మరుఁడు మరాళయానలకు; మానవతీవచనంబు పల్లవా
ధరలకుఁ జెల్ల దింక విదితంబుగ నీతనిఁ జూచిరేని; నా
తరుణి కితండు గూర్చునది దర్పకు నేలదె యింటిబంటుగన్. 91

సీ. యక్షనందనురూపంబు హాస్యకరము
పాకశాసనిరూపంబు బడసివాటు
విషమబాణునిరూపంబు వినిమయంబు
ధరణి నారాజచంద్రుసౌందర్యమునకు. 92

వ. ఇతండు ప్రియుండు గాఁగల భాగ్యవతి కన్య యెవ్వతెయొకో యని
చింతించుచుఁ గనుంగొనుచున్న యన్నలినలోచనతో ననసూయాప్రియం

1. చెలువ; 2. నొంద.

వదలు రాజు విచ్చేసియున్నవాఁ డెక్కడఁ జూచెద, వేల నివ్వెఱపడియున్న దాన పర్ఘ్యపాద్యంబులొసంగవలయుఁ బర్ణశాల కతిత్వరితమ్మున రమ్మని కరమ్ము వట్టుకొని తోడ్కొనిపోయి యచ్చట సర్వంబును సమీచీనంబు చేయించి భూపాలుపాలికి నొక్కశిష్యుం బుత్తెంచిన, 93

క. అంతేవాసియు నాదు
ష్యంతుని గని యధిప యతిథిసత్కారము నీ
కెంతయు భక్తి నొనర్ప శ
కుంతలపుత్తెంచెఁ దోడుకొనిర మ్మనుచున్. 94

గీ. వేగ విచ్చేయుమనిన నావిప్రుతోడ
ననఘ యెందు శకుంతల యనఁగ నెవ్వ
రే, తపస్విని, వ్రత మెద్ది, యెట్టిచర్య,
యరయ కింతులచేఁ బూజ యనుచితంబు. 95

క. అనవుడు భూపాల తప
స్విని గా దాయింతి భువనసేవ్యుండగు క
ణ్వునికూఁతు రాయమకునై
మునిముఖ్యుఁడు సోమతీర్థమునకుం జనుచున్. 96

వ. అతిథిసత్కారం బొనర్ప నాకన్నియను నియమించిన నంతరాంతరంబు తెలిసింగి యార్యులకు సపర్యలు సేయుచుండు మనిన నతనివదనంబు నవలోకించి యూర్ధ్వరేతుండు కణ్వమహామునీంద్రుం డతనికి నపత్యలాభం బెట్లు గలిగె నది యద్భుతంబు వినవలయు ననిన, 97

క. ఎంతేనియుఁ గల దీవృ
త్తాంతము మీ రలసినార లరుదెండు పథ
శ్రాంతి హరియింపఁ దమల
స్వాంత శకుంతల యొనర్చు నాతిథ్యమునన్. 98

క. తడయవల దనిన నే మిట
బడలినయది లేదు కాశ్యపమునీంద్రున కీ
పడతి జనించినక్రమ మే
ర్పడ వినుపింపు మన నతఁడు భాసురఫణితిన్. 99

వ. మధ్యమలోకపాలకుండవైన నీవచనంబు మాకు నలంఘనీయంబు తత్కథాక్రమంబు యథాక్రమంబునం జెప్పెద దత్తావధానుండవై చిత్తగింపుము. 100

సీ. మునిమనోమోహనముక్తినటీనాట్య
రంగంబులగు హేమశృంగములను
గనకాబ్జకైరవకల్హారసౌరభో
ద్గారంబులగు జలాధారములును
క్రీడారతిశ్రాంతకిన్నరీపరిచిత
స్నేహంబులగు గుహాగేహములును
గుంజన్మదాలినీమంజులమంజరీ
పుంజంబులగు లతాకుంజములును
తే. నలరి పెంపొందుఁ బూర్వాపరాంబునిధుల
నడుమ ధరణికి మానదండంబువోలె
దేవతాత్మధరాధీశదిగ్విభూష
పుణ్యనిలయంబు నీహారభూధరంబు. 101

ఉ. ఎంచి నుతింప శక్యమె యహీశ్వరునంతటివానికైన ర
త్నాంచితరోచిరుద్గమనిరస్తసమస్తరవీందుజాలముం
గాంచనకందరాయవనికాయితవారిఫలంతరాళని
ర్వంచితదేవతామిధునవాంఛితమూలము శీతశైలమున్. 102

గీ. భూధరములెల్లఁ దను వత్సముగ నొనర్పఁ
బృథునృపాలోపదిష్టయై ప్రియము మీఱ
నఖిలరత్నౌషధులను జన్నవిసి పిదికె
నమరశైలంబు దోగ్ధగా నవనిసురభి. 103

ఉ. వారని మంచు పైఁ బొదివి వచ్చినపోయినచొప్పు మాసిన
న్నూరినఖాగ్రముక్తమయి పొల్పగు ముత్తెపుఁ జాలు వెట్టఁగా
దా రటు లేగి కాంతురు హతద్విపకేసరివాససీమలన్
పీరకిరాతు లద్రివనవీథుల సింగపువేఁట లాడుచున్. 104

ఉ. మానము దప్పకుండ ననమానదరీముఖరాయమానహే
లానిలపూర్ణరంధ్రనిచయంబయి కీచకరాజి మ్రోయఁగా
నానగరాజు కిన్నరుల యంచితగానవినోదవేళలన్
దా నొకవాసికాఁడువలెఁ దక్కఁగ నూల్కొనఁ జేయు తానముల్. 105

క. ధరణిధరసానుతటములు
పరిమళవంతములు సేయుఁ బాయక యెపుడున్
గరికండూయననిస్సృత
సరళక్షీరప్రసూతసౌరభలహరుల్. 106

ఉ. బింగపుఁ జాలుగా హిమము పేరిన యగ్గిరిత్రోవ దుర్వహో
త్తుంగకటీకుచాలసవతు ల్తురగాస్యలు సంచరించుచో
నంగుళిపార్శ్వభాగముల కార్తి యొనర్చినఁగాని యయ్యెడ
న్జంగలు చాఁచి మందగమనంబున కొందగనీ రపాయముల్. 107

సీ. ఏదేవినఖరోచు లిందురేఖలభంగిఁ
బ్రవహించు నోంకారపాదపీఠిఁ
గొమరొందు నేదేవికుడివంక నర్ధప
ల్లవితశంకరరూపలలితముద్ర
యేదేవియందు బ్రహ్మాదులీడని నతా
వృత్తిఁ దాల్తురు కల్పవిరమవేళ
జనియించు నేదేవి శాంభవీవిలసన
శ్రీకళాంశమున వైరించసృష్టి
తే. కన్నుసన్నల నేదేవికడఁ జరింతు
రఖిలదిక్పాలకుద్దాంతహారిణనయన

లామహాదేవి పుత్త్రిక యయ్యెఁ గూర్మి
నెట్టితప మాచరించెనో హిమనగంబు. 108

వ. ఇట్లనన్యసామాన్యసౌభాగ్యప్రాభవవైభవంబుల జగన్నుతంబగు నమ్మహా
శైలంబునుపాంతంబున సర్వర్తుకిసలయప్రసవఫలభరప్రకాండమండితం
బగు కాననాంతరంబున, బుండరీకకైరవోత్పలషండసంపన్నంబగు జల
జాకరసమీపంబున నొక్కచిక్కణసికతాప్రదేశంబున, 109

సీ. పంచాక్షరీమంత్రపర మోపనిషదర్థ
వాసనాసురభి యెవ్వానిబుద్ధి
శ్రుతిపాఠపూతవాక్పతిముఖస్తుతులచే
వడసె నెవ్వఁడు నవస్వర్గసృష్టి
బాహుజుం డయ్యుఁ దపశ్శక్తి నెవ్వాఁడు
బ్రహ్మర్షియై యెక్కె బ్రహ్మరథము
బందె మోడి దివంబు పంచి యిప్పించె ని
శ్శంక నెవఁడు హరిశ్చంద్రునకును
తే. నమ్మహాత్ముండు సకలలోకైకవినుతుఁ
డౌర్వశేయునితోడి మంత్రాటకాఁడు
నిష్టతోఁడుత నాశ్చర్యనియమవృత్తిఁ
దపమునకు నుండె నంబికాధవునిగూర్చి. 110

ఉ. పద్మజసంభవుం డతులభాస్కరతేజుఁడు గాధిసూనుఁ డ
చ్ఛద్మమతిం దపోనియమసంగతి నొంది సముల్లసన్మన
స్పద్మమునందు నిందుధరు శైలసుతాధవు భోగికంకణు
న్పద్మనిశాచరాంతకుఁ గృపానిధి నిల్పి యనన్యచిత్తుఁడై. 111

మ. ఇవముం గందువలం జలంబునను, నట్టెండ ల్వేసం గాయువే
సవులం బంచమహాగ్నిమధ్యమున, వర్షావేళల న్వన్యవృ
క్షవితానంబులు లేని బట్టబయల న్నాకాశనుండై యుమా
ధవుఁ జింతించుచు నిల్చి చేసెఁ దపముం దాత్పర్యధైర్యంబునన్. 112

సీ. మానసాంబుజకర్ణికామధ్యమునను,
గొన్నిదినములు శశిమౌళిఁ గుదురుగొల్పి
మీఁదిగాడ్పుఁ గ్రీగాడ్పుతో మేళవించి
భానుశశిమార్గములు గట్టుపఱపి తగను. 113

శా. లీల న్మధ్యమనాడినా జమిలిగాలిం జొన్ప లావెక్కి యు
త్కీలంబై యెగఁబ్రాకి చిద్గగనవీథిం జెంది యందున్న యా
ప్రాలేయద్యుతిమండలంబు గరఁగింపం దత్సుధాసారముల్
మూలం గూర్కెడు పాఁపకన్నె దెలుప న్మూర్ధాభిషేకంబునన్. 114

క. కరువలి దిరిఁగెడు తొల్లిటి
తెరువులుచెడ నంతరరులఁ దెఱపి కనుకనిన్
బరువులు వెట్టెఁడు తమతమ
యిరవులు గోల్పడిరి పడిరి యెట్లనొ తారున్. 115

మ. వశమై పంచమనాడియందుఁ బవనద్వంద్వంబు వర్తింపఁగా
దశనాదంబులు సంభవించి మొరయ న్దాన న్సదానందుఁడై
యశనాయానలపీడయు న్మఱియు దైన్యాదైన్యము ల్లేక యా
శశిజూటుండును దాను దానయయి విశ్వామిత్రుఁ డిట్లుండఁ గన్. 116

మ. అవనీచక్రము గ్రుంగె, నింగి ఘనగర్జాడంబరం బయ్యెఁ, జి
క్కువడెఁ జుక్కలు డుల్లె దిక్కరులు సంక్షోభించెఁ గుంభీనస
ప్రవరుం డుల్కెఁ దలంకె ధాత వగిలెం బ్రహ్మాండభాండంబు, బి
ట్టవిసెన్ నిర్జరరాజధాని, వడి నూటాడె న్మహాశైలముల్. 117

వ. ఇట్లు విశ్వాధికుండగు విశ్వామిత్రుండు తపంబు సేయ భీతుండై పురుహూతుం డెంతయు నంతరాయంబు నొందింప నిలింపచంపకగంధులందు నెవ్వరు గలరోయని సమీపంబునం గొలిచియున్న [1]నిర్జరజనంబు నవలోకించి, 118

1. స్త్రీజనంబు.

సీ. కమనీయసురసభాగారమధ్యమునకు
దీపించు మాణిక్యదీప మనఁగ
రంభాదిదేవతారంభోరువులకెల్లఁ
జారుచూడావతంసం బనంగ
జగములు గెలువంగ సానఁబట్టించిన
రతిరాజునవఖడ్గలతిక యనఁగ
యతులమానసము లుద్ధృతుల నాకర్షించు
వరవశ్యమంత్రదేవత యనంగఁ
తే. బంత మాడిన హరినైనఁ బద్మభవుని
నైన హరునైన మోహాబ్ధిఁ ద్రోచి
యీఁదు లాడింపనోపెడు నిగురుఁబోడి
మేనకాసతిఁ జూచి సన్మాన1మొసగి. 119

వ. సకలసౌభాగ్యసౌందర్యమందిరంబగు నీచేతంగాని గాధినందనుతపంబు విఘ్నంబు గానేరదు. శీఘ్రంబ చని యమ్మునివరుని మరుని యాజ్ఞకు లోనుచేసి రమ్మనిన మహాప్రసాదం బని యక్కొమ్మ పాకశాసను శాసనంబునఁ గౌశికు తపోవనంబునకు వచ్చిన వియచ్చరపతి యాజ్ఞ నయ్యచ్చరమచ్చెకంటి వెనుకొని, 120

శా. ఏతెంచె న్మధుమాసలక్ష్మి, తరుణీహిందోళరాగధ్వను
ల్వీతెంచె, న్బటుమీనకేతనముతో విల్లంది పూఁదేరిపై
దోఁతెంచె, న్దలిరాకుఁ గైదువులుఁ దోడ్తోఁ దాల్మి లేఁదీగల
న్వేతెంచె న్జగదేకవిక్రమకళావీరుండు మారుం డొగిన్. 121

ఉ. వామనదిగ్గజంబు మదవాసనకుం జన కోహటించు ను
ద్దామగతి న్నభోమణిరథంబు హయంబు లనూరుఁ డుద్ధతుం
డై మగుడింపఁగా మగుడ కడ్డము దాఁకెననంగ నుత్తరా
శాముఖవీథి నేగ దివసంబులు దీర్ఘత పల్లవింపగన్. 122

1. మొసఁగి.

గీ. తరణి మధువేళఁ బద్మినీసరసకేళిఁ
దడసె నన వాసరంబులు నిడుపు లయ్యెఁ
బాసి విరహాంబునైపమిఁ జేసి రథము
దఱిమికొనివచ్చె నన రేలు కుఱుచ లయ్యె. 123

క. భూరుహము లెల్ల నామనిఁ
గారాకులు రాలి చిగురు గలయ నలమి సొం
పారెను మధుమాసమునన
గారణములు డులిచి క్రొత్త గప్పినభంగిన్. 124

చ. మలయసమీరమ న్విటుఁడు మచ్చరికంబునఁ బట్టి తీవలం
జెలువలపైఁ బురాణదళచేలములన్ హరియింప లజ్జనా
జలనము నొందఁగా ననుపుజాణఁడు చైత్రుఁడు గప్పెఁ దోనలో
నొలసినకూర్మి పేర్మి చెడకుండఁగఁ గెంజిగురాకుబట్టలన్. 125

సీ. తళతళమించు కెందలిరుటాకుల నెడ
నెడ నొయ్యనొయ్యనఁ దొడిమ లెత్తెఁ
దొడిమలనడుమ వాత లోకింత గనవచ్చి
రావన నన లంకురంబునొందెఁ
ననలంకురం బంది నవకంబుతోఁ గూడి
బలసి లేదావుల కలిక లయ్యెఁ
గలికల పరిమళంబులు వాకొలుపు మోము
లరవిచ్చి మవ్వంపు టలరు లయ్యె
తే. నలరుగుత్తులు మకరంద [1]మలక నెఱయ
విచ్చిసోడుముట్టింపఁగా వీథికలను,
దరుణభావంబు నొందించెఁ దరుల లతల
నభినవంబైన నవవసంతాగమంబు. 126

1. మలికి.

శా. సంపెంగ ల్పరువంది క్రొవ్విరులచే శంపాలతాలక్ష్మి నొం
దింపం, బాదపము ల్ఘనంబులయి పూదేనె ల్దువాళించి వ
ర్షింప, న్వల్విరి చల్లి పాంథజనరాజి న్గమ్మగాడ్పు ల్చలిం
పింప, న్మాధవుఁ డంబుదాగతి విడంబించె న్విజృంభించుచున్. 127

శా. హేమంతంబను రాజు సేన పఱుపన్ హేలాగతిన్ జైత్రుఁడన్
సామంతుం డెదురం దదీయజవరాజత్కీరతుక్ఖారరిం
ఖామార్గంబుల నించు పాంసువులు నాఁగం బర్వె నారామకుం
జామల్లీలవలీలవంగనవపుష్పశ్రేణికారేణువుల్. 128

ఉ. తెమ్మెర లూపఁగా నలరుదేనియ లాని మదించి యింపునన్
దుమ్మెదలేమ లాగతులతో మధురస్ఫుటకోకిలా నినా
దమ్మునఁ బాడుచుండెను లతానవడోలల నూఁగియాడుచుం
గమ్మనివింటిజోదు జయగాథలు పుష్పితభూజవీథులన్. 129

ఉ. ఆ పువువింటిజోదు మధుపావళి నారి యొనర్చి చక్కఁగా
మోపిడి పట్టి జుమ్మనుచు మ్రోయఁగ మీటుచునున్నవాఁడు మా
కా పని గాదు తాల్మిఁ గొఱఁగా దిఁక చన్నుల నంటబట్టుకొం
డో పతులన్ లతాంగు లను నోజఁ గరం బెలుఁగించె గోయిలల్. 130

క. వలరాజు దండు వెడలఁగ,
బలములు నియమించు సైన్యపతు లెదులెదురన్
దలతలఁ డను నెలుగులఁ గ్రియఁ
గలకల నెలుగించె నల్లకరరాచిలుకల్. 131

సీ. సమవర్తి రాణివాసాలపాల్లిండ్లపై
మృగమదామోదంబు మేఁతవట్టి
దర్వీకరస్త్రీలు తన్ను వావచిచూడ
గందంపుఁగొండ చెంగటసుఖించి
దర్దరశైలమధ్యమునఁ గర్పూరంపు
తరువాటికలలోనఁ దెరువు దప్పి

తామ్రమవర్ణఖ్యాతిఁ దనరారు ముత్యాల
యేటి యంబువులలో నీఁదులాడి
తే. విరహిజనముల హృదయకోటరములందు,
రాఁజు మదనానలము మించ రవులు గొల్పి
గాధిపుత్రుండు దపమున్న కాననమున,
నల్లనల్లన వీచె మందానిలుండు. 132

వ. ఇత్తెఱంగున సంతోషితసకలజనస్వాంతంబగు వసంతంబు సనుదెంచిన నుల్లసితపల్లవంబును, నుదారకోరకంబును, నుత్ఫుల్లకుసుమంబును, నున్నతస్తబకంబును, నుద్గతమకరందంబును, నుద్ధూతపరాగంబును, నుదంచితఫలంబునునై చైత్రరథమునకుం బ్రత్యాదేశంబును, నందనంబునకుం బ్రతిచ్ఛందంబును నగు విశ్వామిత్రునాశ్రమవనంబున మనంబులలర నలరువిలుకాఁడు సహాయంబుగా విహారవిలాసినులు పుష్పావచయంబు సేయం బూని, 133

క. దలదరుణతరుణకిసలయ
విలసత్ఫలభరితవిపినవీథీవిచర
త్కలకంఠశారికాశుక
కులకంఠధ్వనులు చెవులకున్ జవు లొసఁగన్. 134

గీ. వలపుగాడుపు లూర్పులఁ గలసి వెలయు,
దుమ్మెదలుఁ గుంతలమ్ములుఁ దొట్రుకొనఁగ
బువ్వులును నవ్వులును గూడి పొత్తు గలగి
విరులు గోయ దొడంగి రవ్వేళయందు. 135

ఉ. ఆసవగంధులైన వదనానిలముల్ పయిఁ బ్రోది సేయఁగా
గోసినకంటె వేగమునఁ గోసినవృంతమునందుఁ బుట్టగాఁ
గోసె మనోజ్ఞమూర్తి యొకకోకిలభాషిణి నిండువేడుకన్
డాసి వయస్యలెల్లఁ బొగడ[1]న్బొగడన్బొగడప్రసూనముల్. 136

1. బొగడం బ్రసూనముల్.

క. మవ్వపుటలరులు గోసెను
క్రొవ్వాడినఖాంకురములఁ గోమరు దలిర్పన్
బువ్వారుబోఁడి యొక్కతె
నవ్వులు బువ్వులును జడిగొనన్ సురపొన్నన్. 137

సీ. చటుకున నడచి రసాలంబు నొక్కతె
నవిపించి యామ్రప్రసూనములు గోసెఁ
జులుకఁగాఁదన్ని యశోకంబుఁ[1]బూయించి
విద్రుమాధరి యొర్తు విరులు గోసెఁ
నవ్యరీతులఁ గ్రేంకణము వికసింపించి
వనిత యొక్కతె ప్రసవములు గోసె
సమదరాగస్థితి సంపెంగ విరియించి
చంద్రాస్య యొర్తు పుష్పములు గోసెఁ
తే. గలికిచూపులఁ బరువంబుగా నొనర్చి
తిలకమునఁ బూవు లొకవేల్పు తెఱవ గోసె
నిండుఁగౌఁగిటఁ గొరవి మన్నించి యొక్క
సురతలోదరి యలరుమంజరులు గోసె. 138

వ. మఱియును బురందరపురారవిందలోచనలును లోచనానందకరంబులగు తరులతాంతరంబుల లతాంతంబులు దెచ్చి రేకు మడంగకుండఁ, గందకుండ, మకరందంబు చిందకుండఁ, దేఁటి గ్రోలకుండ, బరాగంబు రాలకుండ, మేనకాహస్తంబునకు నిచ్చిన నాహస్తిరాజగమన యానవీనప్రసూనంబుల ప్రసూనశరదమనమూర్తియగు విశ్వామిత్రుపాదపద్మంబులకు సమర్పించి దండంబు వెట్టి లేచి సమీపంబునం బూచినసహకారంబునీడ నొక్కపాదం బాకుంచితంబుగాఁ దరువున నొఱిగి యొయ్యారంబున నొసలి చిట్టంటు జెమట మాటిమాటికిఁ గొనగోర మీటుచుఁ దుంటవిలుకాని మోహనశక్తియుంబోలె నున్నయెడ, 139

1. రాయించి.

సీ. తేటిమొత్తమునేపుఁ దూఁటు బుచ్చఁగనోవు
కమనీయనీలాలకములు చూచి
చిగురుటాకుల డాలుఁ జిన్నఁబుచ్చఁగఁజాలు
సాంద్రంపు కెంపుహస్తములు చూచి
కరికుంభములక్రొవ్వుఁ గాకుసేయఁగ నవ్వు
దోరంపుసెరిచన్నుదోయిఁ జూచి
చంద్రబింబము పెంపు సవతుగా దనిపించు
మొలకనవ్వులముద్దుమోముఁ జూచి
తే. రసము లుట్టెడు బింబాధరంబుఁ జూచి,
పసిఁడిపొడి రాలు కళవైభవము జూచి
కమలములనేలు పాదపద్మములు చూచి
మునికిఁ జక్కిలిగింతలు గొనె మనంబు 140

శా. ఆతన్వంగిపయిం బ్రియం బొదవి విశ్వామిత్రుఁ డీక్షించుచుం
జేతఃపద్మమునందు నున్న శివునిం జేమోడ్చి ప్రార్థించి తా
నాతారాద్రికిఁ బంపి యచ్చట లతాంతావాససీమ న్మనో
జాతుం బ్రీతుని జేసె దేవగణికాసంభోగసౌఖ్యంబులన్. 141

క. మేనకయుఁ, దాను హిమగిరి
తానకముగ జపముఁ, దపముఁ దనమదిలోనం
బూనక, యొకనాఁడైనను
మానక సుఖయించుచుండె మన్మథకేళిన్. 142

సీ. ప్రసవకార్ముకుఁ డను పాపకర్మునిచేత
నూనాస్త్రుఁ డనెడు దుర్మానిచేత,
నంబుచరధ్వజుం డను కిరాతునిచేత,
మన్మథుం డను నసన్మార్గుచేత,
శబరాంతకుఁ డను జాల్మచిత్తునిచేతఁ,
గందర్పుఁ డను పలుగాకిచేత,

నంగసంభవుఁ డను నతినిర్దయునిచేత,
దర్పకుం డను నాకతాయిచేతఁ,,
తే. జెడ్డవారలఁ గథలుగాఁ జెప్పనేల,
వేల్పుఱేఁ డంప నొకదేవవేశ్యఁ జూచి
తొడరి యజునైన నొసలిర్వా ల్దుడువ నోపు,
కౌశికునియంతవాఁ డూడ్చెఁ గచ్చడంబు. 143

క. ఈగతి వేలుపురై యెల
నాగను దగులుకొని నాఁడునాటికిఁ గోర్కు
ల్తీఁగలు సాగఁగ మన్మథ
భోగంబుల మనసు తృప్తిఁబొందిన పిదపన్. 144

క. ఆళీమిళదమరీగత
కేళీవనపవనచలితకేసరధూళీ
పాళీముహురనుగతభృం
గాళీగణ్యంబు హిమనగారణ్యంబున్. 145

వ. ప్రవేశించి యచ్చటఁ దపంబునకు నిలిచె, మేనకయు నమ్మౌనిసంగంబున నొక్కకూఁతురుం గని యప్పుడటుపుట్టిన యప్పురుటిపట్టి నల్లనల్లన పట్టుకొనిపోయి మాలినీనదీసైకతంబున నేకతంబున బద్మపత్రంబులు పొత్తులుగా నమర్చి మెత్తమెత్తన యునిచి దివంబున కరిగె నిచ్చట, 146

క. అత్తటిని శకుంతంబులు
తత్తనువున కెండ గాలి దాఁకక యుండ
న్మెత్తనియాకలఁ బొదువుచు
నెత్తురుగందుపయి నిల్పె నెయ్యముఁ గృపయున్. 147

ఉ. ఆనది నొక్కనాఁడు ముదమారఁగ శిష్యులుఁ దానుఁ గూడి వి
జ్ఞానధనుండు పుణ్యనిధి సాధువరేణ్యుఁడు, కాశ్యపుం డను
స్నానము సేయ నేగి యచటం బొడఁగాంచె శకుంతపక్షర
క్షానిరుపద్రవస్థితిఁ బొసంగిన కౌశికవీర్యసంభవన్. 148

వ. కాంచి యది విశ్వామిత్రవీర్యంబగుట నార్యజనసేవితుండగు కణ్వ మునీంద్రుండు గాధిపుత్రునిమీఁది మైత్రియుఁ, దల్లితొఱంగునిసుంగుమీఁది కారుణ్యంబును. బెనఁగొన నావేల్పుంబూఁప నొక్కశిష్యునిచేతి కిచ్చి, యాశ్రమంబునకుం దెచ్చి, శకుంతరక్షితయగుటయు శకుంతలయను నామంబు వెట్టి, ప్రేమంబునం బెనుపుచున్నవాఁ డన్నప్రదాతయు, నభయప్రదాతయు నీయిద్దఱుం గన్యలకు గురువులై రీరెండుదెఱంగులు నమ్మునిపుంగవుని యందఁ గలిగెఁ గావున నతండు తండ్రియు నయ్యెంతి కూఁతు రయ్యె, నిది శకుంతలావృత్తాం బని యాద్యంతంబును నెఱింగించిన మహీకాంతుఁడు నితాంతసంతోషంబు నొందె నంతట నూష్మ కాంతుండును జరమగిరిశిఖరంబునకు బంధూకపుష్పమంజరియుంబోలెఁ గెంజాయ నలంకరించె. 149

గీ. అపుడు భూపతి విప్రుని నాదరించి
చరమసంధ్యావసర మయ్యె సంయమీంద్ర
కన్యకలు చెప్పి పుత్తేరఁ గాదనంగ
రాదు నడువుము వేగమ పోద మనుచు. 150

శా. శంకాతంతువుఁ ద్రెంచి యీ వడుగు దాఁ జక్షుఃప్రియం బొప్పగాఁ
గొం కొక్కింతయు లేక నిర్భయుఁడనై కోర్కెల్ కొనల్ సాగఁగా
నింక న్నా కొకమాటు చూడఁగలిగెన్ హేలాశరత్పూర్ణిమా
పంకేజాహితబింబచారుముఖబింబశ్రీకబింబాధరిన్. 151

మ. అని చింతించుచు సంతసించుచు రయంబారంగ సారంగలాం
ఛనవంశాగ్రణి యేఁగుచోఁ జటులవర్షాకాలకాలాంబుద
స్తనితధ్వానపథాధ్వనీనగళగర్తక్రోడనిష్ఠ్యూతని
స్వననిర్భగ్ననితాంతశాంతబహుసత్త్వస్వాంతకాంతారమై. 152

క. శైలద్రుమచరదేణీ
జాలోదరదళనకేళిసమయాతిగళ
త్కీలాలసిక్తదంష్ట్రా
కీలనఖం బగుచు నొక్కబెబ్బులి వచ్చెన్. 153

శా. ఆశార్దూలముఁ జూచి భీతహృదయుండై మేను కంపింపఁగా
నాశల్ చూచుచు బ్రాహ్మణుం డపుడు ప్రాయఃప్రాణరక్షార్థమై
యోశార్దూలమృగేంద్రచర్మధర, యోయుగ్రాక్ష, యోయద్రిజా
ధీశా యీయపమృత్యువుం గడపరావే యంచు గీర్తింపఁగన్. 154

వ. ఆవిప్రవరుని యార్తియు నిర్దయశార్దూలవిస్ఫూర్తియుం గనుంగొని కారుణ్యమూర్తియగు నారాజు భీతచేతస్కుండైన వాని నుపచరించుచు శీఘ్రగమనంబున వచ్చువ్యాఘ్రంబు నడ్డగించుసప్పు డది నగరివేఁటపులి యగుటం దెలిసి మృగయు లెట్టు దీని నేమఱిరి, దీనివలన నీయాశ్రమ వనతనుసత్త్వంబులకు నపాయంబు పుట్టిన మహాపరాధంబు వచ్చు ననుచు నమ్మృగరాజుం బట్టుకొని బంధురగమనంబున నిజస్కంధావారంబునకుం జనుచు దనమనంబున, 155

క. తాపసశిష్యుని లలితా
లాపంబుల నాశకుంతలావృత్తాంతం
బేపారఁగ వినియును నా
క్ష్మాపాలుఁడు సంతసిలక సంశయచింతన్. 156

గీ. కన్య క్షత్రియవీర్య యాఁగాక యేమి
కణ్వుఁ డొకసికి నీఁ గడకట్టె నేని
చెలువ నామీఁదఁ గూరిమి సేయదేని
రెంట దుష్యంతుకోర్కి పూరించు టెట్లు 157

చ. కొనగొని తావి మూర్కొనని క్రొవ్విరి, యెయ్యెడ వజ్రసూచి డా
యని రతనంబు, జిహ్వచవి యానని తేనియ, గోరు మోపి గి
ల్లని చిగురాకు, లాలితవిలాసనికేతన మాలతాంగి, దా
ననుభవకర్త యేఘనుఁడో యావిధియత్న మెఱుంగనయ్యెడున్. 158

ఉ. ఆడదుగాని మాటలొక యంచుల నించుక వీను లొగ్గి నా
యాడినమాటలెల్ల విను నర్మిలితోఁ దను నేను జూచినం

జూడదుగాని యొండుదెసఁ జూచినఁ దా నను జూచుచుండు నీ
జాడలు నాపయిం దగులుచందము డెందముఁ జేర్పనేర్పఁగన్. 159

ఉ. అచ్చపలాక్షి కన్య విమలాశ్రమవాసిని ప్రేమచిహ్నము
ల్మచ్చిక లేక చేయ దనుమానము గల్గదు సత్యసంతతు
ల్వెచ్చపుఁగూరుము ల్పరిఢవింపఁగనేరదు నేర దజ్జసం
పచ్చటులంబులై మెఱయు పచ్చవిచూపులక్రేళ్ళు చూడఁగన్. 160

మ. చికురంబు ల్నొసలంట నున్న చెమటల్ జెక్కు ల్దలిర్పన్ ఘటో
దకభారమ్మునఁ గెంపుహస్తయుగ ముద్ధారింప నంసంబు లిం
చుక జాఱం జనుదోయి యూర్పువడి సంక్షోభించి కంపింపఁ దా
నొకకేలం దుఱు మావటించు చెలువం బుల్లంబుఁ గొల్లాడదే. 161

వ. అనుచు నచ్చెలువచెలువంబు దనమనంబున నునుచుకొని, యచ్చోటు వాసి మగిడి చూచుచు, నిలచుచు, నివ్వెఱపడుచుఁ, బ్రొద్దువంకఁ గనుంగొనుచుఁ, బెద్దసడిం గొండొకదవ్వు గమనించుచు, నిట్టూర్పు నిగిడించుచు నెట్టకేలకు వేలంబున్న చోటికిఁ దపసిబోటికి మనం బిచ్చి యేటి కెదురంటిన కరణి ధరణీనాయకుండు ప్రవేశించి, 162

చ. తనకు శకుంతలావదనదర్శనయాత్రకు విఘ్న మాచరిం
చిన పులిఁ జంపఁ జూచియును బెంపుడు గావున వేఁటకాండ్రమీఁ
ద నెపము వెట్టి యేమఱుట తప్పుగఁగట్టి యథాపరాధదం
డన మొనరించె నుత్తమజనంబులు చూప రనర్హకోపముల్. 163

గీ. అవనిపతి యివ్విధంబున నరుగుదెంచి
యపరసంధ్యాభివందనం బాచరించి
యుష్ణమును దీర్ఘమును గాఁగ
నుస్సు రనుచు సంయమీంద్రకుమారిక సంస్మరించి. 164

సీ. పిలువవచ్చినఁ బోక నిలిచి యేటికి నింతి
పుట్టువుఁ దెలియ దుర్బుద్ధి పుట్టెఁ
బుట్టనీ యతఁ డేల పూర్వాపరంబులు
సూచించి విడువక జోలివట్టెఁ
బట్టనీ గమనసంభ్రమవేళ శార్దూల
మదరిపాటున నేల యడవి సొచ్చెఁ
జొచ్చిరానీ మాటు సుద్దివంపకయుండఁ
జనుదెంచె నేటికి జరమసంధ్య
తే. విఘ్నములు పెక్కు లిటు సంభవింపఁజేసి
తెలువఁ గని కన్నులాఁకలిఁ దీర్పకుండ
నదయుఁడై విధి కంచము మొదలివాని
లేశమంతయుఁ గృపలేక లేవనెత్తె. 165

క. అని దైవము దూఱుచుఁ
దనమనమెల్లను గొల్లఁగొనిన మానిని తరుసే
చన చర్యలు నలసవిలోచన
ముఖభావములు మానసము నలరింపన్. 166

ఉ. మజ్జనభోజనక్రియలు మాని వలాని యరోచికంబునన్
ఖజ్జము గొంతకొంత కసిగాటులుగా భుజియించి యెవ్వరిం
బజ్జను జేరనీక తనభావము లోపల దాఁపురంబుగా
సజ్జకుఁ జేరియుండె నృపచంద్రుఁడు సాంద్రవియోగవేదనన్. 167

క. ఆవేళ హాస్తినగర
ఙ్మావల్లభుఁ డున్న యెడకుఁ జనవునఁ జేరం
గావచ్చిన మాండవ్యుఁడు
భావము దెలియంగవలసి బరిహాసోక్తిన్. 168

క. వనమునకు నొంటి యరిగితి
జననాయక యచట మనసు శంకించెనొ య

మ్మునివరు లేమి పరాభవ
మొనరించిరొ నాకుఁ జెప్పు మున్నువిధంబున్. 169

చ. మనమున జంకు గల్గినను మాన్చెద నేనది మంత్రశక్తిచే
మునుల[1]యవజ్ఞ గల్గినను ముందఱికి న్మనసీమలోనికా
ననములు గుత్త యిచ్చి జతనంబుగఁ జేసినఁ గందమూలము
ల్దిని యెదువారు గాగ నరుదెంచి వళంవదు లౌదు రందఱున్. 170

వ. దీని కింత చింత యేల జగతి యేలంగలిగిన నావంటి సేవకుండు సిద్ధించి యుండ నశక్తుండునుంబోలె నుండు టేటిప్రాభవం బనిన సాధుజనపోషకుండు విదూషకున కిట్లనియె, 171

గీ. ప్రాణసఖుఁడవు నీకుఁజెప్పక మదీయ
వృత్తగోపన మెట్లు గావింపనేర్తు
మచ్చనాలుకవాఁడవు మంతనంబుఁ
బొడమనీకని రసనకు బుద్ధి చెప్పు. 172

మ. మదనారాతిసమాను గాశ్యపమహామౌనీంద్రు సేవింప స
మ్ముదమారం జని యాశ్రమంబువనసీమం గంటి వాల్గంటిఁ, దో
యదనీలాలకఁ, గంబుకంఠిఁ, గరిణీయానం, బయోజానన
న్పదసత్సంశయగోచరోదరి, సుధాసంబాధబింబాధరిన్. 173

సీ. నిండుఁజందురునకు నెత్తమ్మివలపును
నద్దంపుఁబొలుపును నబ్బెనేని
కరికుంభములకు బంగారుతార్పులయొప్పు
శకటాంగములవిప్పు జరిగెనేని
యరఁటికంబములకు గరభంబు నునుడాలుఁ
దూణీరములమేలు దొరకెనేని
సరసిజాతములకు [2]జంత్రంబుఁబెంపును
జిగురాకుసొంపును జేరెనేని

1. యనుజ్ఞ; 2. జంత్రంపు.

తే. చపలలోచన మొగముతో [1]సరియవచ్చు
నింతిపాలిండ్లదోయితో నీడువచ్చు
వనితయూరుద్వయంబుతో [2]నెనయవచ్చుఁ
జంద్రముఖపాదయుగముతో సవతు వచ్చు. 174

వ. అని మఱియు నాపాదశిరోరుహాంతంబు వర్ణించు నుత్కంఠ నారాజకంఠీర
వుండు మాండవ్యు నొండు తలంపు లేక విను మని యిట్లనియె, 175

సీ. వెడవిల్తుచిగురాకుగోడుగులు గొని వచ్చి
చరణద్వయంబుగా సవదరించి
సంకల్పసంభవు జయకాహళుల దెచ్చి
జంఘాయుగంబుగా సంఘటించి
దుగ్ధాబ్ధిమనుమని తూణీరములు దెచ్చి
యూరుయుగంబుగా నుపచరించి
శ్రీదేవినుతు హేమసింహాసనము దెచ్చి
జఘనచక్రంబుగా సంతరించి
తే. నీరరుహసూతి శేషాంగనిర్మితికిని
దగినయవి లేక కంకపత్రమున నిచటఁ
గడమ కలదని వ్రాయు లేఖయును లిపియు
మధ్యమును నాఁ బొ నయ్యె నమ్మానవతికి. 176

సీ. ప్రసవాస్త్రుమాయావి బైలు వ్రాసిన సుడి
బిసరుహాననకు గంభీరనాభి
మోహచూర్ణము వోసి మూసిన బంగారుబరిణె
లుత్పలగంధిగురుకుచములు
యౌవనామరభూరుహమున డిగ్గిన యూడ
లరవిందవదనకు గరయుగంబు
సౌందర్యజలధిలో సంభవించిన పాంచ
జన్యంబు మీనలోచనగళంబు

1. సరికివచ్చు; 2. నెనకువచ్చు.

తే. వదనమను తామ్రపర్ణిఁ జెల్వంబులైన
విశదమౌక్తికములు లేమదశనపఙ్క్తి
శంబరారాతిసామ్రాజ్యసౌఖ్యపదవి
యలికులాలకకెంజిగురాకుఁబెదవి

గీ. జవ్వనం బను తొలుకారు నివ్వటిల్ల
సావితోడను మోహబీజంబు లలుక
మానసక్షేత్రములు దున్ను మదనుఁ డనెడు
కర్షకున కింతినాసిక కనకహలము.

క. శ్రీకమలగృహము మోము వి
లోకింపఁగ దీపకళికలు కనుంగవ యా
పై కొడివారిన సన్నపు
రేకలు నా బొమలు సుందరికిఁ జెలువొందున్.

గీ. మహితకీర్తి శకుంతలామంజువాణిఁ
బోల నష్టాదశద్వీపములను గలుగ
రనుచు శ్రుతులను సంజ్ఞల నతివయందుఁ
దొమ్ముద్దులు రెండు లిఖియించెఁ దమ్మిచూలి.

క. బాలేందునిపైఁ దిమిరము
పాళెము వెట్టుకొని వేళఁ బరికించుచుఁ దా
వేలము చేసినపోలిక
బాలికహారినీలకేశపాశం బమరున్.

గీ. చదువు రాజశుకబ్రహ్మచారులకును
దామరసనేత్రవదన మధ్యయనగృహము
గాణలై వచ్చు కోకిలగాయకులకు
నాతికంఠంబు దలఁప సంగీతశాల.

ఉ. కన్నులతీరుఁ జక్కని మొగంబు మెఱుంగును, జౌకళించు లేఁ
జన్నులమించు, నెన్నడుము సంశయలేఖయు, మేనియందముం
బెన్నెఱివేణి సొంపు మురిపెంబును, దిన్నని మోవి కెంపులున్
వన్నెలుగాని కావు రవణంబులు వన్నియ లాలతాంగికిన్. 183

మ. నవలావణ్యపయోధిఁ జిత్తమను మంథానాద్రికిం జంద్రికా
పవనాళిం దరిత్రాఁడుగాఁ బెనఁచి యబ్జాతాశుగుం [1]డిచ్చినన్
రవలిం గోకిలకీరము[2]ల్దరువ నారత్నాకరంబందు ను
ద్భవముం బొందిన లక్ష్మి కావలయు నాపద్మాక్షి భావింపగన్. 184

ఉ. చిత్తరవు న్లిఖించి మఱి జీవము వోసెనొ రూపసంపదం
జిత్తమునం దలంచియు సృజించెనొ రెండును జర్చ సేయగా
జిత్తరువందు నాకరణి చెల్వము గల్గదనన్యచిత్తుఁడై
చిత్తమునం దలంచియ సృజించెఁ బితామహుఁ డాతలోదరిన్. 185

శా. ఆదిం జంద్రుఁడు చంద్రికారుచుల నయ్యబ్జాస్యఁ గల్పించెనో
లేదేఁ గంతుఁడు చెల్వము ల్వెరఁజి యాలీలావతిం జేసెనో
కాదేఁ జైత్రుఁడు తావులెల్లఁ గొని యాకాంత న్వినిర్మించెనో
వేదాభ్యాసజడుం డజుం డెటులఁ గావించుం దదీయాకృతిన్. 186

సీ. పాలమున్నీటిలోపల సంభవించిన
        జలజాతనయనల చక్కదనముఁ
జంచలాలతికల జననంబు గాంచిన
        ధవళలోచనల సౌందర్యలక్ష్మి
నమృతాంశుకళలయం దావిర్భవించిన
        నీలవేణుల రామణీయకంబు
బుంద్రేక్షుకోదండమునఁ బుట్టు వొదవిన
        లావణ్యవతులవిలాసరేఖ

---

1. డించినన్; 2. దరవ.

తే. నరసఖుని యూరుకాండంబునను సముద్భ
వంబు నొందిన యుడురాజవదనచెలువుఁ
గుప్పగాఁ జేసి మునికన్య యొప్పుతోడ
వాసి దలపోయ నారాల కీస వెలితి. 187

శా. ఆవాలుంగనుదోయి యానగు మొగం బాగుబ్బపాలిండ్లపెం
పావేణీరుచి యాతమావిలసనం బాయొప్పు నేఁ జెప్పినం
గై వారం బగుఁగాని యయ్యెడ శిరఃకంపంబుతోఁగూడ నా
హా పుట్టింపదె యిక్షుధన్వునకు నయ్యబ్జాక్షి నీక్షించినన్. 188

వ. అని తదీయరేఖావిలాసవిభ్రమంబులు ప్రసంగించుకొనుచు నొం డెంటుం
గక మహీవిభుం డుండె నంత నిక్కడ నాశ్రమపదంబున శకుంతలయుం
దారున వచ్చిన విప్రువలన రాజు తనజన్మప్రకారం బడిగిన విధంబును
దదాకర్ణనంబున నిరస్తసంశయుండై పర్ణశాలాభిముఖుండై గమనించు
టయుఁ దదవసరంబున నకాండంబుగఁ బెద్దపుండరీకంబు వచ్చుటయు
నాశార్దూలంబును రాజశార్దూలంబు గోవత్సమునుంబోలెఁ గొనివచ్చు
టయు నాలోనన నపరసంధ్యాసమయంబు సంప్రాప్తం బగుటయుఁ బ్రతి
వచనంబులకు నెడ లేకుండుటయుం జెప్పినఁ దన మనంబున, 189

గీ. నరవరుం డస్మదీయజన్మక్రమంబు
వినుట నాపుణ్య మయ్యె నివ్వనములోని
కెన్నడును లేని శార్దూల మెట్లు వచ్చె
నరయ రాకుండ నరికట్టె నామృగంబు. 190

క. ఎప్పుడకో యీనిశి చను
నెప్పుడకో తెల్లవాఱు హృదయేశుమొగం
బెప్పుడకో చూచుట
నా కెప్పుడకో భాగ్యలక్ష్మి యెదురగు టనుచున్. 191

మ. చెమటం జెక్కులు తొంగలింప ముఖరాజీవంబు వాడంగ సో
లమున న్రెప్పలు వ్రాలఁ గన్నుఁగవ దేల న్మోవి నిట్టూర్పులం
గమలం దల్పముఁ జేరుచు న్విభునిరాక ల్గోరుచుం బ్రొద్దు భా
రమునం బుచ్చుచు వర్ధమానవిరహగ్లాని న్మదిం గందుచున్. 192

మ. మలయక్ష్మాధరనిర్గళత్పవనము ల్మండింపఁ గామాగ్ని యం
గలతం గాల్పకయుండఁ గంతుసుమనఃకాండప్రకాండాహతిం
జెలువెల్లం జెడకుండ నవ్విభునురస్సీమంబుతో దార్కొనం
గలలో నైనను గల్గునొక్కొ యని యక్కంజాస్య దీనాస్యయై. 193

శా. ఆచంద్రాన్వయరాజచంద్రముని పొందాసించి చన్నుంగవం
జూచుం గన్నుల నీరు నించుఁ దల యూచు న్మేను శయ్యాస్థలిన్
వైచు న్లేచును నవ్వు నుస్సురను బోవం గంటగించున్ ధృతిన్
గాచున్ బ్రొద్దు గనుంగొను న్వెతఁబడున్ గామాంధకారార్తయై. 194

వ. ఇవ్విధంబున, 195

గీ. అచట విరహాగ్ని రాజును నిచట మదన
బాణవేదన నింతియుఁ, బరితపింప
బ్రహ్మకల్పంబువోలె నారాత్రి వేగ
నెట్టకేలకు నంతట నినుఁడు వొడిచె. 196

శా. నాగామాత్యకుమార భూరమణమాన్యశ్రీక శ్రీకంఠచూ
డాగంగాసఖకీర్తి కీర్తితనిరూఢప్రౌఢనిర్నిద్రవా
చాగుంజాంబుజగర్భ గర్భసుఖితాసౌభాగ్య భాగ్యస్ఫుర
త్త్యాగోద్యత్సురభూజ భూజనహితవ్యాపారపారంగతా. 197

క. కవితాకల్పకలతికా
నవపుష్పమరందపారణామధుప నిజ
శ్రవణేంద్రియ సకలజగ
ద్భవనతమోదీపకీర్తి భాసురమూర్తి!

పృథ్వి: అమాత్యగుణబంధురా యఖిలబంధుకల్పద్రుమా
సమస్తజనసన్నుతా సమధికప్రభావోన్నతా
అమర్త్యతటినీధరాయతపదారవిందద్వయీ
సమంచితమధువ్రతా సతతపూతసత్యవ్రతా ! 199

## గద్యము

ఇది శ్రీభారతీతీర్థగురుచరణకరుణాలబ్ధసిద్ధసారస్వతపవిత్ర గాదయామాత్యపుత్ర ఆరాధితామరవీరభద్ర పిల్లలమఱ్ఱి పినవీరభద్ర ప్రణీతంబైన శాకుంతలశృంగారకావ్యమునందు ద్వితీయాశ్వాసము.

# శృంగార శాకుంతలము

## తృతీయాశ్వాసము

శ్రీకర పతిహితకార్య ని
శాకరసౌందర్య బంధుసత్కవిజనప
ద్మాకరసూర్య పయోర
త్నాకరగాంభీర్య వెన్నయప్రభువర్యా ! 1

క. దిననాథుం డుదయించిన
జననాథుం డుచితభంగి సంధ్యావిధు లె
ల్లను దీర్చియున్న సమయం
బున సేనావిభుఁడు వచ్చి ముకుళితకరుఁడై . 2

గీ. తోఁట కొల్లాడఁ బోయిన తోఁడిసములు
నేటి వేఁటకు మృగములు గాట మనుచు
వేడ్కతో వచ్చియున్నారు వేఁటకాండ్రు
వేగ విచ్చేయుఁ డనినఁ బృథ్వీవిభుండు. 3

సీ. కొమ్ముల నుదకంబు గోరాడి [1]వేఁజల్లు
కలఁచి క్రీడింపనీ కాసరములు
దంష్ట్రాంకురముల ముస్తలు త్రవ్వి భుజియించి
[2]సుఖవృత్తి నుండనీ సూకరములు
గడుపార మేసి మ్రాగ్గసువేసి [3]నీడల
నెమరువెట్టుచునుండనీ మృగములు
నిష్ఠురజ్యాబంధనిర్బంధమునఁ బాసి
గవిసెన నుండనీ కార్ముకంబు

1. వెంచలు; 2. శుభ; 3. మిక్కిలి:

తే. వలలు, బోనులుఁ గౌలేయకులము, మగుడఁ
బట్టణమునకు సకలంబు వెట్టి యనుపు,
పనుపు మృగయులఁ దమతమ పల్లియలకుఁ
జాలు మృగయావిహారవిశ్రామసుఖము. 4

గీ. ఆశ్రమాంతికమున వేఁట యనుచితంబు
నేము నేఁడును రేపును నిచట నిలిచి
మునులఁ బొడఁగని వారల ననునయించి
పిదపఁ బురి కేఁగుదెంచు టభ్యుదయకరము. 5

వ. ఏ మిక్కడ నుండు దివసంబుల నాశ్రమంబులకు రాయిడి గాకుండ మదీయస్యందనంబును, సారథియు, నీవు, మాండవ్యుండును, గతిపయాప్త పరిజనంబునుం దక్కఁ, దక్కిన శతాంగమాతంగతురంగపదాతి వర్గంబు దుర్గంబున కనుపు మనిన నతండును నట్ల కావించె. ఇట్లు సకల సైన్యంబునుం గరిపురి కనిచిన నారాజోత్తముండు చిత్తంబు శకుంతలాయత్తంబుచేసి ఉత్తమాటల మాండవ్యసేనాపతులతోడ నేమేనిఁ బ్రసంగంబు జరుపుచునుండె నయ్యవసరంబున. 6

గీ. వరతపోధను లిద్దఱం దరుగుదెంచి
సవినయంబుగఁ గృతనమస్కారుఁడైన
ధరణిపతి మౌళి మంత్రాక్షతములు వెట్టి
వరుస నాసీనులై మృదువాక్యములను 7

మ. అతిరాత్రం బను పేరిట న్మఖము సేయం బూని కణ్వాశ్రమం
బు తపస్వు ల్భవదంతికంబునకు మమ్ముం బెట్టి పుత్తేర వ
చ్చితి మిచ్చోటికి నుల్లసద్విజయలక్ష్మీశాలి వచ్చోటికిం
గ్రతుసంరక్ష యొనర్ప [1]రావలయు నక్షత్రేశవంశాగ్రణీ! 8

మత్తకోకిల. జంభశాత్రవతుల్యవైభవ, చక్రవాళబహిస్తమ
స్తంభనక్షమకీర్తివల్లభ, దానవాహిత ఘోణిరా

1. గావలయు.

ట్కుంభికుండలిరాజ కచ్ఛప కుంభినీధరబంధుదో
స్తంభసంభృతభూమిమండల, సంగరోరగకుండలా. 9

క. బాణాసనబాణతను
త్రాణకృపాణములతో రథస్థుఁడవై, నీ
వేణాంకకులజ ! రాఁదగుఁ
[1]గాణపదుర్జనులు గలరు క్రతువిఘ్నకరుల్. 10

క. [2]అనవుడు నట్టే కాకని
జనపతి యమ్మౌనివరుల సన్మానముతో
ననిచి రణోచితపటుసా
ధనసంపద సొంపుగా రథస్థుం డగుచున్. 11

వ. పచేళిమంబు లగు పనస, సహకార, నారికేళ, ఖర్జూర, జంబూ, జంబీర, రంభా, కపిత్థ, కర్కంధూ, తిందుక సౌగంధికాది సుగంధ బంధురఫలంబులును, నొడిపి ప్రాలు, దూసరిబియ్యంబు, నివ్వరివడ్లు, గునుకు, లూదలాదిగాఁ గలుగు వన్యధాన్యంబులు, ముడియలం, గావళ్ళం బెట్టించుకొని కదలి కదలికా, చందన, స్యందన, మరువకా, గరు, కురవకా, శోక, పూగ, పున్నాగ, భూర్జ, ఖర్జూర, సర్జ, కార్జున, శిగ్రు, న్యగ్రోధ, గుగ్గులు, మధూక, వ్యాఘ, కింశుక, శింశుప, చూత, జంబీరో, దుంబర, కదంబ, వంజుల, కుంజరాశన, కరంజ, భల్లాతకీ, సల్లకీ, చిరబిల్వ, బిల్వ ప్రముఖ, వివిధ, విటపికోటరక్రోడక్రీడాచిక్రోడ, కంక, కలవింక, కంపిజల, ఖంజరీట, కపోత, పారావత, శారికా, శుక, పిక, శిఖాతశావళి ముఖరితం బగు వనంబునం బ్రవేశించి, యతిచపలవిపులకపిలంఘనంబులం, గరువలితాఁకులం బాయక రాలు పండ్ల ననిసి తొరఁగు ననేక విధ స్వాదురసంబులు పెనువఱదలై పండి పగిలిన కాననేఱుదండ ప్రకాండంబులం బర్వ నిర్ముక్తంబు లగు ముక్తాఫలరాసులపైఁ బొరలిచి [3]పరవం దాభ్రమపర్ణీస్థలవిశేషంబు నభినయించు నభిరామప్రదేశంబులం గనుంగొనుచుం జనిచని తాపసపరిషదుపనిషదుపబృంహితబ్రహ్మవిద్యాతర్క

1. గాణప; 2. అనవుండు నట్టేకాకని; 3. పరువం.

ఫక్కికాచక్కరిత నూతన శ్రుతిశుభగారవంబులను, నిష్ఠానుబద్ధవృద్ధముని [1]పద్యానుసారివిద్యార్థివటుకపటుముఖోచ్చరిత వేదనాదంబులుం [2]గర్ణగోచరంబులైన నాకర్ణాంతవిశ్రాంతలోచనుం డచ్చట నరదంబు డిగ్గియరిగె, 12

మ. హరిదశ్వాధిక తేజుల, న్విమలభస్మాపాండుసర్వాంగుల
న్వరరుద్రాక్షవిభూషితావయవుల, న్వ్యాఘ్రాజినాసీనులం,
గరుణామూర్తులఁ, బుణ్యవంతుల, జహత్కందర్పుల, న్శాంతులం,
బరమబ్రహ్మశిఖామహోపనిషదభ్యాసస్థితస్వాంతులన్; 13

సీ. ఫలభోజనులఁ, బర్ణభక్షులఁ, బంచగ
వ్యప్రాశనులను, జలాశనులను,
నీవారభుజుల, శాకాహారుల, సమీర
వాసులఁ, ద్రసరేణుపారణులను,
సూర్యావలోకనస్తోకులఁ, బంచాగ్ని
మధ్యవర్తుల, సదామౌనపరులఁ,
బంచాక్షరీమంత్రపారాయణులను, ని
ష్ఠలశివనిర్మలధ్యానరతుల
తే. సంతత బ్రహ్మచర్యుల, సంగవర్జి
తుల, నకాముల, నూర్ధ్వరేతుల, వినిర్జి
తేంద్రియుల, నిర్మములను, నిరీహులను, ని
రాకులుల, నిత్యముక్తుల, నేకమతుల; 14

సీ. అంధకాసురవైరి యపరావతారుల,
యక్షేశసఖుని పర్యాయతనుల,
సాక్షాత్కరించిన శశిమౌళిమూర్తుల,
నంబికేశప్రతిబింబములను,
భావజారాతిలీలావిగ్రహంబుల,
నిటలలోచనుని మాఱుటయొడళ్ళ,

1. పథ్యానుసారి; 2. కర్ణ గోళ గోచరంబులైన.

న్మనుమని యాదృథభూపతి
మను మని దీవించి సంభ్రమదమానసులై.

చ. కొనిచని రాన్నృపాలకులకుంజరు, నాశ్రితవజ్రపంజరున్,
ఘనకుశదర్భతంతుపరికల్పిత[1]పంపర వల్లవావళీ
వినుతవిచిత్రతోరణపవిత్ర[2]పథంబునుగా, నితాంత పా
వనవిహితాతిపూర్ణ శుభవస్తువిశాలకు యజ్ఞశాలకున్.

క. ఆరాజున కిప్పించిరి
నీరాజనములు సువాసినీజనములచే
గౌరవమున నంచితస
త్కారముతో నిచ్చి రచట గంధాక్షతముల్.

వ. ఇవ్విధంబున నీవారముష్టింపచులగు తాపసు లారాజు సంభ్రమా
హ్లాదయుం జేసి,

సీ. సవనక్రియాలక్ష్మి [3]సంప్రీతిఁ గ్రీడింప
వేదోక్తిఁ గట్టిన వేదిఁ జూపి
కృష్ణవర్త్మకుఁ దారగింపఁ దెచ్చినయట్టి
సమిధాజ్యదర్భసంచయముఁ జూపి
కలుషసంఘమునకుఁ గళముకొ జ్జయియున్న
బంధురచిత్రయూపంబుఁ జూపి
యజుపురంబునకైన నమరావతికినైన
బదము వెట్టఁగజాలు పశువుఁ జూపి
తే. శుభకరోలూఖలచషాలశూర్పముసల
హరిణచర్మలవిత్రముఖ్యంబులైన,
సాధనప్రకరముఁ జూపి సాధునివహ
కలకలితమైన ప్రాగ్వంశకంబుఁ జూపి.

1. పిప్పర, వెప్పర; 2. పథంబున కానితాంత; 3. సంక్రీడ గావింప.

వ. నేఁడుమొదలు సప్తరాత్రంబులు సప్తతంతువు నిరంతరాయంబునం గావలయు నంతికమహీధరంబున ఖరతనూజుఁడను దనుజుండు వర్తించుచుండ నిందులకుం దగిన తెఱంగున రక్షణంబు వలయుననిన నక్కుంభినీవల్లభుండు మేఘగంభీరధీరస్వనంబున, 23

క. రక్షోభయ మేల సహా
స్రాక్షుఁడు దేవతలఁ గూడి యరుదెంచినఁ బ
ద్మాక్షుం డెదిరించిన నిట
లాక్షుఁడు వచ్చినను నిలుతు యాగముఁ గాతున్. 24

గీ. క్రతువుఁ జాఁగింపుఁ డేమియుఁ గలఁకలేక
యనుచు మనుజులపెడ్కొని మనుజవిభుఁడు
నిష్ఠురాధిజ్య కార్ముకాన్వితుఁ డగుచుఁ
నెలన మఖశాలదెసఁ గనుఁగొనుచునుండె. 25

శా. ఆతంకం బొకయింత లేక మతులన్ హర్షించి యధ్వర్యులు
ద్గాతల్ హోతలు మంత్రతంత్రముల సాంధ్యం బేదియు న్లేక సం
ఘాతంబై క్రతుకర్మము ల్నడప నాఘారాహుతిష్ఠ్యూతజీ
మూతశ్యామలధూమరేఖలు నభంబు న్ముంచెఁ జంచద్గతిన్. 23

క. ఆవాగలు చూడ మదిలోఁ
గోపాగ్నియుఁ బొగసె ననఁగఁ గుటిలభ్రుకుటీ
వ్యాపారముఁ గ్రతువిభవ
వ్యాపాదప్రౌఢిమంబు నాపాదింపన్. 27

క. ఆకోణపనాయకు రో
షాకులమున్న దటుఁ జూచి యది మాన్చుటకై
మాకందుఁ డనెడు మంత్రి వి
వేకి తదగ్రమున నిలిచి వినయముతోడన్, 28

గీ. మాను తమకంబు నీవేళ దానవేంద్ర
మానవేంద్రుం డనన్యసామాన్యబలుఁడు

సవనరక్షణ[1] సేయ దుష్యంతుఁ డధిప
వచ్చియున్నాఁడు మునితపోవనమునందు.

సీ. చింతాకులత్వంబు చెఱచుఁ దేజోలక్ష్మి
సీధుపానప్రీతి సిగ్గుఁ జెఱచుఁ
జెఱచు మిథ్యాదృష్టి శీలతాగరిమంబుఁ
బిశునవాచావృత్తి పెంపుఁ జెఱచుఁ
జిత్త[2]వైకల్యంబు చెఱచుఁ బ్రజ్ఞాప్రౌఢి
పరవధూసంగతి బైసిఁ జెఱచుఁ
జెఱచుఁ గ్రోధము తపఃస్థిరసమాధిస్థితిఁ
గాముకత్వము వివేకంబుఁ జెఱచుఁ

తే. గుటిలమానవుమైత్రి సద్గుణము జెఱచు
నసమవిద్యావివాదంబు [3]యశముఁ జెఱచు
ఫలితకార్యము వేగిరపాటు చెఱచుఁ
దమక మెప్పుడు పనికి నెంతటి ఘనునకు. 8

వ. దుష్యంతుం డలంతులం బోవువాఁడు కాఁడు, వాఁడితూపుల వేఁడిఁ జూప మూఁడుకన్నులవాఁడు వచ్చిన ఱిచ్చపడండు; వియచ్చరులకుం దోడ వచ్చినవేళ సాహసక్రీడ నతనిబాహుబలంబును, జలంబును, శౌర్యంబును, తేవయుం, జేవయుఁ, దెంపును, [4]నెఱవును, నొఱవును, గబ్బును నుబ్బును, నెఱుంగుదు; జన్నం బేడు దినంబు లున్నయది యదియునుం గాక నక్తంచరులమైన మనకు నక్తంబున శక్తి యగ్గలంబు; దివసంబున జవంబ నష్టంబయి యుండు; మాపు తదీయవైభవంబుఁ జూవుద మనిన, నట్లె కాక యని యెట్టకేలకుఁ గయ్యంబుమీఁది కాఁక యుడిగి, యాఁకటఁ బెట్టిన యహియుంబోలె నిశ్వాసంబులు నిగిడించుచు వాసవారాతి నిలువలేక యుద్ధసన్నద్ధుండగుచు నుండె నంత నిక్కడ నాశ్రమంబున, 9

1. సేయు; 2. వైక్లబ్యంబు· 3. యన; 4. నేరుపును, నోరుపును.

గీ. ప్రథమసవనక్రియలు సుసంపన్నమైన
మునులు భూపాలుఁ బిలిపించి జనవరేణ్య
యక్షతంబైన భవదీయరక్షణమున
నధ్వరము సాఁగె నంతరాయంబు లేక. 32

చ. అలసితి వెంతయేనియును నాఁకలి గొంటి వటంచుఁ దేనెలు
వ్ఫలములుఁ దెచ్చి యిచ్చి, సవనక్రియ మాపటిదాఁకఁ గల్గిది
చ్ఛలఁ జని విశ్రమింపు నృపచంద్రమ, పొమ్మని యంప, నత్తప
స్స్వులకు నమస్కరించి, చనఁజూచి విచారము చేసె నాత్మలోన్; 33

ఉ. పోవ ననుజ్ఞ యిచ్చిరి తపోధను లిందు, శకుంతలాముఖ
శ్రీవిభవంబు దర్శనముసేయక పోఁగినఁ గంతుఁ డుగ్రుఁడై
కోవని యార్చి తేఁజిగురుకుంతముఁ గైకొని యడ్డగించునో,
తావులవింట నేయునో, లతాంతశరంబుల గుండె గాఁడఁగన్. 34

సీ. రవులుకొల్పును సన్నఁబోవలతో రాఁజెడు
కామాగ్ని దక్షిణగంధవహుఁడు,
పువుశింజినాదంబు చెవి సూది వెఱపింపఁ
జూచునో మరు పెంటిజోగి తేఁటి,
పరులతోడుత మాట పలు కాడకుండంగ
వాకట్టునో మంత్రవాది చిలుక,
తెరు వడ్డ కట్టంగ మరునికింకరులకుఁ
గూకలు వేయునో కోకిలంబు,
తే. భావజుని చేత నొవ్వక, పవనుచేతఁ
దూలపోవక, యలిచేతఁ దొట్రుపడక
చిలుకచేఁ దాల్మిచెడక, కోకిలము చేత
గాసిగాక, శకుంతలఁ గనుట మేలు. 35

వ. ఈవేళఁ బర్ణశాల నావిశాలలోచన నిలువక తరుసేచనంబు సేయం
బోవు; నేను నచ్చోటికిం జని, 36

నగరాజకోదండు నామాంతరంబులఁ,
బ్రమథాధిపతి బహిఃప్రాణములను,
తే. ఫణికులాధిపధరు నను ప్రాసములను,
దనుజపట్టణభేదను వినిమయములఁ,
బంచబాణారిపట్టము భద్రకరులఁ,
గాశ్యపుని యాశ్రమస్థానకముమునులను. 15

వ. కాంచి రోమాంచకంచుకితగాత్రుండును, నమందానందనిష్యందసలిల నేత్రుండునునై యాధాత్రీకళత్రుం డందఱకు వందనం బొనర్చి, తాఁ దెచ్చిన వన్యఫలధాన్యంబులు ముందఱం బెట్టి, వినయవినమితస్కంధుండై నిలిచిన, మహర్షులు ప్రహర్షులై యారాజర్షభునియెడ నెడ మఱుంగులేని మైత్రియుం, గరుణయుం జేసి యుచితాసనంబున నాసీనుం గావించి, హస్తపద్మంబు లెత్తి, యతనివదనపద్మం బవలోకించుచు, నచ్ఛద్మంబులగు సుధామధురవాక్యంబులం బ్రస్తుతించి 16

సీ. స్వ స్త్యస్తు శశివంశజలధికౌస్తుభరత్న
శ్రీ రస్తు సమరనిర్జితసపత్న
దీర్ఘాయు రస్తు పృథ్వీజనస్తుతశీల
కల్యాణ మస్తు విక్రమవిశాల
ఐశ్వర్య మస్తు ధర్మానోకహస్కంధ
సమధికోన్నతి రస్తు సత్యసంధ
సౌభాగ్య మస్తు సజ్జనచూతవనచైత్ర
విశ్వతో విజ యోస్తు విమతజైత్ర
తే. భూవినుతకీర్తి రస్తు సత్పుణ్యగాత్ర
సంపదభివృద్ధి రస్తు విశ్వప్రశస్త
శక్రవిభ వోస్తు పూరువంశప్రదీప
జగతి భవతశ్చిరాయ దుష్యంతభూప. 17

క. అని మఱియుఁ బెక్కుతెఱఁగుల
మును లభినవవేదమంత్రముల దీవనల

రంబునీడ మవ్వంపుఁదీఁగె యొవరిం బుప్పొడి నొప్పెడి యరుఁగుమీఁదఁ
గెంపెసంగు కిసలయంబులఁ బలుపుగా నమర్చి యచ్చటికిం గొనివచ్చి 40

సీ. కడఁజేకు లొలిచిన కల్హారదళములఁ
దలగడబిళ్ళ లందముగఁ జేర్చి,
మీఁది బల్బెడగిసి మృదువుగాఁ జేసిన
విమలమృణాలహారములు వైచి.
పూఁదేనెఁ బదనిచ్చి పుప్పొడి మేదించి
కలఁగొన మేన జొబ్బిల నలంది,
చలువపెట్టిన క్రొత్తజలజపత్రములను
దోరమ్ముగాఁ జనుదోయిఁ గట్టి,
తే. చరణముల లేఁతచిగురు మోజాలు దొడిగి
కటిభరంబున [1]గురువెలకమరుఁ గట్టి,
పొగడలను బొడ్డుమల్లెలుఁ బొన్నవిరులు
జాల నాలుగుదిక్కుల బడసివైచి. 41

క. అనసూయయును బ్రియంవద
యును గెంపలిరాకుసురఁటి యొయ్యన వేళ్ళం
బెనచిన చామరములు గొని
యనువారఁగ విసరఁ దాప మగ్గల మైనన్. 42

క. అనసూయ ప్రియంవదతో
మనమీచందమున నిన్నమాపటఁగోలె
న్వనితకు శీతలకృత్యము
లొనరించుచునున్నవార ముడుగని పనిగాన్. 43

గీ. నయ మొకించుకయైనఁ గానంగఁబడదు
చలువమందుల శైత్యంబు సంభవిలక

1. గురువేరకమరు గట్టి.

నినుఁడు గుడిచిన నీ రయ్యె నింతి మేన
నంతకంతకు సంతాప మగ్గలించె, 44

క. వెలదికి మన మొనరించెడు
చలువల రవిమేనునైన శైత్యము నొందుం
బలుకులు వేయును నేటికి
వలిగొని వడఁకాడుచుండు వైశ్వానరుఁడున్. 45

ఉ. వేసర కాచరించెదము వేయుఁ[1]దెఱంగుల శైత్యకృత్యము
ల్వేసవిపశ్చిమానిలము వేఁడిమికన్నను [2]వాడి గల్గి తో
డ్తో సముదీర్ణమై యగరుధూపము వెట్టినఁ దావు[3]లుబ్బ ని
శ్వాససమీరణంబు వడచల్లదొడంగఁ గడంగి పైపయిన్.  46

క. చదువుల వినియుండుదు మీ
యదవద విరహప్రకార మని యాపనికి
న్నుదతి కలలోన నెఱుఁగదు
కది సెన్నఁడు వినదు తొల్లి కథలందైనన్. 47

వ. ఇది యేమి మాయయొకదా, తాత కాశ్యపమునీంద్రుఁడునుం జేరువ లేఁడు, మన మీపూఁబోఁడియున్న పోఁడిమియు, నగ్గలత వేడిమియు నే యుపాయంబులం జక్కఁజేయుద, మెవ్వరికిం జెప్పుద, మెక్కడం జొచ్చువార, మేదైవంబుం బ్రార్థింత, మని యనసూయ కన్నీరు నించినం బ్రియంవద యి ట్లనియె, 48

చ. ఎఱుఁగుదుఁ గొంతకొంత యది యే నెఱిగుండియుఁ జెప్పనేల యం
చెఱుఁగనిదానిబోలెఁ జరియింపుదు నిట్టి రహఃప్రయోజనం
బుఱక తమంతఁ జెప్పుట యయుక్తము నేఁ గనుఁగొన్న చిహ్నము
ల్వ్రేఁలవక చెప్పెద న్గినుకలేక శకుంతల సమ్మతించినన్. 49

---

1. విధంబుల; 2. వేడి; 3. లుబ్బి.

క. అని బొమముడియుం బెట్టుచుఁ
గను[1]గిటిన ననుమతంబు గై కొనినదియై
యనసూయ చెప్ప మనుచును
దను నడుగఁగ నాప్రియంవద గభీరోక్తిన్. 50

శా. నీవు న్నేనును జూడఁగా వనములో నిన్న న్మదాళివ్యధన్
దా వర్తింపఁగ వచ్చె రాజొకుఁడవా తద్వేళఁ బాలింద్లపైఁ
బ్రోవు ల్వోసినభంగి ముత్పులకము ల్పుంఖానుపుంఖంబుగా
నూవిర్భూరుచుఁ జూచె భూవిభునిఁ దా నొయ్యారపుం జూపులన్. 51

చ. మనతరళాక్షి సిగ్గుతెరమాటున నుండక దాఁటి దూఁటిపా
టినఁ గదియంగఁ బట్టి యిసిఱింతల చూపులఁ దన్నుఁ జూడఁగా
మనుజవిభుండు ప్రేమ గరిమంబునఁ జూచె లతాంగి నయ్యెడన్
జనుమొన నాడె నాన్నృపతిచంద్రుని చూపులుఁ గంతుతూపులున్. 52

క. అప్పటఁ గోలెను లలనకు
ని ప్పంటినయట్లు మేన నిగిడెడుఁ దాపం
బిప్పగిది నేను గన్నది
తప్పదు నిక్కం బటంచు దాఁపక చెప్పెన్. 53

క. ఆమాటలు విని నృపతికిఁ
గామునిశరనిహతిసైన గంటులు పూడెం
గామాగ్నియుఁ జల్లాఱెను,
గామిని తనమీఁద ప్రేమకలిమియుఁ దెలిసెన్. 54

వ. ఇత్తెఱంగునం బ్రియంవద మృదూక్తులం దత్ప్రకారంబు విరహావికారంబ
కా నిశ్చయించి తన్ముఖంబునం దెలియక ప్రయోజనం బోజపడ నేరదని
యనసూయ శకుంతలం డగ్గఱి కుంతలంబులు దువ్వుచు, నుడుకుచుం
దొరంగు కన్నీరు కపోలంబుల రాలినం దుడుచుచు, మృదుమధురమంద
మందస్వరంబున, 55

1. గిటున.

గీ. తలఁపు వంచింపుదురు తల్లిదండ్రులకును,
చెలులయెడ దాఁచి నిలుపరు చిత్తవిధము
ఇంతి నీకింక నీ కింక యెందు మాను
చెప్పు నాతోడ నాతోడఁ దప్పు గాదు. 56

క. నీకు బహిఃప్రాణములము
మాకె యెఱింగింప వింక మఱి యెవ్వరికిం
గోకనదహస్త చెప్పెదు
దాఁకొని మదిలోననున్న తగులున్నెగులున్. 57

ఉ. లాతితనంబు చేసి యబలా యెఱిగింపక నిల్వనోపుదే
లేఁతలుగాక గుండె లగలించెడు కోయిలదుండగీల పె
న్మూతలు గండుఁదుమ్మెదలగుంపులమ్రోఁతలు లోన నీతలుం
బోతలు నైన యిట్టి తలపోఁతలు గంతునిమీఁకచేఁతలన్. 58

క. రోగంబు పేరెరుంగక
యేగతి నౌషధము శాంతి కీ నొప్పదు నా
లాగున నీ హృదయము నను
రాగము కీ లెఱుఁగకే వెరవు సేయనగున్. 59

వ. ఏనును బ్రియంవదయు నీకుం బర్యాయదేహంబులము, ప్రతిచ్ఛాయలము, మాకంటె నింకనెవ్వరు వశ్యులు వయస్యలుం గలరు నాయాస్యంబు చంద్రాస్య చక్కంజూడు నీ యాశాస్యంబు నెఱింగింపకున్న మమ్మొల్లకుండుట బ్రియంవద ప్రాణంబులకుఁ దప్పినదానవు, నీవు ప్రేమవాటించి పెంచిన మాలతీలత స్వహస్తంబునం ద్రుంచినదాన, వని యానలు వెట్టిన నిట్టూర్పు నిగిడ్చి మగిడ్చిన లోచనంబు లించుక విచ్చి నెచ్చెలివదనంబుఁ జూచి తదీయాంక పీఠంబున వదనపంకజంబు మోపికొని గద్గదకంఠనాళయై యుత్కంఠ నీకుం బ్రియంవద చెప్పినది తప్పదని, 60

శా. గంగాగర్భమునందు నేఁటితుదదాఁక న్నాటరాకుండ నుం
డంగాఁ గల్గెను మీ మొగంబులిఁక జూడన్నాకు మామేది యే

భంగిన్నిల్లు మునీంద్రకన్యకలతోఁ బాటించి మాతండ్రిఁ ద
న్వంగి యేగతిఁ జేరఁబోదు నని యెయ్యి స్వేక్కి వెక్కెడ్చినన్. 61

క. కన్నీరుఁదుడచి గొజ్జగి
క్రొన్నీరున మోము గడిగి కూరిమి వెలుఁగ
న్ననీరజముఖిఁ గౌఁగిటఁ
జెన్నారఁగఁ జేర్చియెలమి చెన్నుదలిర్పన్. 62

క. కోమలి మేనకకును వి
శ్వామిత్రమునీంద్రునకును జనియించిన బా
లామణివి నీవు నీకే
లామునికన్యకలలోఁ గలంకము గలుగున్. 63

ఉ. నీకు విచారమేల మహనీయచరిత్రవు నీ మనంబు గం
గాకమనీయపావనము కల్మష మందగ నేరదెందు మం
దాకిని నిర్ఝరాకృతి నుదారగతిం జనుదెంచుటెల్లర
త్నాకరుఁ బొందఁ గాక యహోహో చననేర్చునె చోటకుంటకున్. 64

గీ. చంద్రవంశోద్భవుండు దుష్యంత విభుడు
నీకుఁ బతియాటకుం దగు నీరజాక్షి
తగుదు వతనికిఁ గౌశికాత్మజవు నీవు
సెట్టి యనుకూలదాంపత్య మిరువురకును. 65

వ. ఆరూఢయౌవనివైన నీకుం దగినవల్లభుండు గలుగ నుమావల్లభుని సేవింపం దాత కణ్వమునీంద్రుండు సోమతీర్థంబునకుంబోయి వ్రతంబు పూని వర్తించుచున్నవాఁ డేతత్కార్యంబు సిద్ధించిన యార్యచరితుం డుల్లసిలుం గాని పుల్లసిలండు చింతయుడిగి, సంతసంబు నొందు మని పల్కి యనసూయ ప్రియంవద వదనంబునం జూడ్కి నిలిపి యిట్లనియె, 66

గీ. అన్నచోటనె నిలిచెలే లేమప్రేమ
తాత వినినను మిగుల సంప్రీతినొందు

ధరణీపతిచిత్త మేమి చందంబొ యనిన
నింపుమీఱఁ బ్రియంవద యిట్టులనియె. 67

క. ఆ విధము నించుకించుక
భావంబునఁ దోఁచె నాన్నృపాలుఁడు నిన్నన్
దావనమునకును వచ్చిన
శేవ దొలంగినది పల్లటిలినది చెలువున్. 68

ఉ. తేఁకువదప్పి దప్పి వడదేఱెడు కన్నులు మున్నువంటి యా
తూఁకువ లేక మేను గడుఁ దూలియయున్నది మోముచందమున్
వేఁకువ చందమామ గతి విన్ననయైనది మన్మథాస్త్రము
ల్దాఁగినభంగి దోఁచు వసుధాపతిఁ గాంచితి యాగశాలలోన్. 69

వ. మృగయావిహారవ్యాయామంబునం గల యలపు సొలుపుంగాదు ప్రసవబాణ [1]తపనవ్యథాజాత సంతాపశ్రాంతియ సిద్ధంబు; ఆ మూర్ధాభిషిక్తునకు శుద్ధాంతకాంతాజనచింతాభరంబొ, శకుంతలాచింతాభరంబొ, నేఁట ఱేపట నెల్లి యెల్లుంట మెల్లమెల్లనఁ దెలిసికొనియెద; నీలోన నిప్పల్లవాధరి ప్రసవభల్లంబుల నుల్లంబు జల్లని యొల్లంబోయి యపాయంబు నొందకుండ నుపాయంబు విచారించుకొనవలయుననిన నవ్వచనంబులు భూవల్లభుండు విని, 70

శా. బాలారత్నము కూర్మి నావలన సంపాదించుట ల్వింటిఁ ద
న్మూలంబైన మనోజతాపములు గన్నుల్లగాఁగంటి నీ
వేళ న్నేఁబొడసూపకున్న మరుఁడే విఘ్నంబు గావించునో
యాలస్యాదమృతంవిషమ్మనెడు వాక్యంబు ల్నుతం జెప్పుడున్. 71

క. ఒప్పనిపని కాలస్యము
చెప్పుదు రింతియు శుభస్యశీఘ్రం బనఁగా
నిప్పలుకు విచారించిన
నిప్పుడ పొడచూపవలయు నిభగామినికిన్. 72

1. పతన.

వ. ఒక్క యుపాయాంతరంబునం గానుపించెదం గాకయని యొక్క యెల మావికి ఛద్మంబున బిసతంతువాగురం బాగుగా నమర్చి యురివేఁటకాని లాగున, శకుంతలంబుల నిరీక్షించుచున్న వాఁడపోలె, శకుంతల యున్న వృక్షవాటి కల్లనల్లన చొచ్చివచ్చుటయు ననసూయాప్రియంవదలు కనుంగొని రాజు విచ్చేసె నని సంభ్రమంబున నాసనంబుల డిగ్గినం జూచి సమ్మదభయవినయకలితలజ్జాసముపేయంబగు రయంబున 73

చ. కిసలయశయ్య డిగ్గి యొకక్రేవ శకుంతల నిల్చియుండఁ ద
త్కుసుమనవాంక మంటుకొని క్రొత్తవిరు ల్గసుపట్టె నెంతయు
న్నొసలిసిడంబువాని పువుముల్కులు నాటినపోటుగంట్లనన్,
రసగిరిపేరఁ బడ్డ రుధిరంబుల యోడికతండమో, యనన్. 74

ఉ. ఆరతి బోఁడి సజ్జచిగురాకులు పైపయినంటి యుండగాఁ
గీరముఖారుణచ్ఛవిని గెల్చి తనర్చిన యంగజాతుశృం
గారపుఁదోఁటలోని నవకల్పకవల్లియొ యంచు రాజు నిం
పారఁగఁ జూచుచుండె మధురోల్లసముగ్ధములైన చూపులన్. 75

క. బాలికఁ జూచుచు ధరణీ
పాలుఁడు పలు కుడిగి ప్రమదభరితుండయ్యెన్
బాలికకును నాధరణీ
పాలకునెడ లజ్జ మౌనబంధము నొందెన్. 76

వ. ఇవ్విధంబున శకుంతలా సౌందర్య సందర్శన సౌఖ్య పారవశ్యంబున రాజును, లజ్జాభయరజ్జుబంధంబున మౌనిగంధగజయానయుఁ, జిత్ర రూపంబు చెలువునఁ, బ్రతిజ్ఞ చేసికొనిన కరణిఁ, కనుఁబోక వెట్టిన చందం బున, మూసిన ముత్తియంబుల వలె నుండ ననసూయ డాయ వచ్చి భూ నాయకున కిట్లనియె, 77

గీ. నిన్న నిచ్చట నీయింతి నిన్నుఁ జూచె
చూచుటయె తప్పుగాఁ జూచి సూనబాణుఁ

డింతగాఁ జూచె విచ్చేసి తింతలోనఁ
గ్రంతగాఁ జూచుఁగా కింకఁ గాంత మరుఁడు. 78

ఉ. జాతకృపావిభూతి మదసామజయానను దేవయాని మీ
తాత వెడల్చి తెచ్చె భయదంబగు కూపములోన నుండఁగా
భూతలనాథ నీవును బ్రభూత దయ న్వెడలింతుగాక నేఁ
డీతరళాయతాక్షిని రతీశుఁడు ద్రోచిన తాపకూపమున్. 79

చ. అనిలము, రోగముం, గఱువు, నగ్నియుఁ, దోయము, దైవికంబులై
చనుఁ దనవారుఁ, జోరులును, శాత్రవులుం, బయివారుఁ, జేయు పీ
డనములు మానుపంబు లగుటం బతి వంపని యీద్వివర్గము
న్మనమునఁ గాంచి నేర్పుమయి మాన్పుట యొప్పుఁ బ్రజాభివృద్ధికిన్. 80

వ. ఈయర్థంబున మారుండు చోరుండు, మామానిని మానధనంబు ముచ్చిలి తెచ్చి మీ కిచ్చిన చోరుండు భవత్సమీపంబునన యున్నవాఁడు, స్త్రీధనంబులు రాజుల కగ్రాహ్యంబు, లింతిసొమ్ము మగుడ నిప్పించి, యశస్కరుండవై, మదనతస్కరుని శిక్షించి, విచ్చేయు మనిన, మందస్మిత వదనారవిందుఁడై, యయ్యైందువంశసంభవుండు విస్రంభగంభీరంబుగా నిట్లనియె, 81

గీ. మొదలు మాధైర్యధనములు ముచ్చిలించి
యించువిలుకాఁడు దొంగ మీ యింతి కిచ్చె
నేము కోవెలపులుఁగుచే నెఱుఁగుటయును
గుదువ మా కిచ్చె మీయింతి హృదయధనము. 82

క. మాసొమ్ము మాకు నొసఁగిన
మీసొమ్ము స్మికు మగుడు మీమాసొమ్ము
ల్వాసివడకుండ నూరక గోసన
యేమిటికి మార్చుకొనియెద మొండెన్. 83

గీ. ఇందులో నిష్ట మెద్ది మీ యిందుముఖికి
నడుగుఁ డెడమాటలకుఁ బ్రొద్దు నిడివి లేదు

సాయమవసానమైనను సహనరతు
కొదుగవలెఁగాని యింకిట నుండఁగాదు 84

మ. నయశాస్త్రంబులు మీ రెఱుంగనివి యెన్నం గల్గ వింతు ల్మనః
ప్రియుపీక్షింపఁగ దాస్వయంవరము కల్పింపంబడె న్మీకు మా
కు యశోహానులు లేవు కౌతుకము మీకు న్గన్కనింగల్గెనే
నియుఁ గావింపుఁడు మాకుఁ గోర్కులు మది న్నిండార గాంధర్వమున్.

వ. వివాహంబులు బ్రాహ్మ్యంబును, దైవికంబును, గారుడంబును, ప్రాజా
పత్యంబును, రాక్షసంబును, నాసురంబును, గాంధర్వంబును. పైశాచి
కంబును నను నెనిమిది తెఱంగుల బ్రవర్తిల్లు, నందు క్షత్రియులకు,
గాంధర్వంబును, రాక్షసంబును ముఖ్యంబులనిన నృపముఖ్యుని వాక్యం
బులు శకుంతలవయస్యలు విని వినయంబున ని ట్లనిరి. 86

చ. జనవర నీవు చెప్పినది సత్యము నీమది దుష్పథంబునం
జనమియు నే మెఱుంగుదుము సర్వవిధిజ్ఞుఁడు కాశ్యపర్షి యు
న్మనమున నొందు హర్షము నమర్షము నొందఁడు మాకు నీప్రయో
జనము శుభంబెయైన నొక సంశయ మున్నది మానసంబులన్. 87

వ. అది యెట్టి దనిన, 88

క. వేఁటమయి వచ్చి నృప మా
చోఁటికిఁ జిట్టంట్లనంటి పోయిన పిదపన్
దాఁటుపడుం గులమునకును
మాఁటయుఁ గణ్వునకు వచ్చు మౌనులచేతన్. 89

ఉ. మాతరలాక్షిపైఁ గలుగు మక్కువ నిక్కువ మయ్యేనేని యో
భూతలనాథ యీతలిరుఁబోఁడికి నీకునుఁ బుట్టుపుత్రుఁ బ్ర
స్ఫితిగ యౌవరాజ్యపదపీఠమున న్నిలుపంగ సత్కృపా
స్విత్తుఁడవై మనోజ్ఞమహనీయముగా శపథంబు నీఁదగున్, 90

క. అనవుడు నవ్వనితలతో
జనపతి యీపనికి నేల సందేహము నా

ఘనలక్ష్మికిఁ గాశ్యపముని
మనుమనికంటెను మఱొకఁడు మాన్యుఁడు గలఁడే. 91

సీ. నిజముగా నీకోటి నెలఁతపైఁ గూరిమి
గలుగు నాయంతరంగంబు సాక్షి,
కలహంసకీరకోకిలములు గొలువ నో
లగమున్న యీవనలక్ష్మి సాక్షి,
కుధరకన్యానాధకోటీరరత్నంబు
చంద్రుండు మాకులస్వామి సాక్షి,
యలికలోచనమూర్తియైన కాశ్యపమహా
మౌనీంద్రు పాదపద్మములు సాక్షి,
తే. సారసత్యచరిత్రలు మీరు సాక్షి
యీలతాంగికి సుతుఁ డుదయించు పుణ్య
మేను జేసిన నతని నాయేలు సకల
సింధునేమికి యువరాజుఁ జేయువాఁడ. 92

వ. అని యివ్విధంబున నవ్విశ్వంభరాభర్త విశ్వాసంబు చేసిన విశ్వామిత్ర పుత్త్రిం దెచ్చి గాంధర్వం బమంత్రకంబు గావున నారాజు హస్తంబునకు నారాజనదనకరసరోజం బిచ్చి శచియు శతమన్యుండు, శరధికన్యయు శార్ఙ్గపాణియు, శైలరాజకన్యయు శశాంకశేఖరుండునుంబోలె శశివదన శకుంతలయు శశికులావతంసంబు దుష్యంతుండును ననుకూల దాంపత్యసౌఖ్యంబు లవిచ్ఛిన్నప్రీతి ననుభవింపుదురుగాక యని యన సూయాప్రియంవదలు దీవించి వాసనాప్రసవముకుళంబుల నిరువురి శిరంబులం జల్లి పల్లవతల్పంబునకుఁ గొనిపోవునెడ. 93

సీ. ప్రళయసంధ్యానటత్ఫాలాక్షడమరు
[1]కోచ్చండనిర్ఘోషంబు బెండుపఱచి,
మందరాచలమహామథనవేళాగుంభ
దంభోనినాదంబు నపహసించి.

1. గూ.

గిరిగరుత్ఖండనక్రీడాసమారంభ
దంభోళిరుదితంబుఁ బ్రస్తరించి,
పుష్కలావర్తకాంభోదరోదర
గళన్నిర్ఘాతరావంబు నీచపెట్టి,
తే. వరుస దిక్కుంజములఁ బ్రతిధ్వనులు చెలగ
నాశ్రమారణ్యముల నెల్ల నాక్రమించె
మునులు భీతిల్లఁ గాళికాముఖమహోగ్ర
భూరిసన్నాహసమర భేరీరవంబు. 94

స్రగ్ధర. అనిర్ఘోషంబుకంటెన్ [1]హారదురుగతి మున్నాడి యొక్కంత నార్తి
ధ్వానంబు ల్మౌనిరాజీవదనభవములై వచ్చె నస్మత్తపోర
ణానిష్ఠాలోలహేలాసమరవిజయ దుష్యంతభూపాల రక్షః
కీనాశు ల్వచ్చి రుద్యత్క్రియఁ దపసులరక్షింపు రక్షింపు మంచున్. 95

గీ. పిశితభోక్తల నిష్ఠుర భేరిరవము
నధికభీతమునీంద్రుల యార్తరవము
గోపకారుణ్యరసములు గుదిగొనంగ
నపరరావంబు భూవిభుఁ డాదరించి. 96

సీ. సౌధాగ్రరత్నపంజరముల రంజిల్లు
రాజకీరమనోజ్ఞరవముకంటె,
భోగినీనఖరాగ్రముల మోహనంబైన
వలమానవీణారవంబుకంటె,
గలకంఠకంఠులు కలరవంబులు గొల్పు
రమణీయసంగీతరవముకంటె,
చామరగ్రాహిణీజనముల కరరత్న
వలయమంజీరరావంబుకంటె,
తే. మందిరోద్యానకాసారమధుపచక్ర
వాకకలహంసమధురరవంబుకంటె

1. హారి.

నుత్తమతత్రకులజులు చిత్తగించి
యాదరింతురు కరుణతో నాత్తరవము. 97

వ. ఇత్తెఱంగునఁ గురంగాంకకులమహీభర్త మహర్షుల యుత్తరవంబు విని ముహూర్తమాత్రంబును దడయక, తదీయరక్షార్థంబు రక్షోవరులపై నడువ సమకట్టి, శకుంతలవదనం బవలోకించునప్పుడు, 98

ఉ. తాఁ గదలంగ, బాష్పముల ధారలునుం గదలంగ, నింతి దా
నాఁగకయున్న దుశ్యకున మానని ఱెప్పల నప్పళింపఁగాఁ
దోఁగిన యశ్రువారిఁ గనుదోయిభరంబయి యొప్పె నెట్టిగాఁ
గ్రాఁగిన సిక్తతోయమగు కాయజుసాయకయుగ్మ మోయనన్. 99

క. ఆవేళ శకుంతలతో
నీ వేల లతాంగి యింత నెగులువడంగా
నావేలము సమయింతును
నీవేశం జిటికె వేసి నిలిచినమాత్రన్. 100

క. నాలావుకొలఁది నెఱుఁగక
బాలా వెఱచెదవు కోణపనికాయముపై
కోలాహలముం జేయుదు
హాలాహలధరుఁడు వచ్చి యడ్డంబైనన్. 101

క. అని తేర్చెఁ బ్రియంవదయును,
ననసూయయు విభుని జేరి యట్టిట్టన రా
క నిరీక్షింప నతని మే
లునకుం దమసఖికి వామలోచన మదరన్. 102

గీ. కాంచి మనములుఁ గడుఁ గౌతుకంబు నొంది
యాశకుంతలతోడ నోయలరుఁజోడి

1. యరుణంబయి.

జయ మవశ్యంబు నీనిజస్వామి కవును
నగుమొగంబున ననుచు భూనాథుఁ జూచి. 103

ఉ. హ స్తినిశాటభంజనుఁడు, హైమవతీరమణుండు, దేవతా
మ స్తకరత్నపుంజరుచిమంజులపాదసరోరుహుండు, లో
క స్తవనీయధాముఁడు, జగన్నుతుఁ డాత్రిపురాంతకుండు, దా
స్వ స్తి యొనర్చుఁగాత! విలసత్కరుణామతి దానవాజిలోన్. 104

వ. అని యాశీర్వదించి సమ్మతింప సమ్మహీవరుండు వనబహిరంగణంబునకు సారథి యెదురుతెచ్చిన స్యందనం బెక్కి యొక్కరుండును నుక్కుమిగిలి త్రిపురాసురవీరులపయిం జను ఫాలలోచనుండునుంబోలె నాలంబునకు నడచునెడ, 105

సీ. జడ లూడి యహులకై వడిఁ జిక్కుఁజీరుఁగా
నవనిపైఁ బడి పొరలాడువారు
పదిహైదునంజల పరువెత్తి చనలేక
దగదొట్టి పెదవులు దఁడుపువాఁరు,
గంపతాఁకుల జీరుగంటులై వీఁపులఁ
జీర లంటగఁ బొద ల్దూఱువారు,
నెటకుఁ బోవఁగలేక యుటజకోణములలో
నొఱిగి యూరుపు పుచ్చ వెఱచువారు,
తే. లేఁటిఁ బొడఁగని వెస బాతశించువారు
నైన మునులను జూచి హస్తాబ్జ మెత్తి
వెఱ వుడుగుఁ డోడకుఁడు భ్రమ విడువుఁ డనుచు
నంచితాలాపముల భీతి నపనయించి. 106

క. యాగము గొదవడకుండగ
సాగింపుడు యుష్మదీయసవనానలకుం
డాగతవినీలధూమస
మాగమమున దనుజమశకమండలి ద్రుగ్గన్. 107

క. అని తేర్చి యనిలరయమునఁ
దనయరదము నరఁగనిచ్చి దౌదవ్వుల న
ద్దనుజులఁ గనుఁగొని రిపుఖం
డనచండభుజుండు విలుగుణ ధ్వనిచేయన్. 108

మ. చెలిమిం [1]జేసెఁ దదాహవస్థలమునం జృంభించి యాచంద్రమః
కులభూపాలకబాహుదండవిలసత్కోదండటంకారము
న్గలిశారావగభీరభైరవమహాకోపాగ్రహుంకారము
ల్ప్రళయారంభనటత్కృతాంతపటహప్రత్యగ్రభాంకారముల్. 109

క. ఆరావము దమకుం గ
ర్ణారుంతుదమైన దానవాధిపుఁ డనిపెన్
భూరమణుమీఁద దిక్కరి
సారుల మాకందశరభసైన్యాధిపులన్. 110

ఉ. వారును నేగుదెంచి జనవల్లభుపై మిహిరాంశుతీవ్రకీం
శారుపరంపర ల్వఱపఁ జంచలమొంద[2]క వజ్రదీప్తిమ
ద్దారుణబాణయుగ్మముల దారితకంఠులఁ జేసి వీరల
క్ష్మీరమణీయభూతబలికి న్బలు గొఱ్ఱెలఁ జేసె నిద్దఱన్. 111

క. మాకందశరభులిద్దఱు
నీకరణిని సమరధరణి నీల్గుట విని యా
రాకాసి ఱేఁడు కుపితయ
మాకారత నగ్నికణము లతుల రాలన్. 11

శా. ఏమేమీ మఖరక్షకు న్మనుజులు ధాత్రీశాధముం దెచ్చి సం
గ్రామక్రీడకు నొడ్డిరే మఱచిరో కా కాత్మలం గర్జదం
భోమత్కల్పనిశాటవీరసుభటస్ఫూర్జద్భుజాకార్ముక
జ్యాముక్తాతికఠోరసాయకమహాశంబాళిసంబాధమున్. 113

1. జేసి తదా; 2. కమంద దీప్తిమందారిత.

వ. మాకందశరభు లిద్దఱువడ్డ నేమి తప్పె దర్పకారాతి యేతెంచిన, జక్ర ధరుండు విక్రమించిన, ఱిచ్చవడని తొలి వియచ్చరకోటి సేన లెచ్చటికిం బోయెనని నిర్నిద్రనిర్నిరోధక్రోధంబున నసురనాథుండు సుభటయూథంబు నాయోధనంబునకుం బనుప వారునుం జని యుద్ధ్రతభేరీఖాంకృతులును, జటుల మదకరిఘటాఘీంకృతులును, దురగహేషాహీంకృతులును, గుండలిత కఠినకోదండజ్యాలతాటంకృతులును, బదాతి నదనాదసాహం కారహుంకృతులును, నబ్జజాండకటాహంబు చివ్వలసందు వాపం గోపంబు పెక్కురూపంబులుగఁ గొన్నవిధంబున వీరంబు బహుశరీరంబు లెత్తిన చాడ్పున మూఁకం గొని వేఁకనిడమి నాకంగొనక వీఁక నొక్కూఁకువం గరిపురాధీశ్వరుండు దాకి నల్లగిరులుంగొను నొడళ్ళకాంతులు మొయి ళ్ళును, విస్ఫూర్జితాట్టహాసంబులు గర్జారవంబులుగ స్యందనప్రభాపుంజం బులు మెఱుంగులుగా నంపవానలు ముంపఁ జలింపక నిలింపపతి సత్వ సారుండై యొకవీరుండు విల్లుం దెగఁగొని వాలంపవెల్లువ పెల్లుగాఁ బఱపినం బసని యశనిరోచిరుద్భల్లంబులగు మనుజవల్లభు భల్లంబులం గృతాంతపురపథికులగు రథికులును, విశ్లథంబులగు రథంబులును, వికర్త నతనయకింకరహృత్తులగు వీరరాహుత్తులును, విగతత్రాణంబు లగు ఖత్తుబాణంబులును, విస్తీర్ణజీర్ణాంగంబులగు మాతంగంబులును, విన్యస్త దైన్యంబైన సైన్యంబును, విస్రస్తంబును, విధ్వస్తంబును, విటతాటం బును, వీరాకులవిదళంబునుం గావించి విలోకించిన, 114

చ. అఖిలజగద్విరోధికులహారపరాయణుఁ డుల్లసచ్ఛిఖా
శిఖసఖఖడ్గపాణి రవిజిహ్వుఁడు విస్ఫురితారిమండలీ
ముఖరులు వీరశేఖరులు ముప్పదికోటులు ముఖ్యనాయకు
ల్సఖులునుబోలె నుండ బలసంపదుపేతుఁ డభీతుఁ డాజులన్. 115

సీ. తురగరింఖాముఖోద్ధూతధూళీపాళి
నభ్రగంగానది నడుసు రేగ,
అసితశస్త్రజ్యోతు లాశాధినాథుల
యిండ్లముందఱ నీరెండ గాయ

దంతిసంతానదుర్దాంతఘీంకృతులచేఁ
　　　　జెవులు జుమ్మనుచును జిట్టువోవ
విపులసైన్యవధోగ్రవిన్యాసరవమున
　　　　నుర్వి పట్టదలి యుట్టూత లూఁగఁ
తే. గుండలీకృతచారుకోదండదీర్ఘ
నిష్ఠురజ్యారవంబుల నింగి పగుల
విక్రమాభిక్రమంబున నాక్రమించి
రభసమున వచ్చి దుష్యంతవిభునిఁ దాఁకె. 116

ఉ. తాఁకి పరేతరాజవరదత్తములైన మహోగ్రబాణముల్
ప్రేఁకని వీఁకతోఁడ బృథివీపతిపై నిగిడింప నాతఁ డ
క్కాఁకకు నోర్వలేక యలుకం బిశితాశనభర్తవక్షముం
దాఁకఁగ నేసె శాత్రవవిదారణదారుణవారుణాస్త్రముల్. 117

క. వారుణబాణమునకుఁ బ్రతి
కార మెఱుంగక సురారిగతజీవుండై
ధారుణిఁ బడెఁ బవిధారా
దారితమై పడిన గోత్రధరుచందమునన్. 118

వ. రవిజిహ్వుఁడు వారుణబాణపాతంబునం బ్రేతపతిపురంబునకుం బోయినం గనలి కాళికాముఖుండు క్రోధపాటలముఖుం డగుటయు, పాటలవర్ణ మానాశి మర్త్యాశిత్రయం బగ్నిత్రయంబు ననుకరించి లోకత్రయదాహ కులై ప్రచండవేగంబున నేనుంగుపురాధిపు నేన నేన సంహరింతు నని పంతంబు లాడుచు నారాజసింహంబుపయిఁ గదిసిన, 119

శా. సంగ్రామంబున కుత్సహించుటయు నాజ్యాభర్త కల్పాంతవే
శం గ్రీడించు లులాయవాహనునికేలం గ్రుద్ధుఁడై యుద్ధసీ
మం గ్రోధాగ్నికిఁ జేసె నాహుతులుగా మానాశిమర్త్యాశి పే
శృం గ్రూరాకృతిఁ గ్రాలు దానవుల ఖేలద్బాణయుగ్మంబునన్. 120

గీ. పార్థు వలిద్దఱు నబ్భూమిపాలు
నిశితబాణయుగమున నిర్గతప్రాణులైన
దూర్ణముగ వచ్చి పాటలవర్ణుఁ డేసె
నవనిపతిమీఁద నైంద్రజాలాశుగంబు. 121

క. ఆయింద్రజాలబాణము
మాయావిధ మేమి చెప్ప, మహనీయంబై
యాయోధనసీమ మహీ
నాయకు కన్నులకు మునివనంబై తోఁచెన్. 122

మ. కకుబంతంబులు ముట్టి మ్రోయుచుఁ బరీక్షావేదఘోషంబుఁ దా
నొకచో నధ్వరతంత్రమంత్రనినదం బొండొక్కచో స్మార్తక
ర్మకలాపారవ మొక్కచో లలితమీమాంసానినాదంబు వే
ఱొకచో యుద్ధవిజృంభణం బుడిగి యయ్యుర్వీశ్వరుం డుండఁగన్. 123

క. ఆరాక్షసమాయాస్థితి
సారథి యెఱిఁగింపఁ దెలిసి సారాస్త్రమున
న్వారించి యొక్కతూపునఁ
బోరుం డిల గూల నేసెఁ బాటలవర్ణున్. 124

శా. క్రవ్యాదుం బరిమార్చి యెంతయును నుగ్రంపకుప్యుఁడై నిల్చి వా
యవ్యాస్త్రం బరివోసి యేయుటయు వాత్యావేగవిస్ఫూర్తినా
ర్తివ్యాహారము లుప్పతిల్ల నుడువీధిం గొండ్లియాడించె దై
త్యవ్యాధు ల్తెరబొమ్మలట్ల నిగుడం దా[1]నాటకాఁడుం బలెన్. 125

స్రగ్ధర: ఆజన్యంబందు నిమ్మై నఖిలదనుజవీరాతివీరోగ్రసారు
ల్లాజన్యాస్త్రాళిచేత న్రణమునఁ బడిన న్రాక్షసాధీశుఁ డేఁగెన్
రాజన్నాసీరవాజివ్రజఖురజరజోరాజి ఘోరాజిభూమి
న్రాజీవాప్తుం గ్రహింప న్నభసమునఁ బయోరాసుల న్సంగ్రహింపన్.

1. వేఁట.

వ. ఇట్లు సంరంభవిజృంభమాణుండై కాళికాముఖుండు బర్హిర్ముఖవిరోధి దిశాధికముఖంబులం జలింపఁ బంచదశాక్షౌహిణీయుక్తుండై మూర్ధాభిషిక్తునిపయిం గవిసిన నసి, ముసల, భిండివాల, ముద్గర, తోమర, ప్రాస శరాసన, ప్రముఖ నానావిధ ప్రహరణంబులం గుప్పించినం, దప్పించుకొనుచు నుప్పరవీధికిం దత్తటిల్లతలం గల్పించు పోలికఁ గనకపుంఖశిలీముఖంబులువఱపియాకసంబునం [1]గనకసంఘంబువోలెనల్లగరులశరంబులు దట్టంబుగనేసియు, విహాయసంబునకు రాయంచకదుపు లెగయుచందంబునం దెల్లపింజెల భల్లంబులేసియు, మహానక్రంబు సముద్రక్రోడంబునుంబోలె విక్రమాభిక్రమంబున నుక్కుమిగిలి, యాశరకారిసేనానక్రాకరంబుఁ జొచ్చి, శోధించి, కలంచి, కలగుండుసేసి, మట్టి, మల్లాడి వెరఁజి. వెంపరలువెట్టి, వచ్చిపోయిన తెరువెఱుంగరాక యెక్కడఁ జూచిన రథమయంబై, యేవంకఁ జూచిన దుష్యంతమయంబయ్యును నేనిశాచరుం జూచిన శరమయంబయ్యె, నుండె నట్టిబెట్టిదంపు మోహరంబున, 127

చ. తొడుగుట కానరాక వెసతోడన యేయుట కానరాక పై
వెడలుట కానరాక యుదువీధికిఁ బోవుట కానరాక య
య్యొడువిభువంశసంభవుని యుగ్రశరంబుల దైత్యమస్తము
ల్వడుటయు రక్తవాహినులు వాఱుటయుం గనవచ్చె నాజిలోన్. 128

గీ. హస్తినాపురరాజశరవాతహతిని ద్రెళ్ళి
రాసులై యుండె సంగ్రామరంగమునకు
నరిది ప్రోవులు వేసిన నల్లవేటి
తాటికాయలగతి దైత్యతతుల తలలు. 129

ఉ. అట్టులు ద్రెంచి దానవుల నాహవభూమి విభుండు గూల్చినం
గొట్టెలఁ దెచ్చి జాతరకుఁ గోసినపోలిక నుండె మేదముం

1. కాక సంఘంబు.

ఱుట్టుచు మాంసము ల్చవులు చూచుచు భూతము లుండె నాజిలో
గట్టునఁ దేన్చుచుం జయముగాథలు పాడుచు సోలియాడుచున్. 130

వ. ఇవ్విధంబున నుండె నంతట, 131

క. బలమెల్లఁ దెగిన నిజదో
ర్బలముం జలముం బ్రతాపపావకుఁడును సు
జ్జ్వలశస్త్రాస్త్రంబున నిజ
బలముగ నెదిరించె దనుజపతి నరపతితోన్. 132

శా. నిన్ను న్మించితి సైన్యము ల్పోరుగుపోనీ దీన నా కేమియున్
విన్నంబాటు ఘటింపనేరదు సురానీకంబులం బోరుల
న్వెన్ను ల్దన్నిన నన్ను మార్కొనెడుచో వీర్యం బవార్యంబుగా
సన్నద్ధుండవు గమ్ము చూపు నిజశస్త్రప్రౌఢియు న్మూఢియున్. 133

మ. అనినం గొండొక నవ్వి యేల యిటు వీరాలాపము. ల్మద్భుజా
ఘనకోదండము కాలదండము, భవత్కావ్యంబు నవ్యంబు, భూ
తనికాయంబున కిత్తుఁ, బోవిడువఁ, బాతాళంబు భేదించి చొ
చ్చినఁ, జక్రాంకుఁడు తోడు వచ్చిన, మహాశేషుండు దా వచ్చినన్. 134

క. అని వీరోక్తులతోడన
యని సేయఁ గడంగె మానవాధిపు డచ్చో
మనుజాధిప దనుజాధిపు
లనువొందిరి రామరావణాకారములన్. 135

ఉ. ఉల్లంబు ల్రణకౌతుకంబున సముద్యోగించి సామ్యంబులై
యుల్లాసంబులు వీరరేఖలును నుద్యోగింప నొక్కంతలై
భల్లాసారము పెల్లుగా వసుమతీపాలుండు దైత్యుండు శుం
భల్లీలాగతిఁ బేర్చి మార్కొనిరి ప్రాబల్యంబు తుల్యంబుగన్. 136

గీ. దనుజశరములు భూభర్త దునుము, నృపుని
శరము లమరారి దునుము నయ్యిరువురకును

జయము నజయంబు నవ్యవస్థంబు లయ్యెఁ
దూచి వేసినగతి నుండె దోర్బలములు 137

క. ఈకరణి ధనూరణ ము
స్తోకగతిఁ జేయుచుండి దోర్బలమొప్పన్
భూకాంతుఁడు నొస లేసెను
భీకరబాణమున నసురు పెడతల వెడలన్. 138

మ. సురవిద్వేషి తదస్త్రపాతమున సంక్షోభించి యొక్కమ్మున
న్నరలోకేశు నురోవిభాగము వడి న్నాటించి యాజమ్ములం
గరము ల్సాయకస ప్తకమ్మున [1]బరు ల్గట్టంగ బెట్టేయ నా
ధరణీనాథుఁడు లెక్క సేయక తదుత్సాహంబు దాహంబుగన్. 139

క. అక్షుద్రశితశరంబులఁ
బ్రక్షుభితుం డగుచు నేసి ప్రధనక్రీడ
న్వీక్షింపు మనుచు రాక్షసువక్షము
జయలక్ష్మికిని గవాక్షము చేసెన్. 140

గీ. ధారుణీపాలుఁ డేచిన దహనతీవ్ర
సమశిలీముఖముల వేఁడి జాల నొచ్చి
దర్ప మెడలక విలుగుణధ్వని యొనర్చి
భీకరధ్వని దిక్కుల పెకల నార్చె. 141

సీ. పలలాశివిభుఁ డేసె బైశాచబాణంబు
భైరవాస్త్రంబు భూపాలుఁ డేసె
వ్యాళకులాస్త్రంబుఁ గాళికాముఖుఁ డేసె
గరుడభల్లం బేసె నరవరుండు
పావకాంబకము విభావరీచరుఁ డేసె
శశికులీనుం డేసె జలశరంబు

1. గరుల్గట్టంగ.

తిమిరప్రదర మేసె దితినందనుఁడు భాను
సాయక మిభపురస్వామి యేసె

తే. నామహారాజుచేత దివ్యాస్త్రనిచయ
మచటఁ దోడ్తోన ప్రతిహత మగుటఁ జూచి
తనకు నంతకుచే వరదత్తమైన
తీవ్రశక్తిం బ్రయోగించి తివురుటయును. 142

మ. శరదర్కద్యుతికర్కశాంశువగు నాశక్తి న్నివారింపఁగా
శరము ల్గానక యేసె దానవునిపై సంధించి బ్రహ్మాస్త్రము
న్సురవైరాకరసైన్యనాథసుషమాశుద్ధాంతకాంతాసుదు
ష్కరవైధవ్యమహావ్రతప్రకటదీక్షాసత్క్రియాశస్త్రమున్. 143

గీ. ఆహవక్షోణియందు బ్రహ్మాస్త్రవహ్ని
విస్మయంబుగ సురవైరి భస్మమయ్యె
త్రిపురఘస్మరు నిటలాక్షి తీవ్రవహ్ని
భస్మమైనట్టి సంకల్పభవుఁడువోలె. 144

క. దనుజుఁ బరిమార్చి యందఱి
కిని దానవబాధ దీర్చి కృతకృత్యుండై
మునిజనములు హర్షింపగ
జననాయకమౌళి విజయశంఖం బొత్తెన్. 145

క. ఆవేళ వచ్చి మౌనులు
పావనమంత్రోదకములు పైఁ బ్రోక్షింప
న్భూవరు మేనికి శిశిరసు
ధావర్షంబై రణవ్యథన్ హరియించెన్. 146

వ. ఇట్లు సంజీవనమహితమంత్రజలంబులచేత బ్రభూతంబైన యాతుధాన శాతశరజాతవ్యథ నపనయింపంజేసి, మునీంద్రు లతనితో మాభాగధే యంబున నిచ్చటికి విచ్చేసిన కతనంబున, యాగంబు సుప్రయోగంబుగాఁ జాగె, నీకాళికాముఖుండు పాకశాసన, పావక, పరేతరాజ, పలాశి, పాశి, పవన, పౌలస్త్య, పన్నగాభరణులకు నజేయుండు, వీడు భవదీయ

బాహాదండకోదండకాండప్రచండ శిఖిశిఖాముఖంబున [1]భస్మీతుం డయ్యెఁ గావున నేతత్క్షణంబునుండి రక్షోభయం బెన్నటికిని సునయంబయ్యె మా జపతపోనిష్ఠానుష్ఠానంబుల షష్ఠాంశంబుఁ గొనం గర్తవు, కీర్తనీయచరిత్ర జగద్ధితకీర్తివై, మీవంశకర్తలగు చంద్ర, సౌమ్య, పురూరవశ్చక్రవర్తులం బోలి, యేకచక్రంబుగాఁ జక్రాచలమధ్యమహీచక్రం బవక్రంబగు విక్రమంబున నప్రతిపదంబగు ప్రతాపంబున, ననశ్వరంబగు నైశ్వర్యంబునం బరిపాలింపుమని యాశీర్వదించి యనుప ననుపమాన భయభక్తితాత్పర్యంబుల మునివర్యులకు నృపవర్యుండు నమస్కరించి, వీడ్కొని విడిదలకు నరిగి మజ్జనాదికృత్యంబులు వెడవెడం దీర్చి శకుంతలావలోకంబునకు లోకలోచనుం గనుంగొనునప్పుడు 147

క. బింబఫలకాంతి రవిబిం
బం బరుణద్యుతి వహించెఁ బాశధరాశా
స్తంబేరమకంఠచ్యుత
జాంబూనదఘంటవోలెఁ జరమాద్రిపయిన్. 148

మ. మునిదత్తార్ఘ్యపయఃప్రహారకులిశంబు ల్దాకి మందేహదే
హనితాంతస్రుతరక్తధార చెలువంబై పశ్చిమాశాతటిం
గనుపట్టె న్నెఱసంజచాయల రుచు ల్గాంతించి యచ్చోటికిన్
జను కాకోలకులంబునా దెసల నోజం జీఁకటు ల్గ్రమ్మఁగన్. 149

ఉ. జారులు చోరులు న్మిగుల సంతస మందఁగఁ జక్రవాకము
ల్దారలఁ దారు నశ్రుజలధారలు గ్రమ్మఁగ నుమ్మలింప నిం
డారె నజాండభాండమున నంతకశాసనకంధరాంతర
స్ఫారవిశాలకాలరుచిబంధురబంధుమదంధకారముల్. 150

క. పాటిగ మిఱుఁ బల్లం బె
వ్వాటేమియు లేక కానఁబడె నీలశిలా

1. భస్మీతుండయ్యె.

పేటియు, నదినిండఁగ నిడు
కాటుకయుం, బోలెనై జగంబును దమమున్. 151

ఉ. నాలుగుదిక్కులందును ఘనంబుగఁ బర్విన చీకటుల్ జగ
ద్గోళము నిండి దృష్టికి నగోచరమై వెసఁబర్వుచుండగా
నీలపటంబుమీది విపణిం బచరించిన ముత్తియంబులం
బోలి వెలింగె నంతట నభోవలయంబునఁ దారకావళుల్. 152

వ. తదనంతరంబ. 153

మ. కుముదోజ్జీవనమంత్ర, మంగజభుజాకోదండగర్వంబు, సం
తమసా[1]నేపకకూటపాకలము, జ్యోత్స్నావర్షివర్షాపయో
దము, పాంథవ్రజచిత్తశల్యము, నిశాధమ్మిల్లబంధూకగు
చ్ఛము, ప్రాచీనగళ్ళంగవీథిఁ బొడిచెం జంద్రుండు సాంద్రద్యుతిన్. 154

సీ. పాంథలోచనవారిఁ బదనీ నమర్చిన
సంతప్తపరశువు కంతునకును
బ్రాచీదిశాపతి పావడ బనిచిన
మవ్వంపు జిగురల్లి మన్మథునకు
నాత్మప్రతాపాగ్ని యవతార మొందఁగ
నంగారఖండ మనంగునకును
గౌముదీజలధి వేడ్కకు నీఁడఁదెచ్చిన
పవడంపుఁ గుంభంబు భావజునకు.

తే. ననెడు విచికిత్స జనులకు నావహిల్ల
జక్రవాకము లెడఁబాయ, జారసతులు
డాయ, నబ్జవిలాసంబు దాఁపరీడు
ప్రాచి కొనరించెఁ గుసుమపూబంతి చెలువు. 155

గీ. అంతఁ జూఁజూడఁగా రాగకాంతి విడిచి
యల్లనల్లన యుడురాజు తెల్లనయ్యె

1. నేకప.

రాగి బలుగట్టిసుకసప్రయోగమునను
ధాతువాదిచే రజతమై తనరినట్లు. 156

గీ. గరళమునకింత [1]మిన్న నక్షత్రనాథుఁ
డరయ నొకపాటిగాఁడు దోషాకరుండు
ఒడలుగందినయది యింత నోపరాక;
[2]కవియునోయని పద్మిని కన్ను మొగిచె. 157

క. కాళహరవాసకుముదా
కాశనదీడ్వీరదరదనకరకాహిమనీ
కాశమయి యాసలం దవ
కాశము లేకుండ నిండి కౌముది కాసెన్. 158

మ. కలయం జంద్రికసోకఁ గర్ణికలు బొంకం బెక్కి యంతంతకున్,
గలికాగ్రంబులఁ బట్టువాసి, నెరయంగావిచ్చి, తోరంపుటు
గ్గులు పీడం బెడపీఁక పీడి, వలిజేకుల్నాళము ల్దాయ లో
దళము ల్బింకము చూపఁగాఁ, గలువలందంబొందెఁ గ్రొత్తావులన్. 159

చ. ఎఱకలుదిద్ది కంధరముఁ లెత్తి, మొగిం జరలాట మున్నుగాఁ
బఱచుచు, లేఁతవెన్నెలల పారణసేయుచు, మించి చంచుల
న్నఱకినఁ, దోనపుట్టు కిరణంపుఁ గొనల్గొన మోముమోముతో
నిఱియుచుఁ, బేర్చి ప్రేయసులకిచ్చుచు నాడె దివిం జకోరముల్. 160

క. ఆ సమయంబున వెన్నెల
శాసటమునఁ దోఁచితోఁచి పార్థివమణిపై
వేసె మనోభవుఁడెంతయు
గాసిలి యెలదేఁటిఱెక్కగరుల శరంబుల్. 161

1. పిన్న: 2. కలియు.

గీ. మునుల మంత్రబలంబున దనుజతీవ్ర
మార్గణవ్రణముల బాధ మానెఁగాని
మానకెంతేనియును మేనుమండఁ దొడఁగె
నరపతికిఁ జిత్తభవమార్గణవ్రణములు. 162

మ. కుపితానంగశరాగ్నిదాహమున నాక్షోణీవిభుం డెంతయుం
దపియింప న్వెస నుగ్రభానురుచులు న్ధారించుచుం జంద్రికా
తపము న్మించినఁ గ్రిందుమీఁ[1]దిఱుకుడై తాపంబు రెట్టింప నే
యుపచారంబున మానునొక్కొ యిది యంచూహించి చిత్తంబునన్. 163

సీ. మోహనాస్పదలైన బాహుశాఖలచేతఁ
గమనీయకర పల్లవములచేతఁ,
గోమలనఖశిఖాకోరకంబుల చేత
విమలహార ప్రసూనములచేత,
సమపీనవర్తుల స్తనగుచ్ఛముల చేత
రమణీయదేహ సౌరభముచేత,
సంచారజస్వేదజలమందరము చేతఁ
జికురోరు మధుకరశ్రేణిచేతఁ,
తే. గలితమైన శకుంతలా కల్పలతిక
నీడ నొదుగకయున్న నేజాడ నాఱుఁ
గుటిలసంకల్పసంభవక్రూరపుష్ప
చాపశరజాలసంజాతతాపభరము. 164

ఉ. ఎత్తిన మన్మథాగ్ని నెద[2]యేఁచెడు తాపభరంబుఁ దీర్పఁగాఁ
గ్రొత్తవిరుల్మృణాళములు గొజ్జఁగినీరుఁ బటీర మోపునే
హత్తిశకుంతలాధరపుటామృతపూరము లూర్పువుచ్చకే
గుత్తుకబంటిగాఁ గడఁగి కూర్కొని కూర్కొని త్రావకుండినన్. 165

సీ. నళినాక్షి నను జూచి యలుకలు దీర్చెనేఁ
దిర్దివిప్ప నడవనే తేఁటినారిఁ,

---

1. దుడుకుడై; 2. యొండెడు.

చంద్రాస్య నన్నుభ్రూసంజ్ఞ మన్నించెనే
శిశువుల కొసఁగనే చెఱకువిల్లుఁ,
గంబుకంధరి నన్నుఁ గడకంటఁ జూచెనేఁ
జదనేయనే పుష్పసాయకంబుఁ.
గిసలయాధరి నన్నుఁ గెంగేలనంటెనేఁ
జిదుమనే కొనఁగోరఁ జిగురుఁగత్తి,
తే. యేల యేఁపుచునున్నాఁడు హృదయభవుఁడు
నెలతయును నేను సమదృష్టి నిలిచినపుడు
బేలుపోవును దాన యీ కీలెఱుఁగఁడు
తెల్లవాఱంగవలెఁగదా దైవకృపను. 166

వ. అని యనేకప్రకారంబులఁ జింతాసంతప్తుండై, శకుంతలామనోహరాకా రంబు మనంబునం బెట్టుకొని, పరబ్రహ్మంబు నవలోకించు పరమయోగి చందంబున, భూకాంతుండుండె నంత నిక్కడ శకుంతలయు నాశ్రమ వనాంతంబున, 167

క. అనికిం గరిపుర నాథుఁడు
చనినది మొదలుగను జయము సమకూరినదాఁ
కను నిష్టదేవతాప్రా
ర్థనముం జేయుచును దత్పరత వర్తిలుచున్. 168

గీ. జయముఁగైకొని తన నిజేశ్వరుఁడు మగిడి
విడిదలకు నేగె ననువార్త వినుచు లలన
వినియెఁగర్ణద్వయీకటువిషమబాణ
ఝుంకృతిస్ఫారశింజనీటంకృతములు. 13)

చ. తలఁగఁగ [1]నిచ్చుచెట్లు వసుధాపతి దారసమైన యట్టిచోఁ
దలరి మదీయశాసనముఁ దప్పుట యెట్లొకొ తాల్మి[2]నంచుఁ దాఁ
జెలఁగి చెలంగి మానసము చిల్లులువోఁవఁగ నేసె బాలిక
న్వలపులరాచజోదు ప్రసవంబుల పేరను గోర్వికోలలన్. 170

1. నిల్చుచెట్లు; 2. యంచు.

క. వాలికపూములుకుల త
త్కాలంబునఁ దొంటియంపగంట్లును రేఁగెం
జాలఁగ నురిసినపుండులు
[1]కోలలఁ గెలకుననుటాశకుంతలకయ్యెన్. 171

క. గణనకు ఘనమై మరుమా
ర్గణములు చిత్తజుఁడు గురియఁగా నా రమణీ
మణి లేచి పర్ణశాలాం
గణమున కేతెంచి నిలిచి కనుగొన నెదురన్. 172

సీ. విరహులపైఁ జల్ల విషపుఁజూర్ణము నించి
పట్టిన దంతంపుబరిణ యనఁగఁ
దెప్పించి పాంథులఁ దెగటార్ప శశికాంత
శిల ఘటించిన పద్యశిలయ పోలెఁ
గాంతాపరాధులఁ గౌముదిం దొడికింపఁ
బెట్టిన పటికంపు బిందె యనఁగ
వెస వియోగులఁ దెగ వ్రేయఁ బుల్గడిగించి
నిలిపిన గండ్రగొడ్డలి యనంగ
తే. ముదురవెన్నెల గిన్నెలముంచవచ్చు
కరణి నుత్ఫుల్లకాశనీకాశయగుచుఁ
దెల్లవాఱి మధ్యందినాదిత్యుఁడనఁగఁ
దనరు శశిఁజూచె నాశకుంతల భయమున. 173

గీ. శంబరారాతి శరవహ్ని సైఁపలేక
పర్ణశాలాంచలంబుల బయలనిలుప
సెకలు దేహంబునం దెల్లఁజెఱచి పాఱె
నతివపై వడజల్లెఁ జంద్రాతపంబు. 174

---

1. కోలగెలకు ననుటయా.

క. ఉడురాజదీధితులఁ దిరు
గుడుపడి తపియించుచును శకుంతల యుండెం
బుడమిజనంబులు వెన్నెల
వడఁదాఁకను మాట నిక్కువంబై యుండెన్. 175

వ. అయ్యవసరంబున ననసూయా ప్రియంవదల త్తలిరుఁబోఁడి మెత్తమెత్తన యెత్తుకొనిపోయి, క్రొత్తనెత్తమ్మిరేకులం గల్పించిన తల్పంబు సేర్చి, శిశిరకృత్యంబులు సేయం, దత్సమయంబున, 176

సీ. చనుదోయిఁ బొందిన జలజపత్రంబులు
    చవరవ రజములై రాలిపోయెఁ
గర్ణావతంసంబు కలువలు కన్నీళ్ళ
    నురిసి రేకులపట్టు మురిసిపడియె
నురము గంధంబు చిట్టుడుకువట్టినఁ బొంగి
    యందంద మండ బేరావు లెగసె
హారవల్లికలుగా నమరించిన మృణాల
    కిసలయంబులు పచ్చిగిజ్జడయ్యె
తే. జిగి దలిర్చిన క్రొమ్మావిచిగురుఁబఱపు
పెట్టుపెట్టిన చందా[1]న నట్టకట్టె
నగ్నికాజ్యాహుతులు వోసినట్టిదయ్యె
నకియ విరహానలమునకు శైత్యవిధులు. 177

గీ. కొమ్మ విరహాగ్నివేదన కొలఁది[2]యెద్ది
పదతలంబుల నిగిడించు ప్రసవరజము
మంగలంబున వేఁచినమాడ్కిఁ దెరలెఁ
బెక్కుసఖులకు నఱచేతఁ బొక్కులెగసె. 178

క. ఎంతెంత శిశిరకృత్యం
బంతంతయు విరహవహ్ని యధికము గాఁగం

1. ల గట్టు కట్టె; 2. యంది.

గాంత తనచెలుల చిత్త
క్లాంతియుఁ బడుపాటుఁ జూచి కన్నీరొలుకన్. 179

గీ. మానవతులార యిన్నాళ్ళమరుఁడుకాఁడు
యింతనొప్పించినాఁడె నన్నెన్నఁడైన
నిండువెన్నెల యనుపేరి నేయిఁజల్లి
చంపుచున్నాఁడు చంద్రుండు చల్లజంపు. 180

సీ. తనరశ్మినొల్లక తగువారిలో మను
తమ్ములఁ జెఱచు పాతకుఁడు వీఁడె
చదువఁగాఁ బోయి యాచార్యుని కులభామ
కడుపు చేసిన దోసకారి వీఁడె
హరిణాంకమను పేర నపరసంబగు నల్ల
గుట్టుదట్టిన చెడుగొట్టు వీఁడె
పదునైదు దినముల బ్రతుకుకై సరివాని
దిననాథు నాసించు తిరిపెపీఁడె
తే. తనదు[1] రాకకుఁ గాఁగి కాతరత నొంది
విరుల బోరియలడాఁగిన విరహిజనుల
చొప్పుఁబడి పట్టుకొని చుఱచుండ్లుచూఁడఁ
గుసుమబాణుని తెచ్చిన కొఱవి వీఁడె. 181

వ. అదియునుంగాక, 182

సీ. తనకు బాడబమహాదహనసంగతఘోర
మకరాకరంబు జన్మస్థలంబు
తన సహోదరులు కాదంబరీనామ [2]హా
లామహాక్ష్వేళహాలహలములు
తనశరీరముఁ బ్రోచుకొనుట తీవ్రకఠోర
హరిదశ్వకిరణభిక్షాటనమున

---

1. గాఁకకు; 2. హాలా.

దనకు సంతతపాంథజనహ ర్త పాపిష్టి
యంగహీనుఁడు కూర్మిసంగడీఁడు
గీ. పద్మినికిఁ గీడొనర్చెడు పాపజాతి
చక్రవాకవియోగాగ్నిసామిధేని
విరహిజనములపాలింటి వేరువిత్తు
దురితముల కేల వాయొడుఁ దుహినకరుఁడు. 183

వ. అని మఱియు నిట్లనియె, 184

సీ. భద్రకాళీభర్త పదతలాహతి బల్లి
పరవోలె నెపమారఁ బ్రామఁడయ్యె
దక్షకోపజమైన యా క్షయవ్యాధి ని
ర్జీవిగా నాశిలఁ జేయదయ్యె
నమృత మంతయుఁ ద్రావి యంకసారంగంబు
బింబమెల్లను నిండ బెరుఁగదయ్యె
నాచార్యుఁ డనక భార్యకు దప్పినప్పుడు
పొడుగఱ నీరంకు బొడవదయ్యె
తే. ప్రథమకళ యారగించెడు పావకుండు
మీఁగడయుఁబోలెఁ గడిచేసి మ్రింగఁడయ్యె
నేల యిటు సేయఁ బాంథులపాలవీధి
వనజగర్భుండు వ్రాసిన వ్రాతఫలము. 185

వ. అని యుపాలంభించి యారంభోరువు కరాంభోరుహములు మొగిడ్చి
మహాపరాధంబుఁ జేసితినని యతండు మన్మనోనాథు వంశనాథుండు,
వంద్యుండు గాని నింద్యుండు కాఁడని, 186

శా. స్వామీచంద్రమ తావకాన్వయుఁడు దుష్యంతుండు భూపాల చూ
డామాణిక్యము నీకుఁదా మనుమఁడౌట న్నెక్కు వాక్యంబులే

లా మాతాతవు [1]నీవు నే మనుమరాలంగాన మేలంబుగా
నామాటల్విను తప్పుపట్టకు మదిన్మన్నించు గారాముగన్. 187

మ. జననంబొందితి దుగ్ధవారినిధి నాసర్వేశు జూటంబుపైఁ
జనుదేఁ బ్రొద్దుఁ బ్రశంససేయ నవతంసంబైతి నీ ప్రాభవం
బునకుం బాంథజనాపకారియగు నాపూవిల్తునింగూడివా
రని దుష్కీర్తిగఁ దిట్టునంబడకు, చంద్రా, రోహిణీవల్లభా! 188

వ. నన్ను మన్నించు మని యక్కన్నె వెన్నెలరాచవేలుపుం బ్రశంసించి
నృశంసుండగు ప్రసవబాణు నుపలక్షించి, 189

సీ. వానిఁదప్పించితి వనజాసనుని యంత
వానికిఁ గూఁతుఁరు వలపుఁగఱపి
దోషంబు గట్టి తిందుని యంతవానికి
గురుకళత్రంబుపై మరులుగొలిపి
బలు గోడిఁజేసితి పాకశాసనునంత
వాని నహల్యకై వాసిచెఱచి
నెరసువట్టితి పరాశరులంత వాని న
ట్టేటఁ జామరుకన్నె [3]గాటుమఱపి.
తే. నీ ప్రతాపంబు లెన్ని యెన్నికకులేవు
తొడిఁబడితి నాఁటదాన నీ తోయమునను
నన్ను మన్నింపు దుష్యంతునకు ఘటింపు
మయ్యె వెఱతును మదన జోహారు నీకు. 190

సీ. పాపకన్నెలు మేఁతపట్టి పోవిడుచుచో
వెసగాడ్పు ఱెక్కలు విఱిగెనేనిఁ
గలకమామిడి పండ్లఁగల [4]జీడి
మధుకరపోతంబునాలుక పొక్కెనేనిఁ,

1. నీకు; 2. ఠవలఫు; 3. పాటు; 4. జీడిచేఁ గీర.

జంపకప్రసవవాసన సోఁకి యెలదేఁటి
కూలివిఱ్ఱునఁ దన్నికొని యెనేని
నిగురుమేఁతల దొగరెక్కి కోకిలకును
వడిఁజొమ్ము గడిసిలఁబడియెనేని

తే. దీయవిలు జీమగమి దొల్చి తినియెనేని
బొదలు నావేఁడియూర్పులఁ బువ్వుఁదేరు
కము[1]రెనే బట్టబయలగు గర్వరేఖ
విషమసాయక విచ్చేయు విడిదలకును. 191

వ. ఇట్లు బహుప్రకారంబుల మన్మథ వికారంబులకుం గలాపంబులుగాఁ బ్రలాపంబులు నెఱపుచు వాగురాయష్టిమృగయుండునుంబోలె భూపాలుండు తన పాలికి వచ్చిన భావంబు భావించుచు, నయ్యాదిగర్భేశ్వరుండు నర్మగర్భంబులు సఖిజనంబుల తోడనాడిన సల్లాపంబులందలంచుచు, నా సింధురపురవరాధీశుండు గాంధర్వంబునం దనుం గరగ్రహణం[2]బొనర్చిన విలాసంబు లాసించుచుఁ గారాకుచవ్వుడైన నప్పుడప్పుడమిఱేనిరాకగా శంకించి దిగ్గనలేచి దిక్కులవలోకించుచుం గానక కళవళించుచుం జింతాపరిక్లాంతిం గనుమూసియు మూయమి నన్నరేంద్రచంద్రునిం గలం గలయంగాంచి, బయలు కౌఁగలించుచు; గలవరించుచు, బలవరించుచుం గుందుచుం, బొరలుచుం, దెరలుచు; వనరుచుం, గనరుచు, నొగులుచుం; బొగొలుచుం, గసరుచు, గొసరుచు, వేసరుచు, [3]నసురనుచు, నుసురనుచు, నుల్లంబొల్లంబోయి, మూర్ఛిల్లిన, నప్పల్లవాధరిం గనుంగొని, 192

సీ. వరుస ననసూయయును బ్రియంవదయుఁ
జేరి యల్లనల్లన శిశిరకృత్యములు సేయఁ
గ్రమము తోడుత వెడవెడఁ గనులుదెఱచి
సమధికామోదతాళవృంతములు సూచి. 193

1. రనీ; 2. బు చేసిన; 3. నసురనురనుచు, నుసురుసురనుచు.

మ. విసరంజూడకుఁ డమ్మ పూవుసురటు ల్విభ్రాంతిమూలంబుగా
నసువుల్వావుఁ దదంతరాంతరనితాంతామోద హేలాలతాం
తసమాక్రాంతకృతాంత రూపపవమాన ప్రేంకణ ప్రక్రియా
వసరోదంచితచారు సారభరసవ్యాలోలరోలంబముల్. 194

ఉ. సూదులు ద్రిప్పుచంద మగుచు న్వెతవెట్టకయుండ నెచ్చెలు
ల్మూదులు వెట్టరే చెవులలోపల సంతతపాంథలోక హృ
ద్భేదులు మత్తరాజశుకభీషణభాషలు బాలపల్లవా
స్వాదకషాయకంఠవిలసత్కలకంఠ కటుస్వనంబులన్. 195

గీ. తెల్లవాఱిన వెఱవ నేదేవతలకు
వల్లభుఁడు నన్ను రక్షింపవచ్చుఁగాన
భావజుని చేత నీలోనఁ జావకుండ
నరయుఁడో యన్న నెచ్చెలు లతివఁ జూచి. 196

మ. వనితా యాతనిఁ బోలలేనవెఱు నీ వంతన స్మరుండంతరిం
చు నిజంబప్పుడు వేల్పులప్పదవికి న్నోధించి వట్టాభిషే
చనముం జేయుదు రర్థి; నిన్నిట రతిస్థానంబున న్నిల్పి, రూ
పున దుష్యంతనృపాలుఁ డర్హుఁడగుటం బుష్పాస్త్రపట్టంబునన్. 197

వ. అని సఖీజనం బుపలాలించు నయ్యవసరంబున, 198

ఉ. తోయజపుష్పబాంధవుఁడు తూరుపుఁగొండకు రాఁదలంచె భూ
నాయకుఁడు న్శకుంతల మనంబలరం జనుదెంచుఁ దుమ్మెద
ల్మ్రోయకుఁడీ, శుకంబులు నెలుంగులు సేయకుఁడీ, పికంబులుం
గూయకుఁడీ, ప్రమాదమని, కూకలువేసిన భంగిఁ గొక్కొరో
కోయని బిట్టుమ్రోసెఁ, దొలుకోడి నికుంజకుటీరవాటికన్. 199

వ. తదనంతరంబ, 200

సీ. కుముదంబు లర్ధమర్ధము మొగంబు మొగిడ్చె
నర్ధమర్ధంబు తోయజము విరిసె

స్యందనాంగం బింతనంతనుం జరియించె
నింతనింతఁ జకోర మీక లిరికె
విధుకాంతశిల వెడవెడ నీరిగిరి తీసె
వెడ సూర్యకాంతంబు వెచ్చనయ్యె,
నిశ యించుకించుక దెసలయంచుల
నిల్చె నించుకించుక దివం బిరికెత్తెఁ;
తే. దొలఁగిపోయెడు కుముదబంధుద్యుతియును
దోఁపుచున్న సరోజబంధుద్యుతియును
శబళమై శ్వేతరక్తముల్ సంక్రమించె
సకలదిశలను బ్రత్యూషసమయమునను. 201

సీ. కావికోణాము లాకాశసన్న్యాసి కం
బరకపాలికులకు మర్లుజడలు
చిగురాకు[1]బరికెలు గగనచూతమునకు
వలఁతి యూడలు వియద్వటమునకును
పట లంతరిక్షకేసరికంధరమునకు
జమలి యీఁకలు నభశ్చాసకునకు
రాగిమీసంబు లక్రకిరాతుమొగమునఁ
బగడంపులత లుడుపథపయోధి
తే. కనెడు సందేహచింతనం బావహిల్ల
[2]యావకద్రవరేఖల యందమొంది
పట్టుసూత్ర వితానంబుఁ బరిభవించి
యాకసముఁ బ్రాకెఁ దూర్పునైన నరుణరుచులు. 202

సీ. ఒక్కింతవెన్నెల యూర్చి తీసినభంగి
నుదధీశుదిశకునై యొడిగిల్లెఁ
గమలి మించెడలిన కంచుటద్దమువోలె
నస్త్రాద్రికడ జంద్రుఁ డస్తమిల్లె

1. బలుకులు; 2. యాస.

జలము లూటలుగ్రమ్మ శశికాంత పాషాణ
నీలంబు లీ[1] టారి నీరు దివియ
ఘానుభృత్పాషాణ ఫలకమధ్యంబులఁ
గోకయుగ్మము కంతుగోష్ఠి నెఱప
తే. నబ్జగంధంబు తేఁటుల నామతింపఁ
దికమకలుగొని నాలుగుదిక్కులకును
విచ్చివిచ్చి చకోరము ల్వోళ్ళఁబాఱ
నల్లనల్లన తూరుపు దెల్లవాఱె. 203

క. అంతటఁ బ్రాతస్సంధ్యా
సంతర్పణఫలముఁ గాంచి సంయములకు ది
గ్దంతి గొనియెత్తివైచెనొ
యింతటఁబడ ననఁగఁ బ్రాచి నినుఁ డుదయించెన్. 204

ఉ. అంకిలిలేక చందిరకులాగ్రణి నేఁడు శకుంతలామన
శ్శంకరుఁ డయ్యెఁడుం, గలుగుశాత్రవ మాతనితోడ; నంచు మీ
నాంకున కంగరక్షకయి యామినిఁ జేఁడొనరించి నట్టి యా
మంకెనపూవుకేడెమన [2]మండలయొప్పె మరీచిమాలికిన్. 205

వ. ఇట్లు సూర్యోదయం బగుటయు దుష్యంతమహీకాంతుండు సంధ్యా వందనం బొనర్చి స్యందనారూఢుండై విడిదల వెడలి యవక్రపదక్రమ మహీసురసమూహపఠ్యమాన వేదనాదంబుల, నవిచ్ఛిన్నహూయమాన మహాగ్నిహోత్రస్వాహాశబ్దంబుల, ముఖరితంబగు మఖవాటంబు జేరవచ్చి సైకటికంబున రథావతరణంబు చేసి, యర్చిష్మత్తుల్యతేజు లగు మునీంద్రులకుం గృతనమస్కారుండై; 206

క. ఎన్నఁటికిఁ జుక్కకెదురిచ
టన్నరభోజనుల కయ్యె నపగతభయులై

1. దీర; 2. మండల మొప్పె.

జన్నముఁ గావింపుఁ డవి
చ్ఛిన్నముగాఁ జాలసంతసిల్లిన మతులన్. 207

గీ. అంతనింతను నేనును నరసికొనుచు
సంచరించెద ననిన నా సంయమీంద్రు
లనుమతించిన వీడ్కొని యాశకుంత
లావిహారవనాంతరస్థలముఁ జొచ్చి. 208

మ. కలకంఠధ్వనుల న్మదారికులఝుంకారంబులం గీరభా
షల మందానిలురాకల న్బరిమళశ్లాఘ్యంబులై యొప్పు ప్ర
ఫ్పులతాకుంజగృహంబుల న్విరహతాపం బద్భుతంబై శకుం
తల మున్నున్న ప్రసూనతల్పమునకుం దాఁజేరి చింతించుచున్. 209

సీ. చెలువబాష్పముల విచ్చిన కల్వపూబంతు
లందంద కన్నుల నద్దుకొనుచు
వనితయూర్పులవాఁడివ త్తలైన పద్మ బ
ముకుళంబు లొత్తిలి మూరుకొనుచు
నువిదమైసెక దాఁకి యులిసిన జివ్వలతా
వలిహారములు మేన వైచికొనుచు
రమణిడెందంబు వేఁడిమి మాఁడి మసియైన
పుప్పొడి మెయినిండఁ బూసికొనుచుఁ
తే. బొలఁతి సంతాపభరమునఁ బొరలుపెట్ట
నెండి యొగురుళ్ళఁ బోయిన యిగురుఁబాన్పు
మీఁదఁ బొరలుచు విరహాగ్ని నీడుకొనుచుఁ
జిత్తజోన్మాదవృత్తి నాతి తివరుండు. 210

క. ఆ చంద్రవదన రాకలు
చూచుచు నిట్టూర్పువుచ్చుచుం బానుపుపై
లేచుచుఁ బవళించుచు మఱి -
యీ చందంబునఁ జరెంపె నింతటిలోనన్. 211

ఉ. పూని కరంబులం బొదవి బోటులు తోడ్కొని తేఱమన్మథ
గ్లాని వహించి చాలఁ గసుగంది శకుంతల ప్రాణనాయక
ధ్యానముతోడఁ గన్నులనె ప్రాణము నిల్పి శరీరమాత్రమై
తానట కేగుదెంచె వడదాకిన చెందొవకాడవై ఖరిన్. 212

ఉ. వచ్చి లతాగృహంబు తలవాకిట బోటులు చెప్పఁ జూపఁగ
న్విచ్చి మనంబులో వెఱపు, నెయ్యము, దియ్యము; దత్తరింతయు
న్మచ్చికయుం, గుతూహలము, మక్కువయుం; దడఁబాటు నొందఁగా
నచ్చపలాక్షి చూచె లలితాననచంద్రుని మానవేంద్రునిన్. 213

క. భూతలనాయకుఁడును నా
శాతోదరిఁజూచె సంతసము; సంభ్రమము,
బ్రీతియుఁ, దగులును, వలపును
గౌతుకమును, మానసమునఁ గత్తర కలయన్. 214

వ. అయ్యవసరంబునఁ గన్యావరుల యన్యోన్యప్రీతియుం, బరస్పర విస్ఫుర ద్రోమాంచ సంచయంబును, నితరేతర కాతరశాదర్శనంబును; మిథశ్లథధీరతాభావంబును, భావించిచూచి, యనసూయప్రియంవదలు, శకుంతలా దుష్యంతుల నేకాసనంబున నునిచి, యెద్దియేనియు నొక్కప్రయోజన వ్యాజంబున నేకాంతంబిచ్చి, యెడ [1]గలుగఁ జనిరంత; భూకాంతుండును బ్రియాముఖంబున దృష్టి నిలిపి కపోలంబు నఖంబుల నటింపం జేయుచు, 215

సీ. రతికి జేరియును జేరమిఁబాసిపోవఁగా
విధి యొనర్చిన యారివేర మొకటి
కదనంబులో గెల్పుకలదొ లేదో యను
సంశయోద్భవమైన జాలి యొకటి,
మోముచూచినదాఁక నేమమెవ్వారల
చేతను వినరాని ప్రీతి యొకటి;

1. గలసి.

యనుచితంబని రాత్రి చనుదేక నిల్చిన
నామీఁది కోపసంతాప మొకటి,
తే. నడుమ జాజరకాఁడు మన్మథుఁడు వచ్చి
రాత్రి మల్లడిగాఁజేయు రాయిఁడొకటి
యెంతనొప్పించెనో కదా యింతిననుచుఁ
గరయుగంబున బిగియారఁ గౌఁగలించి. 216

మ. కొసరుం గొంకును దేర్చి నెన్నొసటఁ జిక్కుల్గొన్న నీలాలక
ల్పొసగందీర్చి ప్రియంబొనర్చి, సరవిం బూసజ్జకుం దార్చి, ము
స్గసుమాస్త్రాహతిసంభవం బయిన యాకుందార్చి, పొందార నిం
పెసఁగం గౌఁగిటంజేర్చి, తేల్చె రమణిన్ హేలాసుఖాంభోనిధిన్. 217

వ. అయ్యవసరంబున, 218

సీ. శ్రవణసౌఖ్యంబుగా సాధుస్వనంబున
మ్రోలనాలాపించె మొకరి తేఁటి
మనసు రింగులువార మణితక్వణంబునఁ
జెంత నల్లన విలసిల్లె శారి
యెలద్రొక్కుపలుకులఁ గులికిగుల్కి నటించెఁ
గలికియై తేనెలుచిలుకుఁ జిలుక
యింపుసొంపిరిపోవ నింతనంతను నిల్చి
పంచమశ్రుతిఁ బిసాళించెఁ బికము
తే. సమ్మదమ్మొగ సురతశ్రమమ్ము దేలు
నంతమాత్రంబె పొలసె మందానిలుండు
తాఁకఁ బరిమళ మొకపాటి సోఁకనేసె
వలపుమాపుల మగఁడు భూవరునిసతిని. 219

సీ. అన్యోన్యసంప్రీతి నలవరించుచునుండు
వలరాజుకూఁటట గలుగదయ్యె
రమణీయనూతన రతిరహస్యములకుఁ
గామశాస్త్రంబులు కడమలయ్యె

నుద్వేలమగుచుఁ బెల్లుబ్బైడు రాగవా
ర్థులు లేశమైనను [1]దొంకవయ్యె
నితరేతరప్రీతి నెడలింపఁ దలఁచిన
ధృతికిరాఁ దెఱపి సిద్ధింపదయ్యె

తే. మమతలును, దత్తరింతులు, మక్కువలును,
జొక్కులును, గౌతుకములను, సోలదములు,
ప్రియములును, గాముకతలుఁ దబ్బిబ్బులుగను
సతియుఁ బతియు రతిక్రీడ సలుపునపుడు. 220

శా. పాలిండ్ల న్నవనీలికాకలికలన్ బ్రాలంబముల్చేసి కం
కేళీకుట్మలరత్నహారములతోఁ గీలించి కర్ణంబులం
డాలొప్పారగఁ గర్ణికారములఁ దాటంకంబు లర్పించుఁ దా
నాలోలాక్షికి నవ్విభుండు నవపుష్పాలంక్రియాఖేలతన్. 221

క. రేయి చకోరస్థితిఁ గవ
వాయక జక్కవల భంగిఁ బగలు మిథునమై
పాయక రేయును బవలును
నాయవనీపతి సుఖంచె నతివయుఁ దానున్. 222

క. పొలయలుకలు ప్రియమైనను
వలయుం బాయునని యోరువక భీతుండై
నలవోకైన శకుంతల
నలగింపగఁ వెఱచుఁ దాను నలగఁగ వెఱచున్ 223

వ. ఇవ్విధంబున నవ్వధూరత్నంబుతోడి క్రీడలం దగిల, మునిసమాజసేవా వ్యాజంబున నారాజరతిరాజు నిలిచి సారథిని రథంబుఁ గొనిపోవ నియమించి, హోమకాలంబున యాగశాలలకుం బోవుచు, నొక్కొక్క వేళ మందపవన పరిస్పందనంబునం గందువంగని మందలయి యందందవచ్చు నిందిందిరంబుల క్రందునం జిందిన మకరందంబునం బొందలరు నలరు

1. దొలఁక.

గురువింజపందిరులక్రింద, నొక్కొక్కవేళఁ బల్లవంబుల సందులం దెల్లనుం, జెల్లంగొనిన విరులమొల్లంబుల నుల్లంబు నలవరించు వల్లరులం జూపివల్లులు వెదచల్లు నుత్ఫుల్లమల్లికావల్లికామతల్లికాగృహంబుల, నొక్కొక్కవేళఁ దావులఁగ్రోవులగు తమ్మిబావుల కడలం దూవరుల నీవరిం జెంగలించు తరులతావుల తేవలగు క్రొమ్మావులక్రేవలను, నొక్కొక్కవేళ నప్పటప్పటికిని నుప్పతిలం జిప్పిలు పుష్పరసంబు చప్పరించుచు నుప్పరంబునం గొప్పరంబు లెగయ దెప్పరంబుగఁ గుప్పిగంతులుం గొను, షట్పదంబుల పదంబులంబడి దొప్పదొరుగు పుప్పొడిం గదిసి యొప్పెడి విప్పుం గల సరోవరంపు టిసుకతిప్పలను, వేల్పుటుత్పలగంధియుం దానును గందర్పదర్పం బనల్పంబుగా వర్తింప సప్తరాత్రంబులరిగె, నతిరాత్రసప్తతంతువుం బరిపూర్ణంబయ్యె; నంత హాస్తినాపురంబున, 224

కాశికాముఖనామరాక్షసపతికినిఁ
దమ పతికి యుద్ధమైన విధంబుఁ గింవ
దంతిగాఁ గని యంచితోత్సాహమునను
దంతిరథవాజిఘటసముత్కరము గెరలి. 225

సీ॥ లలితహృదయము తివిరి లంఘించు నరదములుఁ
గులగిరులనైన దీకొను మదద్విరదములుఁ
దెరలి యురువడి గాలిఁ దెగఁబాఱు వాజులును
సురరాజు సరివచ్చు చుట్టంపురాజులును
దివిజగురుతోడ నుద్దికివచ్చు మాత్యులును
దవిలి సేవించు తాతలనాఁటి భృత్యులును
జాలుగలుగ[1]కనిల్చు సంధిసౌజన్యులును
వేఱొకింతయు లేని విశ్వాసమాన్యులును

1. విశిఖల.

సమర సమదుఃఖు లగు సత్కృపాపాత్రులును
జెమటనెత్తురుగాఁగ సేవించు మిత్రులును
వేఁటాఉుతునుకలుగ వేయగల సాదులును
సూటిదప్పక యేయు చొక్కంపుజోదులును
కోరి గిరవులు వెట్టి కొలుచు జగతీపతులుఁ
బోరులకు ముఖరులై పొలుచు సేనాపతులుఁ
దొలుపోటు కయ్యమునఁ దొడరు నాసీరులును
బలిమిమై జమునైనఁ బఱచు భటవీరులును
గలహావిక్రమ కళాకలితులగు పాయికులు
నలఘుబలసంపన్నులగు వంక నాయకులు
నసిచర్మసంగరసహాయులగు పారకులు
నసమశాత్రవజయసమర్థులగు దారకులు
గొండలగ్గల సరకుగొనని పేరాయులును
దండ్రి వనదుర్గభేదకులయిన కోయలును
మఱియు గణముఖ్యులగు మల్లరులు నొంటరులు
నెఱబిరుదు శూరులును నెనకెనయు[1]గొంటరులు
వీరాదిగాఁ గల్గు వీరపరివారంబు
చారురుచి నొప్పారు సమరశృంగారఁబు
నల్ల జల్లెడలతో నడగారడవి భంగి
బల్లి గట్లంగడల ప్రభల ప్రింగఁగ నింగి
పులికి సింగంబునకుఁ బుట్టు వొందిన కరణి
బలుపులేపును గల్గు భటుల బింకపుసరణి,
మొనసి గుబ్బలకేడెముల ఘంటికలు మ్రోయ
మొనలుముందట సబళముల సాదనము సేయ
నరిగె బిళ్ళలతాఁకు నళనిఘోషము దొరయ
దిరువులో నడిదము ల్త్రిప్పి యొండొరు మొరయఁ
గోలతో విల్లు దెగఁగొని ఱిత్త పేరెములుఁ

1. ఖచరులును.

గాలు కొలదియుఁ బఱచు కదన ప్రకారములుఁ
బొడవెగురవైవ నప్పుడ వచ్చు కుంతములుఁ
దడయకొరపుగఁ బట్టి తగనిచ్చు పంతములు
వెలయు బొమిడికములును వెనుకవమ్ముల జోళ్లు
నలమికొన నొకఁడు పదురై తోఁచు వడవాళ్ళు
మొనలు చక్కఁగఁ దీర్చిముఖరులై నడపింప
ఘనవాద్యనాదముగ ఘనఘంట పూరింప
మెండుకొని కడిమి భూమీజనంబుల చూడ్కి
నిండి సేనాసమితి నేలయీనిన మాడ్కి.
నహితులకు గుండె లల్లాడంగ నంతంత
మహిత సైన్యము నిల్చె మాలినీనది పొంత. 226

వ. విడిసిన నట్టి యెడ నమాత్యసేనానాథులు భూనాయకుండున్న యాగశాలకుం బోయి మునులకు నమస్కారంబులు చేసి సముచితప్రకారంబున జనవరు సమ్ముఖంబై నిలుచుటయు, 227

క. మునివరులు రాజువదనముఁ
గనుఁగొని సైన్యంబు లెల్లఁ గదనవిధంబు
న్వివి వచ్చినవారు తోడుగ
నెనయఁగ నీ సత్త్వజవము లెఱుఁగక సుమ్మీ. 228

గీ. అనిన భూపతి వారితో ననఘమతులు
ధరణి సత్కీర్తి నాకు నీఁదలఁచి యుష్మ
దీయశక్తి నాయందు వర్తింపఁజేసి
గెలుచుటలు గాక నరులు దైత్యులకు నెదురె. 229

క. మీకరుణ పెంపు నాకు స
మీక జయముగలుగు నెల్ల, మీకొకలక్ష్యం
బేకోణపకీటంబులు,
మీకినుకం బడిన నస్తమించు జగంబుల్. 230

సీ. ప్రసవసాయకవైరి నొసలఁ గన్గూపిన
నటికాలఁ గన్గూపినట్టి మహిమ
యవతారమిషమున నవనిపై జనియింప
హరిమీఁదఁ గినిసినయట్టి శక్తి
ధాతకు గుడిపూజ ధరణిలేకుండంగ
శాసించినట్టి యాజ్ఞాబలంబుఁ
జండాంశు రథముతో జగతిపైఁ ద్రెళ్లంగఁ
గన్నెత్తి చేసిన గర్వమహిమ,
తే. గలమహామహులకు మీకుఁ గణనసేయఁ
గ్రవ్యభుక్కులనంగఁ జల్కాసిపురువు
లేను ధన్యుండ మాన్యుండ నిట్టికీర్తి
క్షితిని నెగడించి గారవించితిరి గాక. 231

వ. అని యత్యంతవినయవచనరచనలం బ్రీతులం జేసిన మునిముఖ్యులా నృప
ముఖ్యుని దయాసుధామయంబులగు విలోచనంబులం గనుంగొని, 232

సీ. నీవువచ్చిన మృగయావిహారం బది
సమయంగ రక్షోమృగముల కయ్యె
నన్వయాగతమైనయది మీకు ననువాస
రంబు నంచిత ధర్మరక్షణంబు
కామసంహారుఁడైన కాస్యపమౌని స
త్తమున కాశీరమంత్రంబవైతి
వరయఁ బరోపకారార్థమిదంశరీ
రంబను వినుత వాక్యంబు నిదియె
తే. దయయు దాక్షిణ్యమును నుపాదానములుగఁ
గనకగర్భుండు నీ పుణ్యతను వొనర్చె
నీవ నినుఁబోలుదువుగాని నిన్నుఁబోల
జగతి నన్యులు లేరు దుష్యంతభూప. 233

సీ. ఆకాశకరులలో నైరావతమువోలె
            గ్రహములలోఁ దిగ్మకరుఁడువోలెఁ
    దోయాకరములలో దుగ్ధసింధువువోలెఁ
            దరులలోఁ గల్పపాదపమువోలె
    విహగవర్గములలో వినతాసుతుఁడువోలె
            గిరులలో మేరుభూధరమువోలె
    విబుధవర్గములలో వృద్ధశ్రవుఁడువోలె
            ఫణులలో శౌరితల్పంబువోలె,
తే. దారకావళిలో భవద్వంశకరుఁడు
    చంద్రుఁడునుబోలె నధికప్రశస్తిఁగాంచి
    వంశకరు నందనుని జక్రవర్తిఁగాంచి
    భువనవర్తిని యగు కీర్తిఁబొందు మధిప. 234

క. ఇచ్చట యాగక్రియయును
    సచ్చరితుఁడ పీవు గలుగఁ జాగి ఫలించెన్
    వచ్చి తడవయ్యెఁ బురికి
    న్విచ్చేయుదుగాక జనులనేత్రము లలరన్. 236

వ. అని యాశీర్వదించి మంత్రపూతంబులైన హరిద్రాక్షతంబులు శిరంబునందుఁ బెట్టి యనుపఁ బ్రణామపూర్వకంబుగా వీడ్కొని వెడలి, కాన్వమహామౌనియుటజంబునకుం బోవలయు మీరిచ్చట నుండునది యని యమాత్య సైన్యపతుల నొక్కయెడను నిల్పి శకుంతల సమక్షంబునకు వచ్చి, 237

సీ. చెప్పంగఁ జూచుఁ జూచి ముఖాంబుజము దెసఁ
            దప్పకచూచును జెప్ప నోరు
    పోక నిల్చునుపాయములు మతించు మతించి
            నేర్పుదేలేక నిట్టూర్పువుచ్చు

నుండరామిని జెప్పనూహించు నూహించి
పురమున కని యర్థమునన నిల్చు
ననసూయఁ జూచుఁ బ్రియంవదఁ జూచు నా
మేనకాత్మజఁ జూచు మీఁదుజూచుఁ
తే. దరుణి దెస మోహలత యీడ్వఁ, బురముదెసకుఁ
గార్యలత యీడ్వ రెండువంకలకుఁ జనుచు
భావ్యమిది యనికార్య మేర్పఱుపలేక
నుల్లముయ్యాలలూఁగె భూవల్లభునకు. 238

క. ఈలీల మనసు డోలాం
దోళనమై చెప్ప నాల్కతుదఁ[1]గదలింపం
గాలేక తలిరుటంకున
వాలికనఖమున లిఖించి వనితకుఁ జూపెన్. 239

ఉ. ఆలిపిఁ జూచి నెచ్చెలుల యగ్రమునం బడవైచి మూర్ఛతో
వ్రాలెను దంతి త్రెంచి ధరవైచిన యయ్యలదీవ కైవడిన్
హా లలనామణీ యని ప్రియంవద దా ననసూయ బెగ్గిలం
గాలువలై నృపాలకునికన్నుల నశ్రుజలంబు లొల్కఁగాన్. 240

వ. ఏతత్ప్రకారంబునఁ గొంతవడి నిలిచి రంత నితాంత ధైర్యవతి యగు ననసూయ ప్రియంవదం దెలిపి, రాజుం గుస్తరించి, శకుంతల నల్లనల్లన తేర్చి. యయ్యిందువదనవదనంబు గెంగేలనెత్తి సుధామధురవచనంబుల నిట్లనియె, 241

మ. పురికింబోయెద నన్నమాత్రమున నంభోజాస్య! యిట్లాదురే
ధరణీనాథులు భూమిపాలనముచేఁత ల్మాని క్రీడారతి
న్సరికింటం గొనియున్నఁ బూజ్యయగు రాజ్యశ్రీ కొనల్సాగునే
యరయంగా మెడఁబెట్టుకొంచుఁ దిరుగన్ హారంబులే భామినుల్. 242

1. గంపింపం.

గీ. పోవుచున్నాడు నినుఁ గొనిపోవుచున్నఁ
డంతవట్టును నిజముగా నరసికొనుము
రమ్మనక పోవుచున్నాఁడు రాకుమనిన
వచ్చుదినములు గణనకుఁ దెచ్చుకొనుము.

వ. అనిన రాజునుం జూచి ప్రియంవద యిట్లనియె,

చ. నగరములుజ్జగించి విపినంబుల రాజులు రాజనీతియుం
దగవునుగాదు; పోవుటలు ధర్మము, నాపని యట్లయుండ, నీ
తగులము పెంపు నయ్యనుకుఁ దాల్మియు నెయ్యము నీవెఱుంగు దీ
మగువకు నున్కి యెయ్యది క్రమంబు గ్రమజ్ఞుఁడ వానతీ[1]కృపన్.

సీ. అనిన భూపాలుఁడిట్లను సఖీమణియును
నినుఁబాసి నిమిషమైనను భరింప
నోపదు నేను నయ్యువిదఁబాసి ముహూర్త
మును నిల్వనోప మీ ముగ్ధ యెఱుఁగు
గాంధర్వవిధిఁ గరగ్రహమౌటయు సమస్త
మును ముని విజ్ఞానమునను దెలియు
ఘనుఁడు కాశ్యపుఁడంపగాఁ గొనిపోవుట
తగుగాని కాకున్నఁ దప్పువచ్చు
తే. నేనుఁబోయిన యేనాళ్ళకో లతాంగి
వెనుకఁ బుత్తెంచి మీరెల్ల ననుపరాఁగ
వైభవంబునఁ గొనిపోవవలయుఁ గాని
వెఱవ యేనుంగు నెక్కేల దిడ్డికొఱఁగ.

వ. కావునఁ బుట్టినింటినుండి యత్తవారింటికిఁ గన్నియలువచ్చు చందం
మునఁ బ్రియుండనుప వైభవంబునం గొనిపోయెదం గాక, నందాక; నో
తుణంబు లేకుండిన నాజ్ఞాచక్రంబు దొరగల్లువడు నిది సీలగా,
ముద్రాంగుళీయకంబు మీవిద్రుమాధరి ధరియించుం గాక యని తన్ర

1. దగున్.

యుంగరంబు నొసంగి కురంగనయనయంగుళిం బెట్టి యెట్టకేలకు నను
మతి వడసి యనసూయా ప్రియంవదలఁ బ్రియంబుచేసి యనిపించు
కొని, 247

గీ. చిత్తమచ్చట మునికన్య చేతికిచ్చి,
దేహమాత్రంబు రాజ్యప్రతిష్ఠ కొఱకు
నాశ్రమస్థలి వాసి సైన్యాన్వితముగ
నమృతకర వంశకరుఁడేగె హస్తిపురికి. 248

శా. హేమాద్రివ్రతదానశౌండ, ధిషణాహేలాసురజ్యేష్ఠ, ది
క్సీమాలంఘన కేళిజాంఘికగుణా, శ్రీలోల పద్మాలయా
రామామందిర, నాగయప్రభుకుమారా, శీతశైలాబ్ధి వే
లామధ్యక్షితిపాలమంత్రి మకుటాలంకార హీరాంకురా! 249

క. కంబుజలజాతజలధర
శంబ ధనుఃకలశచక్ర చాపాంకితహ
స్తాంబుజయుగ సల్లలితా
జంబూద్వీపావనీపసచివోత్తంసా. 250

స్రగ్విణి : భామినీమన్మథా భాగ్యసంపన్నిధీ
యామినీనాథ రేఖావతంసాంఘ్రిపూ
జామలస్వాంత విద్యానిశాంతా సదా
స్వామికార్యక్రియాచారునీతిక్రియా. 251

## గద్యము

ఇది శ్రీ భారతీ తీర్థ గురుచరణకరుణాలబ్ధసిద్ధసారస్వత పవిత్ర
గాదయామాత్యపుత్ర యారాధితామరవీరభద్ర పిల్లలమఱ్ఱి
పినవీరభద్రప్రణీతంబైన శాకుంతల శృంగార
కావ్యంబునందుఁ దృతీయాశ్వాసము.

# శృంగార శాకుంతలము

## చతుర్థాశ్వాసము

శ్రీహస్తముకురలీలా
మోహానముఖపంకరుహా సముల్లసిత సుప
ర్వాహార మధురమృదుల
వ్యాహార ఫణీంద్ర వెన్నయప్రభువంద్యా. 1

గీ. ఇవ్విధంబున దుష్యంతుఁ డిభపురమున
కరిగియుండఁ దదీయవృత్తాంతమెల్ల
జ్ఞానదృష్టి విలోకించి సంతసిల్లి
కణ్వమునివల్లభుండు శంకరుగుఱించి. 2

సీ. పాలితాఖిల హరిత్పాలకాది
సుపర్వమండలుం డురగేంద్ర కుండలుండు
సురదైత్యమకుట భాసుర రత్న
ఘటిత సింహాసనుండు మనోజశాసనుండు
కలికాలకల్మష కల్మాష భవబంధ
మోచనుండు కృశానులోచనుండు
కఠినహంకార [illegible]ంకర నిర్గత
ప్రాణసమవర్తి దేవతా చక్రవర్తి.

తే. యంబికాభర్త యఖిలలోకైక కర్త
శంకరుఁడు భక్తలోకవశంకరుండు
ఆచిర కాలంబునంద ప్రత్యక్షమయ్యె
నస్మదీయ మనోరథం బందియిచ్చె. 3

సీ. గిరిజావిభుండు ముంగిటిపెన్నిధానంబు,
కృత్తివాసుండు తంగేటిజున్ను,
గోరాజగమనుండు గుజ్జుమామిడి పండు,
కుసుమాస్త్రహరుడు ముంగొంగుపసిడి,
శీతాంశుధరుఁ డఱచేతి మాణిక్యంబు,
కర్మూజ కటకుండు గాదెకొలుపు,
కరటిదానవవైరి పెరటికల్పద్రుమం,
బసమనేత్రుఁడు సిద్ధరసము చెలమ,
తే. విషగళుఁడు గాడిఁగట్టినవేల్పుటావు
హాటకాచలధన్వి సిద్ధాంజనంబు,
పురహరుఁడు పెట్టెలోనున్నపరుసవేది,
ప్రమథభర్త చింతామణి భక్తులకును. 4

క. అహహా యభాస్యవేళ బాల్యంబునందు
వ్రాసి చదివిన యాఅక్షరములచేత
వశ్యముగఁ జేయవచ్చు భావజవిరోధి
నేలయెఱుఁగరో యీమర్మ మితరజనులు. 5

క. త్రిణయనుని గూర్పవచ్చును
బ్రణవంబునఁగూర్చినట్టి పంచాక్షరిచే
నణిమాది గుణస్థితిఁ దృణ
కణములుగా నొసఁగు మంత్రగతి యెట్టిదియో. 6

శా. ఆజ్ఞాసిద్ధికరంబు, ముక్తిదము, చిత్తానందసంధాయి, శై
వజ్ఞానాంకురసిద్ధబీజము, ప్రభావప్రౌఢసంవిత్కళా
జిజ్ఞాసావిభవప్రదాయకము, లక్ష్మీకారణం, బూర్జిత
ప్రజ్ఞామూలము, భక్తలోకమునకుం బంచాక్షరం బిమ్మహిన్. 7

గీ. అనుచుఁ బంచాక్షరంబునొయ్యన
జపించుకొనుచు నుడురాజశేఖరు గుడికినేగి

యష్టమూర్తికి భక్తిసాష్టాంగ మెరఁగి
కేలుగెందమ్ము లౌదలఁ గీలుకొలిపి 8

మ. హర, సర్వేశ్వర, శర్వ, శూలధర, నీహారాద్రికన్యామనో
హర, మృత్యుంజయ, కృత్తివాస, యురగేంద్రాకల్ప, కందర్పసం
హర, కాకోలకళంక కంఠ, భవ, కల్యాణాగకోదండ, యీ
హరయంబార ఘటించు పోయెద మదీయస్థానముం జేరఁగన్. 9

గీ. ఎఱిఁగి నిన్ను నుతించు వాగీశ్వరాదు
లైన దేవతలకునైన నలవిగాదు
ఎఱుగకునికికి వారును నేను నొక్క
సరియ కావున నభవ నీ కరుణ యురవు. 10

వ. అని మఱియు నద్దేవునకు నమస్కరించి యాశ్రమంబునకు వచ్చి శకుంతల యిచ్చిన యర్ఘ్యపాద్యంబు లంగీకరించి తద్వదనంబునం జూడ్కి నిలిపి, 11

సీ. స్వాగతంబే నీకు సకియలకు ననసూ
యా ప్రియంవదల కనామయంబై
వత్స నీమతి ధర్మవర్తినియై యున్నె
యతిథి సపర్యాసమాభిరతిని
స్నానార్థనియమిత జలజాకరంబున
బాలిక జలము తేపాటి గలవు
గ్రీష్మకాలంబిది యూష్మల వడదాఁకి
పసిమి దప్పవుగదా పాదపములు
తే. రమణిసుఖమున్నదా మదాశ్రమ మృగంబు
చెలులు వర్తింతురా నిన్నుఁ గలసిమెలసి
వత్సలతఁజేసి గడుగారవమునఁ బెనుచు
నీవనజ్యోత్స్న యున్నదే నీలవేణి. 12

వ. అని యంతరాంతరంబుల యోగక్షేమంబు లడిగి కాలత్రయజ్ఞానశీలుండు సకలంబును నెఱింగియు నెఱుంగనివాఁడ పోలె నమ్మొఱుంగుఁబోఁడి

తెలుఁగు తన్ముఖంబున విన నున్ముఖుండై యిట్లనియె, 13

ఉ. ఎన్నఁడులేని క్రొత్తసిరి నీనెడు నీవదనాంబుజంబు మై
చెన్నును నూత్నరేఖ విలసిల్లెడు భావము లెన్ని యన్నియు
న్మున్నిటిభంగిఁ గాక కడు మోహనలీలలఁ గ్రాలుచున్న నీ
యున్న నిజంబు దాఁపుకొనియుండిన నా పయినాన వెట్టెదన్. 14

గీ. అనిన గజగజ వడఁకుచు నశ్రువారి
కన్నుఁగవ రాల గద్గదకంఠ యగుచుఁ
గొంతయును మాటు వెట్టక కోమలాంగి
మునికి విన్నపమొనరించె మునికి మునికి. 15

చ. విని యెలనవ్వుతోడ నరవిందనిభానన నిన్ను నింతగాఁ
బెనిచిన నన్నొకింత వినిపింపక చేసితి నీకు నర్హ కాం
తుని ఘటియింపఁజేయుటకు ధూర్జటిఁ గొల్వఁగ సోమతీర్థమేఁ
జనినయెడ న్మనఃప్రియుఁడు చయ్యనఁ గల్గిన సంభ్రమంబునన్. 16

గీ. వనిత యనసూయయును బ్రియంవదయు నీకు
వరుని ఘటియించి పెట్టినవారు నీవు
వారు సుఖముండుఁ డెక్కడో వాఁడనయిన
యేను దీర్ఘంబులేఁ గెద నెచటికైన. 17

వ. ఇంక మాభారంబు వాసి రాజపత్నివై తివి రాజ్యానుభవసుఖంబుల
మమ్ము మఱువక నీ వరునకుం జెప్పి యాశ్రమంబప్పటప్పటికి యోగ
క్షేమంబు లరయించు కొనుచుండుమమ్మ యమ్మ యని యక్కొమ్మశిరం
బురంబునం జేర్చుకొని యందంద యానందజలంబుల జలకంబార్చి
భయంబుఁదేర్చి యిష్టసల్లాపంబులు సేయుచున్న సమయంబున, 18

మ. దళితక్రోధు లకించను, ల్సములు, మేధావు, ల్సదాబ్రహ్మచా
రులు, నీ రాగులు, నిత్యనిర్మలులు, నిర్మోహు, ల్నిరీహుల్నిఁ, రా

కులచిత్తు, ల్నిగమాంతవేత్తలు, విరక్తు ల్భక్తిసంప్రేమము
ల్వెలయన్వచ్చిరి కణ్వమౌనికడకు న్వార్ధానుపూర్వంబుగన్. 19

గీ. వచ్చిన మునీంద్రులను గౌరవంబు చేసి
పెద్దపిన్నంతరువుల సంప్రీతి నునిచి
కుశలములు పేఱుపేఱఁ బేర్కొనుచు
నడుగ సరవిఁ జెప్పుచు వారు ప్రసంగగతిని. 20

క. అతిరాత్రము సేయుటయుం
గ్రతువిఘ్నకరుండు కాళికాముఖరక్షః
పతి వచ్చుటయును నిభపుర
పతిచేఁ జచ్చుటయు విని తపస్వులతోడన్. 21

క. సోమకుల శేఖరుండా
భూమీశుఁడు వేడ్క యాగముంగాచె జయ
శ్రీమహిమఁ బెంపుగని యా
సోమకళాధరుఁడు నాకు సుముఖతనొందన్. 22

ఉ. పూర్వనృపాలకోత్తములఁ బోలెడు హస్తిపురీవరుండు దా
గుర్వనురాగ సంపద శకుంతలయం దొనర న్ఘటించి గాం
ధర్వవిధి న్వివాహమయి ధన్యతనొంది మదీయయుష్మదా
శీర్వచనాభివృద్ధి ఫలసిద్ధిఁ బ్రసిద్ధిగ నేఁగినాఁడొగిన్. 23

క. విశ్వామిత్రతనూజకు
విశ్వోన్నతుఁడైన ప్రాణవిభుఁడు ఘటిల్లె
న్శాశ్వతుఁడు సోమతీర్థమ
హేశ్వరుఁడిటు న్రాప్రయాస మీడేఱించెన్. 24

గీ. కాలకంఠసమానుఁడు గాధిసూనుఁ
డతనితనయకుఁ దగినచోటయ్యెఁ, బరుని
యన్వయము సుద్ది దెలిసినయదియ యైన,
వినుఁడు మును విన్నవారును విననివారు. 25

సీ. జననసంస్థాన మెవ్వనికి మందాకినీ
నాథుఁ డాఱవసింధు నాయకుండు
నిజసహోదరు లెవ్వనికి దివ్యమణి
కల్పకశ్రీమరుద్ధేను కౌస్తుభములు
కారణం బెవ్వని కళలసంపన్నత
యోషధివైభవాభ్యున్నతికినిఁ
దానకం బెవ్వని కానతామర
పాదపంబైన యభవు కపర్దసీమ.

తే. మనుచు నెవ్వాఁడు తన్నిచ్చి యనల
భాస్కరాది దేవనికాయంబు నర్థితోడ
నతఁడు మృత్యుంజయునకుఁ బర్యాయ తనువు
తారకశ్రీకరుండు సుధాకరుండు. 26

గీ. కాంతిగుణముల రూపరేఖావిభూతిఁ
దెలియఁ బ్రతిబింబమునుబోలె దీపమునను,
దీపమునుబోలె నుదయమందిన
బుధుండు కాంచె ఘనశక్తి నాల్గవ గ్రహపదంబు 27

క. ఆ సౌమ్యునకును, భూసుర
భాసురహస్తములు గాదెబండరువులుగాఁ
జేసిన పురూరవుఁడు
దిగ్వ్యాపితసితకీర్తి చక్రవర్తి జనించెన్. 28

ఉ. తామరసప్రియుండుఁ గుముదప్రియుఁడుం గులవృద్ధులైన మా
తామహుఁడు న్పితామహుఁడు దథ్యమ దెవ్వని కట్టి రాజసు
త్రాముఁ బురూరవుం దగు నిరంతరముం గణుతించి పేర్కొనం
గామగవీసువర్వమణికల్పకసోదరహస్తపల్లవున్. 29

క. ఆ చక్రవర్తి నిలిపెను
క్ష్మాచక్రమునందు దిగ్విజయ శాసనము

ప్రాచి నవాచిఁ బ్రతీచి ను
దీచిని వరుసం గడుం బ్రతిద్వీపమునన్. 30

వ. ఆ పురూరవశ్చక్రవర్తికిం గీర్తనీయచరిత్రుం డాయువను రాజన్యుండు నిరభినందితసౌజన్యుండు జన్మించె నమ్మహారాజునకు ననదృశదక్షిణ భుజాస్తంభసంభావితకుంభినీమహితుండు నహుషుం డుదయించి సమంచిత క్రమంబున, 31

క. శీలించె నఖిలవిద్యలుఁ
జాలించెఁ బ్రధానిజనుల శాసనమునకుం
దూలించె బుధులలేములు
కీలించె వితీర్ణిచేతఁ గీర్తులచేతన్. 32

మ. అతిధన్యుండగు నా నృపాలమణి సమ్యగ్దక్షిణా లాలిత
క్రతువుల్నూరొనరించి పుణ్యవిభవాకల్పం బనల్పంబుగా
స్తుతచింతామణి నిల్పి వేడ్క సుమనస్తోమంబు సేవింపఁగా
శతమన్యుండయి యేలె వజ్రతరభాస్వద్దుర్గము న్స్వర్గమున్. 33

క. ఆనహుషునకు యయాతి య
శోనిధి జననంబు నొంది శుక్రున కెలమిం
దానల్లుండై తత్సం
తానంబునఁ బూరుఁ బుణ్యతనునిం గాంచెన్. 34

వ. ఆ పూరుండు జఘన్యాత్మజుండయ్యును దండ్రికి శాపవశంబున సంప్రాప్తంబైన జరాభారంబుఁ దా భరించి జనకప్రసాదంబున సకలమహీమండలంబునకుం గర్తయయ్యె; నమ్మహాభాగునకు జనమేజయుండు సంభవించి యశ్వమేధత్రయంబుఁ జేసి జగత్త్రియవిఖ్యాతిం గాంచె; నా పుణ్యనిధికిం గుమారుండుదయాచల పర్యంతంబుఁ బ్రాచి దిగ్విజయంబునొంది ప్రాచీశుండనం బరఁగె; నారాజునకు సంయాతి జన్మించె; నాభూపతికి నహంయాతి యుదయించె; నన్నరేంద్రునకు సార్వభౌముం డుదయించె; నారాజన్యునకు జయత్సేనుండు జనియించె; నావట్టభద్రునకు సురాధీ

నుండు ప్రభవించె; నవ్విభునకు మహాధేనుండు పుట్టె; నాసుచరిత్రునకు యుతానియుతుండు గలిగె; నాయశోధనునకు నక్రోధుండు పుత్రుండై ధాత్రీమండలం బేకచ్ఛత్రంబుగా నేలె; నామూర్ధాభిషిక్తునకు దేవాపి జననంబొందె; నయ్యేకవీరునకు రక్షకుండు సాధుజనరక్షకుండు సుతుండై, 35

శా. ఏలె న్భూభువనంబు సర్వమును దానేకాతపత్రంబుగాఁ
దోలెన్ వైరుల వెన్నుదన్ని హిమవద్దుర్గాటవీ వాటికం
బోలెం బూరుఁ బురూరవు న్నహుషుని న్భూరిప్రతాపంబునం
జాలెం దిక్కరిదంత పఙ్క్తుల యశోజాలంబుఁ గీలింపఁగన్. 36

చ. అతనికిఁ బుణ్యవంతుఁడు, దయానిధి, విక్రమచక్రపాణి, దా
మతిధరుఁ డుద్భవంబయి సమగ్రవిభూతి సరస్వతీ తటాం
చిత ధరణీప్రదేశమునఁ జేసెను ద్వాదశవార్షికంబుగా
వ్రతముధరించి భూభువనవర్ణితవైభవ సత్రయాగమున్. 37

ఉ. ఆ హరిణాంక వంశజుని యందనురక్తి వహించి తాజగ
న్మోహినియైన చారుతరమూర్తి వహించి సరస్వతీమహా
వాహిని తాన యిచ్చమెయివచ్చి జనంబులు చోద్యమందఁగా
గేహినియై సుఖించుచు నికేతమున న్వసియించెఁ బేర్మితోన్. 38

వ. ఆ మతిధరునకు నసదృశయశస్విదృశుండు సంభవించె; నక్కుంభినీవల్లభునకు సమగ్ర యశోవిశాలుండు నీలుం డుదయించి, 39

ఉ. ఏలెను ధారుణీవలయమెల్లను వైరములేక యుండఁగా
వ్రాలిన యన్యభూభుజుల వంచి వశంబుగఁ జేసి జన్నము
ల్చాల నొనర్చె భూసురులు సంతసమందఁగఁ గీర్తనీయుఁడై
నీలుఁడు నిత్యకీర్తిరమణీరమణీయుఁడు మాన్యుఁ డెంతయున్. 40

ఉ. సంతతపుణ్యుఁ డానృపతి సత్తముఁ డుత్తమపుత్రుఁగాంచె, దు
ష్యంతుని, నిత్యనిర్మల యశఃపలితావధిభూధరాపర

ధ్వాంతుని, వైరిభూవరకృతాంతు, నితాంతకృపాసమంచిత
స్వాంతుని, రూపనిర్జిత జయంతుని, సత్ప్రియభాషణక్రియా
శాంతుని, భూరిసద్గుణ [1]నిశాంతుని, భూతల సద్విశాంతునిన్. 41

వ. ఏతాదృగ్వంశకులాభిజాత్యంబుల శకుంతలకు ననుకూల దాంపత్యంబు దైవఘటనం ఘటిల్లె నిది మీయందఱకు మనోహరంబ కదా యనిన వారలు కీర్తించి మీ పరిగ్రహానుగ్రహంబులుంగల వోటికి దైవంబు నానుకూల్యము వహించుట యేమి చోద్యంబని కొనియాడుచుండఁ జండకిరణమండలంబు గగనఖండంబునకు మధ్యవర్తి యగుటయు మాధ్యాహ్నికానుష్ఠానంబున కనిపించుకొని యా నీవారముష్టింపచు లరిగిరి కణ్వమునీంద్రుఁడును స్నానార్థంబు తరంగిణి కరిగె ననంతరంబ, 42

ఉ. వాసుకిహారముం, బెదరువన్నెలకౌనును, నమ్మవిల్తుని
న్మేసినకన్ను, రెంటికిరుమిక్కిలికేల్గవయున్, హాలాహల
గ్రాసకళంకకంఠమును, గల్గన యాకఱకంతుమూర్తి, దు
ర్వాసుఁడు[2]నిల్చెఁ గణ్వమునివల్లభుపర్ణగుహాంతరంబునన్. 43

క. భాసాంద్రుఁడైనముని
దుర్వాసునిఁ గనుఁగొనియుఁ బ్రాణవల్లభుపైఁ జిం
తాసక్తి శకుంతల దా,
నే సత్కారమును జేయ నెఱుఁగక యున్నన్. 44

ఉ. శాపముఖంబునం గొనలు చాఁగి యుగుర్చు తపోమహీజ మ
త్తాపసి; యట్టి మూర్ఖముని తాలిమి లేక నిజేశుఁ డెవ్వఁ డా
ద్మాపతి యీసతి న్మఱచుఁగాకని యెంతయు నిర్దయాత్ముఁడై
కోపముఖంబుల న్వడి శకుంతలకిచ్చెఁ గఠోరశాపమున్. 45

క. ఘనశాపమిచ్చి యరుగం
గనుఁగొని యనసూయ భీతకంపితయై వం

---

1. విశాంతుని; 2. వచ్చె.

దనమొనరించుచు శిశువది
యనుకంపకుఁ గాక కినుక కది లక్ష్యం బే. 46

గీ. కాస్యపుఁడు తండ్రిగాఁగ నిక్కన్నియకును
బుత్రి యిది మీకు; బుద్ధిచెప్పుదురుగాక
యింతయలుక వహింపగ నేమిగలదు
అనఁటిపండొల్వ నేటికి నినుపగోరు. 47

మత్త. ఫాలలోచనుఁడైన నిల్చి తపస్విసత్తమ తావకో
త్కలకోపకృశాను వేఁడిమికి స్సహింపఁగ నోపఁడీ
బాలయోర్చునె కిన్కమీరొక పట్టున న్నదలించినం
జాలదే, కట తోఁటకూరకుఁ జంద్రహాసముఁ దెత్తు రే. 48

గీ. ప్రియుఁడు మఱచిన యేని నీళిసరుహాస్య
యును బదంపడి తనలోన నొకటియైనఁ
గాస్యపుఁడు వడు దుఃఖసాగరములోన;
నందు నీకు మనఃక్లేశ మావహిల దె. 49

గీ. తల్లి విషమువెట్టఁ దండ్రి యమ్మఁగ,
మాన్పఁ గలరె యొరులు జగతిఁ, గాస్యపునకుఁ
బుత్రి నీకుఁబుత్రి, పొలఁతుక నీఁక నీళ్ళ
ముంచు పాలముంచు మునివరేణ్య 50

వ. అని వినయవచనంబుల విన్నవింపఁ గృపాళుండై యెప్పుడేని ప్రియుండు ముద్రికాదర్శనంబు సేయు నప్పుడీవిద్రుమాధరి గలసిమెలంగగలవాఁడీ పువ్వుఁబోఁడి గర్భంబు నందలి యాదిగర్భేశ్వరుండైన యర్భకుండు చక్రవర్తిపదంబు నొందునని వరంబిచ్చి పీడ్కొని చనియె, నమ్మునిపుంగవుని శాపంబమోఘంబు గావునం దత్ప్రభావంబునం దుష్యంతమహీకాంతుండు శకుంతలా నామమాత్రంబును మఱచి రాజ్యానుసంధానంబు సేయుచుండఁ గ్రమక్రమంబున 51

క. ఇంతి యుదరంబునను
దుష్యంతుని వీర్యంబు నిలిచి చారుశమీగ
ర్భాంతరలీనాగ్నిక్రియ
నన్తర్గతమై వెలింగె నభినవభంగిన్. 52

చ. నెలమసలెం, దనూలతిక నిద్దముదోఁచె, గపోలపాళిక
ల్దెలతెల్లనయ్యెఁ, జెన్నడిమి లేములువాసె, వళిత్రయంబును
గ్గులు విరిసె, న్జవుల్చెడియెఁ, గూరుకు పెద్దయునయ్యెఁ జిట్టము
ల్వలుమఱుఁబుట్టెఁ, నొక్కొక్కటిపై నుదయంబును బొందెఁ గోరికల్. 53

చ. కిటకిటనయ్యె నెన్నడుము కేసరిమధ్యకు నాఁడునాఁటికిం
బుటపుటనయ్యె నారు కడుఁ బొల్పువహించెఁ దనూలతాద్యుతు
ల్నిటనిటనయ్యె సోలము జనించె విశాలవిలోచనంబులు
న్వటవటనయ్యె సొంపు గల వాతెఱ కెంపును బూఁటపూఁటకున్. 54

మ. నవనాభీసరసిం బురందరదృషద్ణాళంబుతో వీఁకయై
కవబంగారపుఁ దమ్మిమొగ్గలొదవంగ న్వాని యగ్రంబులన్
దవిలె న్మత్తితి షట్పదంబులన నందంబయ్యెఁ జూలంద నా
ధవళాబ్జాక్షికి నాఁడుఁ జన్నులును మీఁదం జూచుక ద్వంద్వమున్. 55

సీ. ఉరుకీర్తి యగుమూర్తి యుదరంబులోఁ
జూలు నిలిచియుండుట మేను వెలఁకువాఱె
భువనభారవహుండు పుత్రుండు కడుపులో
నృద్ధిఁ బొందుటఁ గడు వ్రేఁగునయ్యె
నమృతాంగుఁడగుపట్టి యంతర్గతుండౌటఁ
జవులెల్లనొగి నరోచకములయ్యెఁ
గమలాయతాక్షుండు గర్భస్థితుండౌటఁ
దెలిమించు వాలుఁగన్నులు జలించె

తే. ధరణి యెల్లను భుజియించు తనయుఁడౌట
మోదమొదవె సదా మృదాస్వాదమునకు
నవకమై యుదరంబు సనాథయగుట
నభ్యుదయ మొందుచును వచ్చె నబ్జముఖికి. 56

ఉ. శాశ్వతకీర్తులం దిశల సారణ సేయఁదలంచు సర్వభూ
మీశ్వరభామినీజనములెల్ల బనుల్గొన నిచ్చగించు నీ
విశ్వము నేలుకోదివురు ప్రేకటి కోరుకులందు నాది గ
ర్భైశ్వరుఁ గుక్షిలోన ధరియించిన యట్టి మహానుభావతన్. 57

శా. సూనుం గర్భమునం ధరించి సుతతేజోరాజనం బెట్టిదో
ధ్యానం బెప్పుడునాథుపై నిలుపు నాతన్వంగి, నేజేల నే
తానై వచ్చినదాఁక నేమిటికిఁ జింతాదైన్యమంచున్ మదిం
బూనెం గర్వము తన్ను నేఁచు మరుఁడుం బూవిల్లు ముద్రింపగన్. 58

వ. ఇత్తెఱంగున నాది గర్భేశ్వరుండుగాఁగల యర్భకుం గర్భకుహరంబునం బూని నిధానగర్భయగు రత్నగర్భ ననుకరించు నద్దేవికిం గ్రమంబున నవ మాసంబులు బరిపూర్ణంబు లగుటయు, 59

క. భానునిబొందక యుచ్చ
స్థానంబున గ్రహము లైదుఁ దనరఁగ ఫలదం
బైన శుభయోగమునఁ దే
జోనిధి భాగ్యోన్నతుండు సుతుఁ డుదయించెన్. 60

క. శిఖిన ర్తించెఁ బ్రదక్షిణ
శిఖలును దశదిశలు నుల్లసిల్లెను నానా
సుఖసులభ గంధవాహము
లఖిలజనానంద కరములై వీతెంచెన్. 61

సీ. తలలంటి రతిపుణ్యతాపసాంగనలు
నెంతయు వేడ్క నింగువీతైలమునను
నుటజాంగణమునఁ గాపుని పేరితవుటితో
వెల్లుల్లిపొగ యిచ్చి పీతిహోత్రుఁ
జాగించి రంచితోత్సవము మువ్వురు
టాలి వైభవంబు తృతీయవాసరము
నాఱవ దివసంబునం దాచరించిరి
బహుయోగినీ గణప్రార్థనములు

తే. కొలఁకు గడపిరి దినముల కొలఁది యెఱిఁగి
యఖిలమునిధర్మపత్నుల నామతించి
విన్నఁబోకుండఁ గ్రియలెల్ల విస్తరిల్లఁ
జగ మొనర్చిరి పురుటాలి తగవులెల్ల. 62

వ. తదనంతరంబ సకల మౌనివర్గంబును రావించి కణ్వమహామునీంద్రుండు పుణ్యాహంబు చేయించి భరతుండను నామంబు దౌష్యంతికిం బెట్టి పెనుప గ్రమప్రవర్ధమానుం డగుచు, 63

సీ. నృపకిరీటంబుల నిలుపుదునను మాడ్కిఁ
బొదిగిటిలో నుండి పదములెత్తు
క్షితిమిన్ను వడ్డను జేయొడ్డి రక్షింతు
ననురీతిఁ జేతులల్లార్చియునుచు
దానాంబువులు పట్టి తగవిప్రులకు
నిచ్చువడువునఁ బిడికిళ్ళు బట్టి విడుచు
వెలయఁ బ్రతాపాగ్ని మొలపించి యారయు
పగిదిఁ బ్రేమమున దీపంబుఁ జూచు
తే. సద్వ్రతసరాజవిభవంబు లపహసించు
తెఱఁగు దోఁప నలంతి వేఁదులు నవ్వఁ
గాణ్వపర్షి మనంబునఁ గౌతుకంబు
సంతతంబు జనింప శాకుంతలుండు. 64

వ. అంత నొయ్యనొయ్యన పర్యాయంబున, 65

సీ. సింహాసనంబునఁ జేరి రాజులు గొల్వనుండు
చందమునఁ గూర్చుండ నేర్చె
ధర్మంబు నాల్గుపాదంబుల నడిపింతు
ననువిధంబున నడ చాడ నేర్చె

దొరలునో యన్నృతంబు తఱచుమాటల
నను పగిది నొక్కొకపల్కుఁ బలుకనేర్చె
వర్ణాశ్రమంబులు వరుసదప్పకయుండ
నిలుపుదు ననుభంగి నిలువనేర్చె
తే. ధాత్రి కరమందు సంశమైదుపది తనకు
నర్హమను పోల్కి ధాత్రి కరాంగుళమునఁ
గడఁకబట్టి యల్లల్లన నడువనేర్చె
నాఁడు నాఁటికి నిషధపురనాథసుతుఁడు. 66

శా. బాల్యం బంతట నుజ్జగించి పలుకుంబ్రాయంబునం బొందె సౌ
శీల్యం బొప్పఁగఁ జేసె నధ్యయనము న్మీలించె శస్త్రాస్త్ర సా
కల్యంబు న్గురుశిక్షఁ జెంది చదివె న్నానావ్యాగమాదు ల్మనో
లౌల్యం బింతయులేక కోవిదజను ల్ప్రౌఢుం డితం డౌననన్. 67

గీ. కొఱఁత లేకుండ విద్యల నెఱవెఱింగి
క్షత్రవీర్యంబు గాన[1]నిసర్గమైన
శౌర్యమును, సత్త్వమును, రాజసమును,
పెంపు, మదము, బాహుబలంబును, నదటుమిగుల. 68

సీ. ముంజేతఁ గరకాండములు చుట్టుకొని
వనద్విరదరాజంబులఁ దిగిచితెచ్చి
కొనవెంట్రుకలు పట్టుకొని పంచరించిన
పంచాననంబుల బట్టి తెచ్చి
వాలాగ్రముల ముళ్ళువైచి లంకెలను
శార్దూలపోతకములఁ దోలితెచ్చి
దొడ్డికట్టుగ నాఁగి తొలఁగి పోవఁగనీక
యచ్ఛభల్లముల బెల్లార్చితెచ్చి

1. నైసర్గమైన.

తే. కర్ణమూలంబు నులిమి లేఁగలను బోలె
నేకలంబుల నొండొండ యీడ్చితెచ్చి
దామెనలుగట్టి యాశ్రమస్థలమునందు
శైశవక్రీడ నాడు దుష్యంతసూతి. 69

వ. ఇట్లనన్యసాధారణంబగు సత్వంబున నుగ్రసత్వంబుల నెదురులేక యేక హేళిం జరించు నారాజసూనునకుఁ గాననౌకసులు సర్వదమనుం డను నామంబు వెట్టి ప్రేమంబు సేయుచుండ నొక్కనాఁడు కాశ్యపమునీం ద్రుండు కుమారకల్పుండగు కుమారు నూరుపీఠంబున నునుపుకొని యుప లాలించుచున్న శకుంతలం గనుఁగొని సంతోషిత స్వాంతుండై మధుర గంభీరస్వనంబున నిట్లనియె, 70

క. తొలుపుట్టవు నీనోముల
ఫలమెట్టి దకో మనోజ్ఞపతిఁ బడసి సుతుం
గులదీపకరునిఁ గంటివి
లలితాంకి చక్రవర్తిలక్షణయుక్తున్. 71

గీ. పెద్దకాలంబు చనియె నీప్రియుఁడు వాని
తెలువ యేలొకో పిలువఁబుత్తేక తడసె
వెలిచెనో మన్మనఃప్రీతి విధమెఱుఁగక
మఱచెనో రాజ్యసుఖకేళి మగ్నమతిని. 72

ఉ. నేరము లెన్నిగల్గిన గణించుట నేరము ల్లువారిపై
నేరుపులైన యల్లురును నేరములెన్నుదు రత్తవారిపై
వారల నేర్పు నేరములు వంకలు దీర్ప నయుక్త మెల్లడం
గౌరవహీనులిజ్జగతిఁ గన్నియ నిచ్చినవారు కోమలీ. 73

గీ. రాజులఁట మీఁద వారలే యోజఁ జనిన
భద్రగజములు నడచిన పథములవియ
లసితమై యుండునట్లు సాధ్వసపు
నీవు ధవుని బెడబాసి యునికికిఁ దలఁకు గదురు. 74

సీ. జీవితేశ్వరుఁబాసి చిరకాలవసతిగాఁ
 బుట్టినింటనె యున్కి బుద్ధిగాదు
పొరుగిండ్ల నిరుగిండ్లఁ బ్రొద్దువోకలకైన
 బలుమాఱు నరుగుట పాటిగాదు
దాసీజనుల తోడఁ దఱచుగాఁ గూడి
 ప్రత్తర మాటలాడుట తగవుగాదు
తన కెంత యాప్తులైనను నన్యపురుష
 సంసర్గంబుఁ జేయుట జాడగాదు
తే. జనకగృహములనైనను మనసువఱపి
కూరనారకుఁ బంపుట గుణముగాదు
హాస్యకథలందు గీతవాద్యములయందుఁ
బ్రీతినెఱపుట మగనాలి రీతిగాదు. 75

సీ. జలక, హాహారంబు, శయనసౌఖ్యము,
 భర్తకంటెను మున్నుగాఁ గాదుసేయ
విభుఁడారగించిన వెనుక తద్భాజ
 నంబునఁ జేయ నర్హంబు భోజనంబు
ప్రియుఁడల్గి తనుఁ జేరఁ బిల్వకుండిన
 భూమి నింపుతోడుతఁ బవ్వళించుటొరవు
వ్రతములు, దేవతార్చనలు, కాంతుఁడు
 సమ్మతింపక చేత యెంతేని కలుష
తే. మప్రియంబులు చేసిన నధిపుమీఁదఁ
జిన్నబోవక మది సంతసింపవలయు
మంచిదైనను బ్రాణేశు మనసురాని
పనులుమానుట భద్రంబు వనితలకును. 76

శా. ఏభంగి న్నుచినొందుకో పతిమ నంబేభంగి రంజింతునో
యేభంగిం గులకీర్తి దాఁగలుగుకో యేభంగి వర్తింతునో
యేభంగి న్మతిరాక యుండగలనో యేణాక్షులందంచునా
యాభంగి న్మతియించుచుండఁ దగుఁ బుణ్యస్త్రీకి నెక్కాలమున్. 77

ఉ. కంచెలయుం, బటీరతిలకంబును, బాపట [1]చెందిరంబు, ఫా
లాంచలసీమ లేఁబసుపు, టచ్చుతబొట్టుఁ జెవాకు, గాజులుం
గొంచెపువీడ్యము, న్విరులకొప్పును, నొప్పునొనర్ప నెప్పుడుం
జంచలనేత్ర యుండదగు సంతతభర్తృఫలాభివృద్ధికిన్. 78

సీ. జలమాడి మడుఁగు వస్త్రముఁ గట్టి
కై చేసికొని కాని కవియబోఁ జనదుప్రియుని
మునుపు మేల్కొని భర్త మోముఁ గన్గొనికాని
కాఁగాదు వీక్షింపఁగా నితరులఁ
గడపమీఁదను సన్నెకలుమీఁద రోలుమీఁ
ద నునికి విభునికిఁ దఱుఁగుయశము
తడికాళ్ళతో వీడుదలతోడఁ గర్ణప
త్రంబుతో నిద్ర పుణ్యంబు దఱుఁగు
తే. సందెఁ దలయంటుకొనుట, వస్త్రంబు లేక
మజ్జనము చేత, విడియమాకు మట్టగించి
తాల్చుటయు, [2]నిరుగేలను దలపుణుకుట,
భర్తగల భామినుల కశుభప్రదములు. 79

క. వ్రతములు నుపవాసంబులు
మతియింప నిరర్థకములు మానవతులకున్
బ్రతివాసరంబుఁ గేవల
పతిభక్తియె చాలు నిహముఁ బరము ఘటియింపన్. 80

చ. తెలవకు వల్లభుండు పరదేశము వోయిన వన్నె మాని తా
నటితికి నల్లబూసలును, నచ్చుతబొట్టును, మట్టివన్నెగాఁ
గులుమణుగైన పుట్టమును గూడఁగదువ్వని మైలకొప్పు, నై
మలువడి యింటిలోఁ బతిసమాగమనంబ మతింపు టొప్పఁగన్. 81

---

1. చిందిరంబు; 2. నీరుగేలను.

సీ. వనితకు నిష్టదైవము జీవితేశుండు
 భామకు ముంగొంగుపసిడి భర్త,
సుదతికి నలులేనిచుట్టంబు పెనిమిటి,
 తరుణికిఁ బ్రాణమిత్రంబు ధవుఁడు,
వనజలోచనకుఁ బెట్టనికోట దయితుండు,
 నాతికి నఖిలార్థదాత ప్రియుఁడు,
కాంతకు మానరక్షకుఁ డింటియాతండు,
 సతికి నాఁడిలేనిహితుఁడు వరుఁడు,
తే. కంబుకంఠికి నిత్యశృంగారవిభవ
వల్లికకు నాలవాలంబు వల్లభుండు,
పల్లవోష్ఠికి సౌభాగ్యలక్ష్మి గణన
యొనరింపనేల యేగ్గడయమగఁడు. 82

వ. అని ప్రసంగవశంబునం గొన్ని కులకన్యకాధర్మంబు లెఱిఁగించి యనసూయా ప్రియంవదలు మున్నుగాఁ గొందఱు వృద్ధతపస్వినీ జనంబులను జతురమతులగు నిద్దఱు శిష్యులం దోడుపెట్టి శకుంతలం దుష్యంతు పాలి కనుప సమకట్టి, 83

ఉ. పొమ్మనఁ జూచుఁ జూచి మదిఁ బుట్టిన ప్రేమము పేర్మి బాష్పముల్
గ్రమ్మినఁ గ్రమ్మఱం బెడమొగంబయి కన్నులనీరు గ్రింగుచుం
గ్రమ్మఱఁ బా శకుంతలమొగంబగు చెక్కులు నించుఁ గొంతసే
పమ్ముని జాలిఁ బొంది ధృతియంతయు నిల్వక విచ్చిపాఱఁగన్. 84

ఉ. ఎంత మునీంద్రులందు విజితేంద్రియుఁడైన తపస్వి కూర్మిగా
పెంచి శకుంతలం బెనిచి విస్మృతి నొందిన మోహపాశముల్
ద్రెంచుకొనంగ లేక తియతీపులఁ జిత్తముఁ గాసి వెట్టె శీ
లించిన నెవ్వఁడింక వదలింపఁగ నోపెడు పాశబంధముల్. 85

సీ. క్రకచధారాకఠోరంబైన [1]కక్కుల
 క్రొవ్వాఁడికొడవంటఁ గోయరాదు

1. గ్రక్కుల.

కూలాయసోద్దామ కుద్దాలములఁ
 ద్రవ్వి త్రేళ్ళతోఁ బెకలించి వేయరాదు
సమిదాజ్యముల నగ్ని సమకొల్పి
 దారుణశిఖలఁ గాలిచి నీఱుసేయరాదు
ఘనముష్టిఁ గబళించి కపటపద్ధతిఁబట్టి
 తెగఁ జేతితోడ రాఁదీయరాదు
తే. హృదయ మను పాదులోపల నుదయమంది
తల్లిదండ్రులమీఁద, సోదరులమీఁదఁ,
దనయబంధుకళత్రమిత్రములమీఁద,
మూరివోవంగఁ బ్రాఁకిన మోహలతను. 86

వ. ఇట్లు బంధురంబగు మోహలతా బంధంబున నమ్ముని సింధురంబు కట్టు
వడి ప్రకృతి జనంబుకై వడి శకుంతలాభిముఖుండై. 87

సీ. అత్తమామలకు నీయ పనేమి పెట్టకఁ
 గనుసన్నఁ జేయుమీ పనులెఱింగి
ప్రాణమిత్రములుగా భావించి యెప్రొద్దు
 సవరింపుమీ ప్రేమ సవతులందు
భర్త యొక్కొకవేళ బహుమాన మొనరింప
 గదియరానీకుమీ గర్వరేఖ
పతి చిత్తమెఱిఁగి తత్పరిజనంబులమీఁదఁ
 జేయుమా మిగుల దాక్షిణ్యగరిమ
తే. కలఁకనొందకుమీ భవుఁడలిగినపుడు
పలుకులను జేరనీకుమా పరుసదనము
వీని వెలిగాఁగఁ దిరుగు నే వెలఁదియైనఁ
గులమునకు నాధియగుఁ జుమీ కూఁతుఁగుఱ్ఱ. 88

ఉ. సంపయికూర్మి తద్గురుజనంబుల పైనిడి, మౌనికన్యకా
స్థాపితవృత్తి బంధువనితాతతియందు ఘటించి, యిష్టస
ల్లాపములందు నిచ్చటుఁ దలంపక నిచ్చలుఁ బ్రాణనాథునే
వాపరతంత్రవై యెటుల వన్నియఁ దెచ్చెదో నాకుఁ బుత్రికా! 89

ఉ. ఎన్నఁడు నామది న్మఱతు నేనిటఁ బుత్త్రిక పూఁటపూఁట యా
సన్నసరోవరంబు నను సంస్మరణం బొనరింప సంతత
స్విన్నమరందసిక్త సరసీజముఁ జూచి మదంతికంబునం
గన్నుల నీటితోడఁ గుళకం బగుచున్న భవన్ముఖాబ్జమున్. 90

ఉ. కొంత సుఖంబునుం గలదు కోమలి నాకిటఁ బర్ణశాలికా
ప్రాంతము నందు నీవు పెనుపం బరువొందిన మాలతీలతా
క్రాంతమనోజ్ఞమైన సహకారముఁ గన్గొనునప్పుడెల్ల దు
ష్యంతుఁడు మాళకుంతలయు సంగడి నుండుటగాఁ దలంపగన్. 91

వ. అని ప్రేమాతిశయంబున లతాతరువితానం బవలోకించి, 92

సీ. అల పెఱుంగక తావకాలవాలములకు
నెమ్మితో నిరవొంద నీరువోసి
క్రమవృద్ధిఁ బొందు మార్గంబు లారసివచ్చి
పూఁటపూఁటకుఁ జాలఁ బ్రోదిచేసి
ప్రేమాతిరేకత ప్రియమండనమునకుఁ
జిగురాకుఁ గొనగోరఁ జిదుమవెఱచి
పరిపాటి నల్లన ప్రసవోద్గమంబైన సఖులుఁ
దాను మహోత్సవ మొనర్చి
తే. తల్లియై పెంచె మిమ్ము నే తలిరుఁబోఁడి
యత్తవారింటి కరిగెడు నా లతాంగి
క్షితిరుహములార పుష్పితలతికలార
యనుమతింతురు గాక కల్యాణయాత్ర. 93

గీ. తోడునీడయుఁ బోలె నీతోయజాక్షి
పెరిఁగె నిన్నాళ్ళు మీలోనఁ బెద్దయయ్యెఁ
బురుషునింటికి ననుపక పుట్టినింట
నునుచుకొనరాదుగా యంచు నుస్సురనుచు. 94

వ. ఎట్టకేలకు ధైర్యంబు వట్టుకొని, శకుంతలం దోడ్కొని, యగ్ని హోత్రంబునకు దండంబు వెట్టించి, మునులకును నమస్కారంబు సేయించి, పుణ్యతపస్వినీ జనంబులకు మ్రొక్కించి, తదీయాశీర్వాదంబుల తోడఁ దానును దీవించి యనుపుటయుఁ దండ్రి పాదంబులకుఁ బ్రణామం బాచరించి, 95

సీ. జనకుఁడుండెడు ననుష్ఠానవేదికఁ జూచుఁ
జూచి క్రమ్మఱఁబోయి చూడవచ్చు
స్నానార్ధనియమితజలజాకరముఁ జూచుఁ
జూచి క్రమ్మఱఁ బోయి చూడవచ్చు
నిజహస్తపోషితకుజవల్లికలు చూచుఁ
జూచి క్రమ్మఱఁ బోయి చూడవచ్చుఁ
గుంజకోటరకుటీక్రోడ వీథులు చూచుఁ
జూచి క్రమ్మఱఁ బోయి చూడవచ్చు
తే. తండ్రిఁ బాయంగలేని సంతాపజలము
నత్తవారింటికేఁగెడు హర్ష జలము
గోరువెచ్చన పాలిండ్ల కొనలు దడుప
నెడపఁదడపనఁ బయ్యెదఁ దుడిచికొనుచు. 96

సీ. కదలునాలుగుమూడుఁ బదములు క్రమ్మఱి
తండ్రిపాదంబు లొఁదల ఘటించుఁ
గొంత దవ్వేగు నేగుచువచ్చి కణ్వుని
కడుపులోఁ దలమోపి కౌఁగలించు
నరుగుఁ గొండొక నేలఁ దిరిగి మౌనులకు
మాయయ్య సుఁడీ యని యప్పగించు
గమనించుఁ బెడమర్లి కాన్యపు దెసఁ జూచి
నేఁ బోదునంచుఁ గన్నీరు నించు
తే. జనకు డుపలాలనము సేయ సంయమీంద్ర
భామ లదలింప ననసూయ పట్టి తిగువ

నిగిడి యడుగిడె నొకభంగి మగిడి మగిడి
చూచుకొంచు శకుంతలానూనగంధి. 97

క. మునిభామలు నలువంకలఁ
జనుదేరఁగ నిర్మలోర్మి సంగతయగు న
య్యనిమిషనది రత్నాకర
మున కేగెడు భంగి గదలిపోవుచు నెదురన్.  98

సీ. కీరకోకిలశారికారావముఖరిత
బహిరంగణారామ భాసురంబు
దళదబ్జకైరవోత్పల మనోహారి నీ
రాగాధపరిఘాసమావృతంబు
స్ఫాటికమణిశిలాప్రత్యగ్ర రచనాతి
విస్తృత ప్రాకారవేష్టితంబుఁ
శుభ్రరోచిరభ్రవిభ్రమాభ్రంకష
బహువిధ ప్రాకారబంధురంబుఁ
ఆ. గాంచిరంత మౌనికాంతాశకుంతల
లబ్ధిమేఖలా సమంచితాంఘ్రి
నూపురంబు, నతి మనోజ్ఞ
కల్పితరత్న గోపురంబు, హస్తినాపురంబు. 99

వ. కాంచి యనేకవారణ, తురగ, రథ, భట, సేనాధిప, ఛత్ర, చామరాన్విత సత్పురీ సముచిత వైభవంబులకు నాశ్చర్యాద్భుత ప్రమదరస మగ్నహృదయులగుచు నల్లనల్లన యరిగి యప్పట్టణంబుఁ బ్రవేశంబు చేసి రాజమందిరద్వారంబున నిల్చి తమరాక ఫణిహారుల చేతం బుత్తెంచుటయును వారునుం జని యహా భూమింజయుం గాంచి కణ్వాశ్రమంబున నుండి యిద్దఱు తపస్వులుఁ గతిపయతపస్వినీజనంబును దేవరకుం బొడసూపనని వచ్చి వాకిటనున్న వారని విన్నవించిన నన్నరనాథుండు మునినాథుం డిట్లు పుత్తెంచుటకు నెయ్యది గతంబొకో యని విస్మయభయంబులు మనంబునం బెనంగొనంగ సభాస్థలంబుల స్త్రీ జనులం

బొడసూపించుకొనుట యనర్హంబని యందఱ వీడుకొలిపి నగరిలోనికిం జని యంతఃపురాంతికంబున నేకాంతసౌధంబున నాసీనుండై మాన్య లగు వృద్ధ కాంతలం బనిచి వారల రప్పించుకొని యుచితసత్కారంబు లొనర్పం బ్రీతులై పురోభాగంబునం గాన్యపశిష్యులు వారి వెనుక సంయమిరాజకాంతలు వారి మఱుంగునం గుమారయుక్తయై శకుంత లయు నిలిచియుండి రయ్యెడ నా సంయమిశిష్యులు దుష్యంతు నాశీర్వదించి, 100

క. జననాథ మద్గురుండగు
మునినాథుఁడు మీ సమీపమున కనిపెడుచో,
దనమాటలుగా నీతో, నను
మన విని జిత్తగింపు మవధానమతిన్. 101

మ. లలితాఖేటరతి న్మదాశ్రమము లీలంజొచ్చి యచ్చో శకుం
తల గాంధర్వమున న్వివాహమయి కందర్పాజ్ఞలోన న్నవో
త్కలిక న్గొన్నితిథు ల్చరించి యటమీఁద న్రాజ్యరక్షాకుతూ
హలివై క్రమ్మఱఁ జిత్తగింపవ తదీయంబైన వృత్తాంతమున్. 102

గీ. ఏమెఱుంగని పనియని హృదయవీథి
వెఱచెనో కాక మఱచెనో వెనుకఁ జింత
మఱపులేదైన బహుకార్య మగ్నమతులు
ధారుణీనాయకులు గదా దానికేమి. 103

క. మానసరసీరుహ నేత్రకు
నీ సంగతిఁ బుత్రకుఁడు జనించెను నరక
త్రాసకరుండై నరక
త్రాసకరుండగుటఁ జక్రధరుఁడును బోలెన్. 104

సీ. కులము మేదిని మీఁద ఖిలముగాకుండంగ
నభివృద్ధి కారణం బాత్మజుండు
సౌఖ్యదంబైన సంసారద్రుమంబుల
కాలవాలస్కంధ మర్భకుండు

జంపతులకు హర్ష జలరాశి యుబ్బింపఁ
బూర్ణేందుబింబంబు పుత్రకుండు
గృహమేధి ధర్మలక్ష్మికి పేఁపు మోపంగ
పెనుపైన యాధారభిత్తి సుతుఁడు
తే. తనయుఁ డాలోకపథమున కనుపువాఁడు
మందిరాంతర దీపంబు నందనుండు
సూనుఁ డిలు పిటిఁ బోకుండ
సొమ్ము కర్త యపరవయసున నాలంబయష్టి కొడుకు. 105

ఉ. కేవల పుత్రుగాఁగఁ బరికింపఁగఁ జాలినవాఁడు గాఁడు దా
నీ వనరాశివేష్టిత మహీతలచక్రము చక్రవర్తి ల
క్ష్మీవిభవంబు నొంది పరిశీలనఁ బాలనసేయు నన్యథా
శ్రీవరమౌళిరత్నఘనదీప్తి ధగద్ధగితాంఘ్రిపీఠుఁడై. 106

క. ఏణాంకవంశచూడా
మాణిక్యంబయిన నీకుమారుని సకల
క్షోణికి యువరాజ్యరమా
పాణిగ్రహణం బొనర్పు పరమప్రీతిన్. 107

వ. అని జననీసమీపముననున్న భరతుం గొనివచ్చి, సమ్ముఖంబు చేయించి,
యనసూయాప్రియంవదలచేత, శకుంతల నంతికంబునకు రప్పించి, 108

క. జననాథ యిదె శకుంతల
యనసూయారుంధతులకు నణుమాత్రంబై
నను వ్రతపడదు శీలం
బున నియ్యెడ కింతి ననిచి పుత్తెంచుటయున్. 109

ఉ. సద్గుణశాలివైన నినుసంస్తుతి చేసి కుమారిఁ జూచుచున్
హృద్గతమైన మోహాభర మేమనిచెప్ప నృపాలచంద్ర యను
ద్యద్గళదశ్రువు ల్వెడలి వదనాబ్జము డిగ్గిపాఱఁగా
గద్గదకంఠనాళుడయి కణ్వుఁడు మీ కనియెం బ్రియోక్తులన్. 110

క. జనయిత్రి కనియె నింతియ
జననం బాదిగ నితాంత సమ్ముదమతినై
యనువాసరము శకుంతలఁ
బెనిచితి నే ముక్తిబాలఁ బెనిచిన భంగిన్. 111

సీ. మహనీయ సంయమంబ మహాధనంబుగా
మతియించి వర్తించు మమ్ముఁ దలఁచి
యెసఁగ శాపానుగ్రహ సమర్థుఁడైన బ్ర
హ్మయత తేజు గాధేయుఁ దలఁచి
గణనకెక్కిన దేవగణికాతతికి రత్న
ముకురమై వెలుఁగు మేనకఁ దలంచి
యాఖేటరతి వచ్చి యాశ్రమస్థలిఁ దడ
బాటు చేసిన చెల్లుఁబడిఁ దలంచి
తే. మిక్కిలిగ మన్ననయుఁ జేసి మెలఁపవలదు
తక్కువయుఁ జేయవలవదంతఃపురంబు
సతులలోపల సరియకా, సరవితోడ
నీశకుంతల భూకాంత యేలుమనియె. 112

గీ. అనిన నమ్మాటలకు నసహ్యాంబునొంది
యొఱుఁగుపైనున్నవాఁడు బెట్టులికి లేచి
కర్ణములు మూసికొని శిరఃకంప
మొదవఁ దొలుత హారహరహార యంచుఁ బలికి పలికి. 113

క. మునికన్యకయఁట, నేనఁట,
వనమున గాంధర్వమున వివాహంబఁట, సూ
నుని గనెనఁట, మఱచితినఁట,
వినఁగూడునె యిట్టిభంగి విపరీతోక్తుల్. 114

ఉ. కాయజవైరి సన్నిభుఁడు కాశ్యపుఁ డాతని పుత్రినిచ్చ నేఁ
జేయుట యెట్టు కార్యఫలసిద్ధి వహించుట యెట్టు భస్మముం

జేయఁడె చంద్రమఃకులము చిన్నగు సన్నను వింతయెంత య
న్యాయపుమాట; తీఁట గొనినం గొఱవిం దలగోకికొందురే. 115

గీ. చదువనే మున్ను ధర్మశాస్త్రంబులన్య
కామినీరతి కలుషంబుగా నెఱుఁగనె
యన్యసతి మాత్రమే కాస్యపాత్మజాత
యరయ నంగారకల్పితమైన ప్రతిమ. 116

సీ. గజరాజగామిని కంఠసూత్రంబులు
కాలసూత్రంబులుగాఁ దలఁపక
పద్మపత్రేక్షణ బాహుపాశంబులు
కాలపాశంబులుగాఁ దలఁపక
కోమలి పీనవక్షోజ చక్రంబులు
కాలచక్రంబులుగాఁ దలఁపక
యుడురాజవదన మృదూరుదండంబులు
కాలదండంబులుగాఁ దలంపక

తే. కాలసూత్రంబు లెబ్భంగిఁ గడచు నరుఁడు
కాలపాశంబులే భంగిఁ గడచు నరుఁడు
కాలచక్రంబు లేభంగిఁ గడచు నరుఁడు
కాలదండంబు లెబ్భంగిఁ గడచు నరుఁడు. 117

వ. నా హృదయంబు పరవధూ సుఖంబునకు విముఖంబుగాని సుముఖంబు గాదు. మీరలెచ్చటి నుండి విచ్చేసితిరో యచ్చటికి నరుగుండు మీకు నిదె సేవాంజలి యనిన వారలు విని రహస్యప్రయోజనం బెఱుంగమిం జేసి యొండొరుల మొగంబులు చూచికొనుచుండ ననసూయాప్రియంవదలు డగ్గఱి ధీరగంభీరస్వరంబున నిట్లనిరి. 118

శా. ఆహా లెస్సవిచారమే మొదల నీవాఖేటకేళిన్మహో
త్సాహంబొప్పగవచ్చి యాశ్రమము నిచ్చం జొచ్చి యచ్చోట స
న్నాహప్రీతి శకుంతలం గలఁచి గాంధర్వక్రియాలక్ష్మి ను
ద్వాహంబై నప్రకార మంతయును నాత్మన్విస్మృతిబొందెనే. 119

శా. మత్తుల్ మూర్ఖతరమతుల్ ప్రియులు గామధ్వాంతకారుల్ మృషా
విత్తుల్ మత్సరమూర్ఛభావులు కకుల్ విశ్వాసహీనుల్ చల
చ్చిత్తుల్ ద్వారపదార్థకాంక్షులు బహుస్త్రీలోలుపుల్ ప్రేరకా
యత్తుల్ రాజు లటంచు వింటిమిది సత్యంబయ్యె నీపట్టునన్. 120

సీ. నెలఁగలనైనఁ బెన్నెఱివేణి పోషింపఁ
దలకుఁ జేరఁగనీదు తైలధార
ఋతుమతియైనచో దేహశుద్ధికినైన
మైనాడ నొల్లదు మజ్జనంబు
మానికండూతి ముమ్మరమైనఁ గట్ట
దుద్వాసించి వేఱొక్క వల్కలంబు
ప్రాణరక్షార్థంబు పర్ణాంబువులుగాని
మూఁతిముట్టదు కందమూలఫలము
తే. లెన్నిదివసంబులో నీవు తన్నుఁబాసి,
నాఁటనుండియు నీ శకుంతల నృపాల
నేఁటిదాఁకను నడపె నిర్నిద్రనిష్ఠఁ
దీవ్రతరమైన విరహవీరవ్రతంబు. 121

క. పరమపతివ్రతయగు నీ
తరుణీమణిఁ బాయనెట్టి ధైర్యముగలిగెన్
పరుసఁ దన యంతవచ్చిన
నరవర యెఱుఁగనన నెట్లు నాలుక యాడెన్. 122

గీ. గుణవతియుఁ బుత్రవతియును గులవతియును
నైనభామను విడుచు నన్యాయకారి
కిహపరంబులు లేవని యెడు సమిద్ధ
ధర్మశాస్త్రంబు తెలుఁగవా ధరణినాథ. 123

ఉ. అద్దములోని నీడవలె నాకృతియందొక లేశమాత్రముం
బిద్దముగాక నీకుఁ బ్రతిబింబమువోలె వెలుంగుచున్న యీ

పెద్దకుమారు, భూవర, యభిన్నమతి న్మొగమెత్తి చూడుమా
ముద్దియ నీవయిం గలుగు మోహము భక్తియుఁ గాననయ్యెడున్. 124

వ. అనిన నవ్వచనంబులకు రాజు కటకటంబడి మీర లాఁడువారలు మీతోడ నిట్టిట్టయనుట యుక్తంబుగాదు ఆశ్రమంబునకు నేఁడు, ఱేపట, యెల్లి యెల్లుంట వచ్చి కణ్వమహామునీంద్రుంగని తదాదిష్టమార్గంబున నడచెదం గాని పొండని, దిగ్గనలేచి, పెద్దమొగసాలకు వచ్చి సభామధ్యంబుననుండఁ గాస్యపశిష్య, మౌనిమానవ, త్యనసూయాప్రియంవదలు, శకుంతలా కుమారుల, వెన్నడి తోకొని తోడనవచ్చి యుచితస్థలంబున నిల్చి రందు ననసూయా ప్రియంవదలు కోపపిహితేక్షణలై యంతరిక్షంబునకు హస్తంబులెత్తి యొత్తిలి సకలజనంబులు విన నిట్లనిరి, 125

సీ. దేవతలార యోదిక్పతులార న
క్షత్రంబులార యోగ్రహములార
చంద్రార్కులార యోసప్తాంబునిధులార
నదులార యోగోత్రనగములార
పరమపూరుషులార పంచభూతములార
వృక్షంబులార యోపక్షులార
దిశలార యోనిశానిశలార పార్వతీ
శ్వరులార యోరమాచక్రులార

తే. జనునివృత్తంబు మీరెఱుఁగనిది
గలుగ దీశకుంతల మేలుఁ గీడేర్పరించి
. . . . . . . . . . . . . . . . . . . . .
ప్రకటముగఁ జేయుదురుగాక ప్రజలెఱుంగ. 126

మ. అను నాలోనన తత్సభాజనము లత్యాశ్చర్యముంబొంద నో
జననాథోత్తమ యీ శకుంతల మహాసత్యవ్రతాన్వీత త
త్తనయుండు న్భవదీయ వీర్యజుఁడు సత్యంబౌమఱి న్సత్యమో
ననుమానింపకుమంచు మ్రోసె వడి నయ్యాకాశవాణీధ్వనుల్. 127

ఉ. ఆపలుకు ల్వేసన్ వినుచు నా గ్రహవృత్తి శకుంతలాంగుళీ
స్థాపితమైనయుంగరముఁ జయ్యన నూడిచి నీయి పై చి [illegible]
పాపపురాజ యెట్టిదియు బాలిక వ్రేలిక వచ్చెఁ జెప్పుమా
యీప్రజలేగతిం బనిచి రేగెద మాఁగితినన్న నయ్యెడన్. 128

సీ. విస్మయక్రాంతులై వినువారు కొందఱు
జగతీశునెడఁ జాల నెగులువడిరి
మహనీయమతి నధర్మంబు చేసితివి నీ
వని రమాత్యులు మాన్యులైనవారు
నృపతి నేమియు ననవేర కూరక వృద్ధు
లును బంధువులుఁ జెవుల్మూసికొనిరి
యాఁటడి నోములయ్యెనుగదా దనకంచు
వెస శకుంతల వెక్కి వెక్కి యేడ్చె
తే. నంగుళీయక భావోదయంబు చేత
నత్రి సంభవశాపజంబైన, నృపతి
మేనకాసుతమీఁద నజ్ఞానమొకవఁ
గ్రమ్ముకొనియున్న, చిమ్మ చీకటులు విరిసె. 129

వ. అయ్యవసరంబున, 130

సీ. విశ్రామగతి వేఁట వెడలిన చందంబు,
మునిజనాశ్రమము చొచ్చినతెఱంగుఁ,
దరుని షేచనవేళఁ దానేగినవిధంబుఁ,
గణ్వనందనఁ బొడఁగనిన రీతి,
యన్యోన్య సంప్రీతి నలరినలాఁగు,
గిద్దఱును విరహాగ్ని వేఁగిన విధంబు.
గాంధర్వవిధిఁ గరగ్రహణమందిన జాడ,
యచ్చోట సంగమంబైన భంగి.
తే. గమనవేళవియోగప్రకార మింత
వట్టు భావంబులును మొనకట్టుకొనుచుఁ

గాఁడియేతెంచి మనసుతోఁ గుప్పగొనిన
మోహాభర మోరువక మూర్ఛ మ్రొగ్గె విభుఁడు 131

గీ. అల్లనల్లన తెలిసి ధైర్యంబునూఁది
చక్కఁ గూర్చుండి. తలయూఁచి, ముక్కుమీఁద
వ్రేలుఘటియించి, మిగులఁ గ్రొవ్వేడి
యొదవ, దట్టముగ దీర్ఘ నిశ్వాసధారవఱపె. 132

సీ. అత్యంత కుపితాత్మలై తన దిక్కుచూ
చు ప్రియంవదను ననసూయఁ జూచి
కన్నీరు మున్నీరు కాలువలై వెల్లి
గొనఁ జేయు మేనకాతనయఁ జూచి
యవయవశ్రీఁ దన యచ్చొత్తినట్లున్న
కులదీపకరుఁడైన కొడుకుఁ జూచి
నామాక్షరప్రమాణ దినంబునకుఁదేర
గిరవున్న ముద్రయుంగరముఁ జూచి

తే. ద్రష్ట లెన్నెడు మంత్రివర్గంబుఁ జూచి
ధర్మముడిగితి వనెడు మిత్రములఁ జూచి
పలుదెఱంగుల నాడెడు ప్రజలఁ జూచి
తన యవజ్ఞాప్రకారంబుఁ దలచిచూచి. 133

శా. ఆ చంద్రాన్వయ సంభవుండు మృగయావ్యాపారముం బుప్ప నా
రాచప్రేరితుఁడై శకుంతలకు ధర్మస్వాంతము ల్నాటుగా
వాచానిష్ఠవరంబు లిచ్చుటయు సర్వంబు న్యథార్థంబుగాఁ
దూచా తప్పకయుండఁ జెప్పె నిజబంధు ల్మంత్రు లాప్తు ల్వినన్. 134

గీ. కొడుకు నా యంతవాఁడయ్యెఁ గడు;
నెదిగెను దేహమాత్రంబె చిక్కె గాధేయ తనయ
తలఁపులే కింతకాలంబు తడయుటెట్లు
తెలవకిచ్చిన సత్యంబు మఱచుటెట్లు. 135

సీ. గణనాధికముగ యాగములు గావించినఁ
బాయునే యీ మహాపాతకంబు
చతురబ్ధి మధ్యభూస్థలి దానమిచ్చినఁ
గడచునే యిమ్మహాకల్మషంబు
సప్తముక్తి ప్రదేశములు దర్శించిన
దొలఁగునే యిమ్మహాదుష్కృతంబు
కర్మహారేశ్వరాగ్రం బెక్కి పడినను
గెడయునే యిమ్మహాకిల్బిషంబు
తే. ధర్మపథవర్తు లిట దన్నుఁ దలఁచినపుడు
కర్ణములు మూసికొని యెడఁ గలిగి చనరె
పలుకులేల యసత్యవాదులకు నెల్ల
నుర్విపై నేన యగ్రగణ్యుండనైతి. 136

వ. ననుచు నిందానురూపంబులగు ననులాపంబులం జరుపుచున్న యవస
రంబున, 137

సీ. కర్పూరనవపరాగవిపాండుతనుకాంతి
యకఠోరచారుచంద్రికలు గాయ
వికటారకూటవల్లికశారమగు పెద్ద
మగుటంబు రేయెండ చిగురునీన
హరిణాజినోత్తరీయచ్ఛాయ బ్రహ్మతేజః
కృశానుని పొగచాయ నెరయఁ
గుటిలహావిర్మషీకుబ్జలలామంబు
నొసలిపైఁ జీఁకటి మూగువారు
తే. నచతురానన పద్మజుం, డనలికాంతు
శంకరుం డచతుర్భుజ చక్రపాణి,
యఖిలలోకైక సంపూజ్యుఁ డరుగుదెంచె
నారదుఁడు కాంతి జితశరన్నీరదుండు. 138

క. చనుదెంచిన మునిపతికిం జనపతి
యెదురేగి వినయసంభ్రమముల న

ర్చనలొసఁగ సముచితాసనమున
యం దుపవిష్టుఁడై ప్రమోదము తోడన్. 139

వ. రాజు వదనంబునం జూడ్కి నిలిపి యింత యేల సంతప్త మానసుండవై యున్నవాఁడవు నీ స్వాంతం బత్యంతనిర్మలంబు నీకు నొకదోషంబుఁ గలుగనేర్చునే ఆశ్రమంబుననుండి నీవు పురంబునకు నరుగుదెంచునెడ భవదీయ విరహాక్రాంతయైన శకుంతల, దుర్వాసమునీంద్రుండు వచ్చిన నుచిత సత్కారంబులు సేయ నెఱుంగకున్న, నతం డలిగి యిచ్చిన శాప తిమిరంబు నిన్నుం గాననీదయ్యె ముద్రికాదర్శనంబున శాపావధియుం బ్రసాదించె నని తద్వృత్తాంతం బాద్యంతంబునుం దెలియం జెప్పి చిత్తంబునుత్తలంబు డించి కుమారునిం జూపి యీ శాకుంతలుండు సకల మహీచక్రంబును జక్రవర్తియై పాలించు 'భవద్వంశంబు నితనిపేర భరతవంశంబనం బ్రసిద్ధింగాంచు నితని యువరాజుం జేసి శకుంతలయు నీవు ననేకకాలంబు దాంపత్య సౌఖ్యంబనుభవింపు మనినం దదనుశాప నంబున, 140

సీ. మునిభామినులతోడ ననసూయతోఁ
ప్రియంవదతో శకుంతలావనజవదన
నంతఃపురంబున కనిపినం బతియాజ్ఞఁ
బరిచారికలు భయ భక్తులలర
జడల యల్లికలూడ్చి, సంపెంగ
నూనియ శిరసంటి సీకాయ జిడ్డుదిగిచి
గంగాంబువుల జలకంబార్చి, తడియొత్తి,
రమణీయచీనాంబరములుగట్టి,

తే. వెంద్రుకలు చిక్కువాపి, క్రొవ్విరులు దుఱిమి,
పలుచగా మేన చందనపంకమలఁది,
యవయవంబుల కర్హంబు లైనభంగి
లలిత మణిభూషణముల నలంకరించి; 141

చ. ఇనుడు ప్రభావిలాస మెరవిచ్చినదో యనమేనఁ బొల్చు నూ
తనమణిభూషణద్యుతి వితానము గ్రమ్మఁగఁ గ్రొమ్మొలుంగు చా
డ్పున నడనేర్చు చిత్తరువు పోలికఁ బుత్తడిబొమ్మభాతి మో
హనగతితోడ మంగళగృహంబునకుం గొనివచ్చి యచ్చటన్. 142

గీ. హేమపీఠంబుమీద నయ్యింతి నునిచి
రాజునకు విన్నవింప నారదపురస్స
రంబుగావచ్చి శుభముహూర్తంబునందు
నమితకల్యాణ వాద్యఘోషములు చెలఁగ. 143

క. నరపతి ప్రమోదరస సం
భరితుండై తనకు సగ్రమహిషింగా సు
స్థిరమతితోడఁ శకుంతలఁ
బరువడి ప్రజలెల్లమెచ్చఁ బట్టముఁగట్టెన్. 144

గీ. ఇంతిఁ బట్టముగట్టి యనంతరంబు
తనకు దండంబు పెట్టిన తనయుఁ గ్రుచ్చి
బిగియఁ గౌఁగిటఁ జేర్చి సంప్రేమఁ జేసె
మానితానందజలముల మజ్జనంబు. 145

సీ. సచ్చందనముకంటెఁ, జందనంబునఁ గల
పంబుచేసిన కప్పురంబుకంటెఁ,
బుప్పొడికంటెఁ, బుప్పొడిలోనఁ జొరలించి
వెలచిన చెంగల్వ విరులకంటె,
హిమజలంబులకంటె, హిమజలంబుల నాన
వైచిన కిసపల్లవములకంటె
నిండువెన్నెలకంటె నిండువెన్నెలచేతఁ
బదనైన చంద్రబింబంబుకంటె
నెరయఁగూర్చిన వీనియన్నిఁటికంటె
నిసుమడియు ముమ్మడియునైన మనుజవిభుని

యుల్లమెల్లను మిగులఁగఁ జల్లఁ జేసె
నందనాలింగనమునఁ జెన్నొందుసుఖము. 146

వ. ఇత్తెఱంగునఁ బుత్త్రాలింగన సంగసౌఖ్యంబున నాన్నృపాలపుంగవుండు కొంతతడవు తన్మయత్వంబునొంది యనంతరంబ శతానందసంకాశు మతంబున నందనుని యువరాజ పట్టంబుఁగట్టి సమకట్టి యమాత్యులం బిలిపించి సముచితాసనంబుల నునిచి తదాననంబులం బ్రసన్నావలోకనంబులు నినిచి మధురగంభీరస్వరంబున నిట్లనియె, 147

ఉ. ఏలితి నేను భూభువనమెల్లను వైరము లేకయుండఁగా
వ్రాలిన భూమిపాలకుల వంచి కరంబులు గొంటి జన్నము
ల్చాల నొనర్చితిం బ్రజలు సంతసమందఁగ బంధుకోటిచే
మేలనుపించుకొంటిఁ బగుమీ ఘననీతి బలంబు పెంపునన్. 148

గీ. నాకు మీనీతిపదము సుశ్రీకి నెలవు
మంత్రిలేకున్న రాజ్యంబు మనుజపతికిఁ
బెక్కువది యెంతగలిగిన బీలికాఁడు
లేని పేకోడ, చక్రంబులేనిరథము. 149

క. కావున మీ ఘనబుద్ధి
శ్రీవిభవం బూఁతగాఁగ శేషాహికుల
గ్రావళిరోభరితం బగు
భూవలయముభరము నేను బూనితిఁ బేర్మిన్. 150

గీ. పెద్దవాఁడనైతిఁ బృథివిభారం బింకఁ
బూన వయసు గాదు పుత్త్రుఁడెల్ల
భరము బూనఁగాఁ దపస్వినై సుఖలీల
వనమునందునుండ వయసుగాని. 151

క. లక్షణయుతుఁగా భరతుని
వీక్షింపుం డర్హుఁ డయ్యెనేఁ గావింపుం

డీక్షితి యువరాజ్యరమా
ధ్యక్షుండై రక్షసేయ నభిషేకంబుఁ. 152

క. నావుడు వారలు విభుతో
భూవర భవదీయవాక్యములు మాకానం
దావహములు నీతనయుం
డీవిశ్వము నేలఁజాలు నిద్ధవిభూతిన్. 153

సీ. ఆయతలోచనుం డాజానుబాహుయు
గళుఁడు కవాటవక్షస్థలుండు
కోమల జఠరుండు గూఢజత్రుండు వి
శాలఫాలుండు, వృషస్కంధధరుఁడు,
కఠినహస్తతలుండు, కమఠోపమానాంఘ్రి,
యభిరామశిరుఁడు, మహోహానుండు
చండాంశుతేజుండు, సంపూర్ణపూర్ణిమా
శరదిందుబింబభాసురముఖుండు,
తే. నీతిమంతుండు, గాంభీర్యనిధి, వివేక
మహితమూర్తి, యలోకసామాన్యబలుఁడు,
నీతనూజుండు, పెంపున నిన్నుఁబోలుఁ
గట్టుపట్టంబు యువరాజుగాగ నధిప. 154

వ. అనివిన్నవించు మంత్రులవాక్యంబులకు సంతసిల్లి పురోహితహితభృత్య బంధుమిత్రాది మాన్యజనంబుల రావించి, సంభావించి, తానుగావించిన ప్రయోజనం బెఱింగించి, మంత్రుల సమ్మతంబునఁ, బ్రజల యనుమతంబునఁ, గార్తాంతికోపదిష్టంబగు శుభముహూర్తంబునఁ, గార్తస్వరభద్ర పీఠంబునఁ గుమారునలంకరించి యునిచి 155

చ. అనఘులు ధారుణీసురు లయప్రదమంత్రములుచ్చరింప, శో
భనకరవాద్యఘోషములు బంధురభంగిఁ జెలంగ, నర్వభూ
జనములు సన్నుతింప, విలసన్మతి బంధులు సంతసింప, వేఁ
కని విభవంబు పెంపెసగఁగట్టె సుతు న్యువరాజపట్టమున్. 156

మ. తనయుం బట్టముగట్టి డెందము ప్రమోదం బందఁ బంకేజభూ
తనయుం గన్గొని కేలుమోడ్చి మునివేదండా! భవచ్ఛాసనం
బున శాకుంతలు యౌవరాజ్య పదవిం బొలార్పగా నిల్పితిన్
జనతాపాలనహేతునీతి నుపదేశం బిమ్ము నీవిమ్ములన్. 157

క. అని నిజనందను నజనం
దనుచరణంబులకు వందనము సేయింపన్
మునిపతి సంతుష్టుండై
జనపతి నాశీర్వదించి శాకుంతలునిన్. 158

వ. గాఢాలింగనంబు చేసి సమీపంబున నునిచికొని తదీయవదనారవిందంబునం
జూడ్కి నిలిపి యిట్లనియె, 159

సీ. మణుల గద్దియచుట్టు మండలేశులు గొల్చి
యుండఁ బెంపునఁ గొలువుండునపుడు
సౌధాగ్రవీథులఁ జంద్రశాలలయందుఁ
దెఱవలతో వినోదించునపుడు
గీతవాద్యకళా వినూతన సుఖగోష్ఠి
నిచ్ఛమైఁదగఁ బ్రొద్దుపుచ్చునపుడు
రాజపూజ్యములైన రాజభోగంబులు
కిలుకుగాకుండ భోగించునపుడు
తే. వసుమతీరక్షయందు మానసమునిల్పి
లలితసప్తార్ణవీమేఖలాధరిత్రి
నేకపురిఁ బోలెఁ బాలించె నింతకాల
మనఘ మీతండ్రి వినుము దుష్యంతవిభుఁడు. 031

క. మీతండ్రి యట్లు నిర్మల
నీతిపథంబునఁ జరించి నిజభూప్రజకుం
బ్రీతియొనర్చుచుఁ బొందుము
ప్రాతః పాండురపయోజభాసురకీర్తిన్. 161

గీ. నీతిపథమున మతి గెంటనీక పూర్వ
రాజచర్యకు నతితత్పరత ఘటించి
వసుధఁ బాలింపు తగులకు వ్యసనములకు
వ్యసనికగు చందములు విను వరుస వత్స. 182

సీ. మొదల నర్థ వ్యయంబునకు సుత్తిగ వెట్టుఁ,
బెట్టి జీవనముపైఁ బ్రీతి విడుచు,
విడిచి యసన్మార్గవృత్తికిఁ జేచాఁచుఁ,
జాఁచి యాచారంబు చౌక సేయు,
చేసి దుర్జనుల గోష్ఠికి మానసముఁ దూర్చుఁ,
దూర్చి ప్రాభవలక్ష్మిఁ దొలఁగఁదోలుఁ,
దోలి ధూర్తస్థితి మేలుగాఁ దలపోయుఁ,
బోసి యన్యాయంబు పొత్తు గుడుచుఁ,
తే. గుడిచి బంధుల కెడయగుఁ, గులము వాయు,
బైసి పోకార్చుకొనుఁ, బాపపంకనివాతిఁ
గూలుఁ గాల్జారి నారకకూపమునను.
సంతతస్త్రీరతుండు దుష్యంతతనయ. 183

సీ. ఆహారవేళ శయ్యారతి యంతఃపు
రాంగనా కేళి సౌఖ్యములు దొఱఁగు
గెలుపోటములు రెంటివలన నుత్సాహ దై
న్యములఁ జిత్తము ప్రీతిఁ ... దెప్పుడుఁ
దమియు మత్సరము రెండమున నంతంతకుఁ
బొడమి కానఁడు ప్రొద్దుపొడుపుఁ గ్రుంకు
నెకసాయమై పందెమెక్కించి యోడెనేఁ
గల ధనంబెల్లను బోలిసిపోవుఁ
తే. గెలని నోడించు విధముఁ దా గెలుచు విధముఁ
దలచుకొనుచును రాజ్యతంత్రంబు చాఁగు

రీతిఁ గోల్పడి యంచితఖ్యాతిఁ బాయ
నెడప నొవ్వదు జూదంబు నృపకుమార. 164

సీ. పోశెంబు పరువులఁ బొడము ఖేదంబున,
దగవొట్టి, వడదాకి, తనువునలఁగు;
నన్నోదకంబు లాయాయి వేళలలేక,
యొకరోగమెద్దియే నుద్భవించు;
వలమీఱి క్రూరసత్త్వము లాగ్రహంబునఁ
బయివచ్చెనేని నొవ్వమి ఘటిల్లుఁ,
దఱివేచి పొదలలోఁ దరులచాటున శత్రు
లనరుగాఁచినఁ బ్రాణహానిపుట్టు,
తే. నన్వయాగతధర్మంబు లాచరింపఁ
గాలవేళలు తప్పుటఁ గలుషమందు;
నందునష్టతఁ బొందు రాజ్యాభివృద్ధి,
వలనుగానిది వేఁట భూవరతనూజ. 165

సీ. త్రావి[1]యానాడు మత్తాగొని పొరలాడు
నెఱుఁగఁ డుల్లములోన చెదిరిఁ దన్నుఁ
బనిలేక చూపుఁ గోపప్రసాదంబులు
భావింపనేరఁడు పాపవరుస
విప్రలాపములాడు విడువనివేలంబు
మాటనొక్కటి లేదు మాటనిజము
గుప్తిసేయగనోపఁ డార్తరహస్యంబు
లైనకాలములు దెలియంగలేఁడు
తే. లజ్జవొలియించుఁ దాలిమి యుజ్జగించు
నిందకొడిగట్టు శీలంబు చిందఁ జేయు
బ్రహ్మహత్యకు మిలుసూపు పాపవితతి
పానగోష్ఠివిధంబు భూపాలపుత్ర. 166

1. i. యా రోజు; ii. యే రోజు.

సీ. తల్లిదండ్రులకు డెందము విరక్తిభజించు
నన్నదమ్ములకు పేరాసపడును
గులకళత్రము పుట్టినిలుసేర నూహించు
ప్రాణమిత్రుండును బగతుఁ డగును
బావలు మఱఁదులేర్పడ మోముఁ జూడరు
దాసదాసీజను ల్వేసరుదురు
తలఁగిపోవుదురు తాతలనాఁటి హితులుఁ జు
ట్టాలు మేల్గీడు మాటయు నడుగరు
తే. పాలనముసేయు చేపట్టి ప్రజలఁ జాపు
సకలజనులకు నట్టింటి శత్రుఁ జేయు
నయము కెడయాక యెల్లవెంటలను జెఱచు
మాటపరుసదనంబు కుమారచంద్ర. 167

సీ. అపరాధమునకు నర్హముగాక వెగ్గలం
బగు శిక్షఁ బ్రజచాల వెగడు గుడుచు
బెగడొంది మనసునఁ జేఁడెత్తి నిలువక
పేఱొండుకడఁ గాపు విచ్చిపోవు
వినయహీనతఁ గాపు విచ్చిపోనిచ్చిన
నచిరంబు పాఱడయగుధరిత్రి
ధరణి పాఱడయైన సరిగోరు మొదలుగాఁ
దనకు ఘటిల్లు నాదాయనష్టి
తే. ధాన్యధనములయందు నాదాయనష్టి
యైన నిర్ధనుఁ డగు ధనహీనుఁ డైనఁ
దొడగిపట్టు దరిద్రంబు దొలఁగులక్ష్మి
యుగ్రదండంబునను నృపాలాగ్రసూతి. 168

సీ. ధీజనస్తుతముగా దేహసౌఖ్యమున నం
కిలిలేక యుండ భోగించుచోట

బడిదప్పి నిరయకూపములఁ జూడకయుండఁ
దిగిచి ధర్మంబు సిద్ధించుచోట
వృద్ధరాజులు గారవించు లోకత్రయీ
వర్తిని యగుకీర్తి వచ్చుచోట
నవిశంకతోడ మూఁడవ యుపాయంబున
వైరిదుర్గంబులు చేరుచోట
తే. బుధులు హితులును బంధులఁ బ్రోచుచోట
నెంతచేసిన నది ఫలియించుగాని
వలదనర్థకములసొమ్ము వమ్ముసేఁత
మతిఁ దలంప రాజాన్వయక్షితివహంస. 169

చ. నెలఁతయు జూదముం బగటినిద్రయు వేఁటయుఁ బానము న్సదా
వలవని నిర్గమంబుఁ బరివారము వాద్యము నాటపాటలు
న్నిలనగు కామజంబు లివి యిందతిసక్తుడుగాక మైవడిన్
వలయు నొనర్పనెందు దశవర్గమున న్శశివంశభూషణా. 170

క. అంగములు పతికి విను స
ప్తాంగములును వానిఁ దగు సమంచిత గతి సా
రంగాంకవంశతిలక పొ,
సంగును రక్షించుకొనఁగ జననాథునకున్. 171

సీ. శక్తిత్రయంబునఁ జతురుఁడై చతురుపా
యంబులకును సమయంబెఱింగి
పంచేంద్రియముల నిర్జించి స్వాయత్తుడై
షడ్గుణీగరిమఁ బ్రశస్తిఁ గాంచి
వ్యసనంబులేడును వర్జించి రాజదో
షములు పద్నాల్గుఁ జిత్తమునఁ దెలిసి
సాక్షిమాత్రంబుగా సచివుఁ బ్రతిష్ఠించి
యాత్మయత్నము లేశమంతయైన,
తే. నింగితాకారచేష్టల నెఱుఁగనీక
పరులనెవ్వరి విశ్వసిఁపక మనమున

సంతతంబు శరీరరక్షాక్రమంబు
లేమఱక యుండవలయు మహీవిభుండు. 172

సీ. పతిహితుం డతి ధర్మపరుఁడునీ,
తి ధురీణుఁ డింగితజ్ఞుండు, జితేంద్రియుండు,
మంత్రరక్షకుఁ, డన్యమర్మభేది, ప్రజాను
రాగి, సుశ్రోత, నీరాగి, భోగి
యుచితయత్న తరస్వి, యుత్ఫ్లోచవి ముఖుండు,
శాంతుఁ డతిప్రౌఢ సత్యవాది
పరధనపరదార పరపరివాదవ
ర్జితుఁడు ప్రఖ్యాతుండు శ్రీకరుండు,
తే. బ్రాహ్మణుఁడు మంత్రిగాఁ దగుఁ
బరిగణింప గుణములిట్టివిగా సమకూరెనేని
క్షత్రియుని శూద్రునిం దప్ప సచివపదవి
వైశ్యునిలుపంగఁ దగవు భూవల్లభునకు. 173

సీ. కూరిమి భృత్యుఁ, డెక్కుడు లావు, వలచేయి
మతి రంజకుఁడు, పీఠమర్దకుండు
కట్టినయలుగు, సంగరసహాయుఁడు, మాని
మఱుఁగు పెట్టనికోట మంత్రహితుఁడు.
చనవరి, దొర, ప్రతిజ్ఞాపాలకుఁడు బహిః
బహిఃప్రాణంబు, పట్టము భద్రగజము
ముంగొంగు పసిడి, సప్తాంగరక్షకుఁడు చేఁ
దోడు, నెచ్చెలికాఁడు, తోడునీడ
తే. యనఁగ నిన్నిగుణంబులు నావహిల్లి
పాలునీరును బోలి యేర్పఱుపరాని
సముచిత స్నేహమున నెడసందులేని
మిత్రమర్త్యంబు వసుధాకళత్రునకును. 174

సీ. తనయేలు వసుమతీజనులఁ బీడింపక
యేరికి మొదలిచ్చి కోరుపాలు
సవరగాఁ గొంచు దండువులు దర్శనములు
కోలాసగొన, కూళ్ళు గుత్తకీక
కమ్మతంబులు వెట్టి గనులుత్రవ్వించి చే
హారమాడించి యన్యాయధనముఁ
జొరనీక, షష్టాంశ మరిగొంచు, నీతిబా
ధలు ఘటింపక యుండ, ధనముకూర్చి
తే. దానిఁ జతురంశములు చేసి దానధర్మ
ములకు నొకపాలు గైకొని మూఁడుపాళ్ళు.
వెచ్చమునకును రానీక యచ్చువొడిచి
డాపవలయు విభుండు భండారమునకు. 175

సీ. ఏటి కాల్వలు పరిపాటిగాఁ దీర్పించి,
చెఱువుల నీరుండ నొఱవు దెలిసి
దేవమాతృకలు నదీమాతృకలునైన
గ్రామసీమ క్షేత్రగతులు దెలిసి
నీరునేలలు వానకారులు పరికించి
వరిపొలంబుల పంటవలఁతు లరసి
కోరాయములు వచ్చు కొలఁది విచారించి
పదియూళ్ళ కొకరిఁ దీర్పరిగఁ జేసి,
తే. చనవు వారలు, పనివారు, శాత్రవులును,
జోరులును, జేయు బాధలు చేరకుండఁ
బ్రజలఁ బాలించుకొనుచుఁ దత్పరత సాను,
రాగుఁడై ప్రోవవలయు రాష్ట్రంబు రాజు. 176

సీ. అగడిత యూఁతనీరగునట్లు త్రవ్వించి
క్రొత్తడంబులతోడఁ గోటఁదీర్చి,
యట్టళ్ళు కల్పించి, యద్వారి విరివిగా
వలనొప్ప గట్టించి, వంకధార

గవనులు పరిపాటిగా వినిర్మింపించి,
లోన నూతులు, బావులును, నగాధ
జలములుగాఁ, జాలఁ గలిగించి రసవర్గ
ములు వేఱ సంపూర్ణములుగ నించి,
తే. చుట్టు నామడ చుట్టును సూదిమోప
నెడము కల్గకయుండఁ బేరడవి పెంచి
నగసమీపంబు గల పట్టనంబు రాజ
ధానిగా నుండు టురవగు ధరణిపతికి. 177

సీ. తఱితోడ జీతంబు కొఱఁతగాకుండ రొ
క్కంబు భండారు ధనంబు యిచ్చి
బంటుఁ దొలంగించి ప్రతియు వెట్టకయుండ,
గమి లెక్క తక్కువగాకయుండఁ,
గడగి వేశ్యాగామి గాకుండఁ బరికించి,
ప్రతి భానువారంబు భటులతోడు
చూచుచుఁ దనవన్నె జోకయై యుండిన
వాని మన్నించుచు, లేనివాని
తే. నాజ్ఞ సేయుచు, జీవిక కప్పువడక
యుండఁ బరికించు కొనుచు నా యోధనమున
నైదువది సేయ కుత్సాహియైన యాప్త
బలము నేలఁగవలయు భూపాలకుండు. 178

క. అని యిదిమొదలుగ మఱి
యును జనపతులకు వలయు నీతి, సమధిక బుద్ధిన్
జనపాలనందనునకును
మునిపాలుఁడు చెప్పి యుల్లమున ముద మొదవన్. 179

వ. ఆశీర్వదించి, దుష్యంతు నభినందించి, కణ్వమునీంద్రుండు పుత్తెంచిన శకుంతలం దోడ్కొని వచ్చిన మునులను, మునిపత్నులను, ననసూయా ప్రియంవదలనుం, బ్రియపూర్వకంబుగ సముచిత ప్రకారంబుల ననిపించి

దుష్యంతుని వదనంబునం జూడ్కి నిలిపి నరేంద్రచంద్ర, యింద్రునకు జయంతునిం బోలి, నితాంతప్రీతి నీకు శాకుంతలుండు సంపాదింప, శంపాంబుధరంబులం బోలె శకుంతలయును నీవును నితాంతసౌఖ్యవంతులరై రాజ్యసుఖం బనుభవింపుడని దీవించి యాశ్రమంబునకుం బోయెద ననిన భూమింజయుండు కంజాసన తనూజునకు నంజలిచేసి మంజుభణితి నిట్లనియె, 180

సీ. ఇందు వంశజులలో నేఁ గృతార్థుఁడనైతి
నాజన్మ మధిక ధన్యత వహించె
రాజదోషములు చేరవునన్ను నిందుండి
మంగళంబులకు సద్మంబనైతి
నంతరాయములు శూన్యతఁ జెందె రాజ్యర
మాభివృద్ధికి సంశయంబు వాసెఁ
బుణ్యంబులెల్ల నిప్పుడు చాలఫలియించె
నంహస్సముచ్చయం బణఁగిపోయె
తే. నెన్నికకు నెక్కె మద్వంశ మితర వసుమ
తీశ్వరులలోన, నాసరి యిండ్లలోన
సంయమీశ్వర తిలక యిచ్చటికి మీరు
చిరకృపామతితోడ విచ్చేయుటయును. 181

వ. అని బహుప్రణామంబు లాచరించి, విరించినందను ననిచి, కుమారుండు యువరాజ పట్టభద్రుండై సకల మహీచక్రంబు నవక్రపరాక్రమంబున, ననన్య సామాన్య సౌజన్యంబునఁ, బాలనంబునం బ్రజలును, లాలనంబున బంధులోకంబును, బరమానందంబు నొందఁ జరింప, శకుంతలయుం దుష్యంతుఁడును బెద్దకాలంబు పూజ్యంబగు రాజ్యసౌఖ్యంబు ననుభవించుచుండె. 182

శా. కంజాటోపమధైర్య, విభ్రమవతీకందర్ప, దర్పద్విష
త్కంజాతామృతధామ, ధీమహిత, వారాశ్యన్వయగ్రామణీ
మంజీఘోషసరోజపూజనమహీమందార, లోకత్రయీ
మంజూషాహితకీర్తి, మౌక్తిక సుధామాధుర్య వాగ్వైభవా! 183

క. హరిదంత దంతి దంత
స్థిరకీర్తి విహార, సకల ధీజన వినుతా,
గురుధిషణ ధర్మమోదక,
శరనిధి గాంభీర్య బంధుసముచితరజా.

184

మాలిని. సతతసుకృత భాజా, సంతతశ్రీబిడౌజా,
క్షితిజనసురభూజా, చింతితత్యాగ
భోజా, ప్రతినవరవితేజా, భవ్యభాషాపరాజా.
హతవిమత సమాజా, యన్నమాంబా తనూజా!

## గద్యము

ఇది శ్రీ భారతీ తీర్థ గురుచరణ కరుణాలబ్ధసిద్ధ సారస్వత పవిత్ర
గాదయామాత్యపుత్ర యారాధితామర పిల్లలమఱ్ఱి
పినవీరభద్ర ప్రణీతంబైన శాకుంతల
శృంగారకావ్యంబునందు సర్వంబును
చతుర్థాశ్వసము

శృంగార శాకుంతల కావ్యము
సమాప్తము.